

# జాతీయ గీతం

- రవీంద్రనాథ్ ఠాగూర్

జనగణమన అధినాయక జయహే
భారత భాగ్యవిధాతా!
పంజాబ, సింధు, గుజరాత, మరాఠా,
ద్రావిడ, ఉత్కల, వంగ!
వింధ్య, హిమాచల, యమునా, గంగ,
ఉచ్ఛల జలధితరంగ!
తవశుభ నామే జాగే!
తవశుభ ఆశిషమాగే!
గాహే తవజయగాథా!
జనగణ మంగళ దాయక జయహే!
భారత భాగ్య విధాతా!
జయహే! జయహే! జయహే!
జయ జయ జయ జయహే!

## జాతీయ గీతానికి వందేళ్ళు.
## గీత రచయితకు 150ఏళ్ళు.

ఈ సందర్భంగా ఈ గీతాన్ని మరొక్కసారి మననం చేసుకుందాం.

# బలిపీఠంపై బతుకులు

## సంపాదకీయం...

కోటి ఆశలతో కొత్త సంవత్సరానికి స్వాగతం పలికేవేళ కల్తీసారా రాష్ట్రంలో మరోసారి మృత్యుఘోషను సృష్టించింది. కృష్ణాజిల్లా మైలవరం మండలం శోక నిలయమైంది. అలవాటైన మత్తుకోసం నాటుసారా సేవించిన గిరిజన తండా వాసుల్లో 19 మంది మృత్యువాత పడ్డారు. సర్కారీ లేబుళ్ళతో చీప్ లిక్కర్‌ను బెల్టుషాపుల ద్వారా, వీధి వీధిలో ప్రవహింపచేస్తున్నా, చాపకింద నీరులా నాటుసారా, గుడుంబా పోటెత్తుతున్నాయనేది పచ్చినిజం. జనాన్ని మద్యం మత్తులో ముంచి ప్రభుత్వ ఖజానా గలగలలాడించడమే ఎక్సైజ్ శాఖ లక్ష్యంగా పెట్టుకొని, నెల నెలా అందే "మామూళ్ళ"తో నాటుసారా కేంద్రాలపై శీత కన్నేస్తున్నదనేది జగమెరిగిన సత్యం.

ఇలాంటి ఉపద్రవాలు ముంచుకొస్తున్నప్పుడు అంతిమంగా ప్రభుత్వం మద్యం మాఫియా అడుగులకు మడుగులొత్తడమే మేలనుకుంటుంది. ప్రభుత్వానివి "ఉత్తర కుమారుని ప్రగల్భాలే"నని, అన్ని స్థాయిల్లో వేళ్ళూనుకొని విస్తరించిన మద్యం మాఫియాకు తెలుసు. వందమందికి పైగా శాసనసభ్యుల ప్రత్యక్ష ప్రమేయం, ప్రోద్భలంతో మద్యం రక్కసి యావత్ రాష్ట్రంపై కోరలు సాచింది. ప్రజలెన్నుకున్న ప్రజాప్రతినిధులే దారి తప్పితే చెప్పుకునే దిక్కెక్కడ? ఎం.ఆర్.పి రేట్లను తుంగలో తొక్కి దుకాణదారులు పోగేసే వేల కోట్ల రూపాయలు మద్యం సిండికేట్ల పరమవుతున్నాయి.

మంచినీళ్ళు సైతం లేని ఊళ్ళలో బెల్టుషాపుల దందా నడుస్తోంది. మద్యం షాపుల సంఖ్య పెంచడం లేదంటూనే ప్రభుత్వం "ఇంతింతై వటుడింతై" అన్నట్లు ఎక్సైజ్ ఆదాయాన్ని పెంచుకుంటుంది. మద్యంపై వచ్చే రాబడితోనే ప్రభుత్వ మనుగడ అన్నట్లుగా విధానాలు మార్చేయడమే ఇన్ని అనర్థాలకు మూలం. 2004 సంవత్సరంలో ప్రభుత్వ ఎక్సైజ్ రాబడి రూ॥3,834 కోట్లు ఉంటే ఈ ఏడాది రూ॥18,000 కోట్లు దాటనుంది. వ్యసనానికి బానిసలైన అభాగ్యులు రోజూ అంత మొత్తం వెచ్చించలేక, నాటుసారాను ఆశ్రయించి ప్రాణం మీదకు తెచ్చుకుంటున్నారు.

మద్యం కాటుకు భర్తల ప్రాణాలు బలైపోగా కుటుంబాల్ని ఎలా నెట్టుకు రావాలో తెలియక తల్లడిల్లుతున్న వేలాది తల్లుల గుండెల్లో సుడులు తిరిగే ఎన్నో ప్రశ్నలకు ఈ సర్కారే జవాబుదారీ. సర్కార్ ప్రతిష్టాత్మకంగా ఊదరగొడుతున్న సబ్సిడీ బియ్యం, ఇందిరమ్మ ఇళ్ళు, ఆరోగ్యశ్రీ, పింఛన్లు, ఉపకార వేతనాలు తదితర ఖర్చులన్నింటికి మద్యం రాబడి బంగారు బాతుగా మారింది. వలసల్ని ఆపేందుకు చేపట్టిన ఉపాధిహామీ పథకం ద్వారా, బడుగు జీవులకు చేరుతున్న సొమ్ములోని సింహభాగం తాగుడుకు పెట్టే ఖర్చు రూపేణ తిరిగి ప్రభుత్వ బొక్కసానికే చేరుతోంది. ఒక చేత్తో బడుగు వర్గాల సంక్షేమానికి వేలకోట్లు వెచ్చిస్తున్నామని చెబుతూనే, వారిని మద్యం మత్తులో ముంచి తేల్చుతూ వారినుంచే వేలకోట్ల ఆదాయాన్ని గుంజుతున్న తీరు హేయాతిహేయం.

ఒక ప్రక్క నాటుసారా కుటుంబాల్ని కబళిస్తుంటే "నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు" అన్న చందంగా ప్రభుత్వం మూడు కోట్ల లీటర్ల మద్యం అదనపు ఉత్పత్తికి అనుమతి ఇచ్చింది. అతి చిన్న వయస్సులోనే మద్యానికి బానిసలవుతున్న వారి సంఖ్య రాష్ట్రంలో పెరుగుతోంది. పదైదు ఏళ్ళలోపు వయస్సున్న తాగేవారి సంఖ్య ఈ పదేళ్ళలో 2 నుండి 14 శాతానికి పెరిగింది. బార్లు, మద్యం షాపులతో పాటు పబ్ సంస్కృతి వేగంగా విస్తరించింది. మద్యం తాగడం రాను రాను ఒక ఫ్యాషన్‌గా మారింది. తాత్కాలిక రాబడి కోసం మద్యం సంస్కృతిని ప్రోత్సహిస్తే, అది అంతటితో ఆగక యువతను అనేక రకాల మత్తులకు బానిసలుగా చేస్తోంది. దాంతో జాతి నిర్వీర్యమైపోతుంది.

కాసుల కోసం ఇలా ఎంతమంది అభాగ్యుల ప్రాణాల్ని బలిపీఠం పైకి నెడతారు? మద్యం, నాటుసారాతో విజృంభిస్తున్న మరణ శాసనాలు ఇకచాలు. ఈ విపత్తు నుంచి బయటపడేందుకు, ప్రత్యామ్నాయ ఆదాయ మార్గాలతో కూడిన ఆర్థిక విధానాన్ని ప్రభుత్వం రూపొందించాలి. అలా కాక మద్యం ప్రవాహంలో ప్రజలను ఇంకా ముంచాలనుకుంటే, ప్రజలు ఈ ప్రభుత్వాన్నే ముంచేస్తారు తస్మాత్ జాగ్రత్త.

## చైతన్య మానవి

### ఈ సంచికలో...




**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం**

రాష్ట్ర కార్యాలయం, బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్: 2,1-8-1,
బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ - 500 044.

ఫోన్ : 27605845.

సంపాదకులు

**ఎస్. పుణ్యవతి**

మేనేజర్

**ఎం. సుధ**

సంపాదక వర్గం

మల్లు స్వరాజ్యం
అల్లూరి మన్మోహిని
టి. జ్యోతి
కె. స్వరూపరాణి

**విరాళం రూ : 10/-**

ప్రజాశక్తి డైలీ ప్రింగ్‌ప్రెస్, అజమాబాద్, హైదరాబాద్ - 500 044.


### సూక్తి

జీవితమనే యుద్ధంలో గెలవడానికి ధైర్యాన్ని మించిన ఆయుధం లేదు.

- భగత్‌సింగ్



### చిట్టి చిట్టి పాపలం

- వైవిఎస్ కామేశ్వరి

చిట్టి చిట్టి పాపలం
చిన్ని చిన్ని జ్యోతులం
ఎంత తైలమందిస్తే
అంత వెలుగునిస్తాం ॥చిట్టి॥

లేత లేత మొగ్గలం
వికసించే పువ్వులం
కొంత ప్రేమ చూపిస్తే
సౌరభాలు పంచుతాం ॥చిట్టి॥

చిన్న చిన్న కాళ్ళతో
నడక నేర్చుకున్నాము
కొంత సాయమందిస్తే
లేచి పరుగు పెడతాం ॥చిట్టి॥

మొలుస్తున్న మొక్కలం
పాకుతున్న తీగలం
కొంచెమాధారమిస్తే
మీకు నీడనిస్తాం. ॥చిట్టి॥

# గత తలపుల సంక్రాంతి

- డా॥ డి.ఎల్. విద్య



తట్టి లేపింది సంక్రాంతి, గతపు తలపుల నెన్నో!
అమ్మమ్మ పల్లెతో అనుబంధమేదో,
తెరలు, తెరలుగ నాకు గుర్తొస్తు ఉన్నాది

చెట్లల్లో, చెలమల్లో, చేలల్లో, గాదెల్లో,
పండిన పంటల్లో, ధాన్యరాశుల్లో,
పచ్చని గడపల్లో, వెచ్చన్ని మమతల్లో,
ముగ్గున్న ముంగిట్లో, మురిపాల లోగిట్లో,
గడిచింది నా గతము, సంక్రాంతి వేళల్లో.

గంగిరెద్దుల వాని సన్నాయి సారము,
మెడ ఊపి చూపేటి ఎద్దు సన్నద్ధము,
హరిదాసు కీర్తనలొ వినిపించు కవనము,
బొబ్బిలి యుద్ధమును వర్ణించు వైనము
దాసరి స్వరములో అది ఇమిడిన చోద్యము
కాంచుట, వినుటయే మాకు సంతోషము.

చిరు చిరు చీకట్ల, తొలి వెలుగు రేఖల,
నడుమ, చలితోటి వొణికించు, ఆ తొలిసంధ్య వేళలో,
చల్ల చిలికేటి ఆ కవ్వపు, సవ్వడి గురుతుంది,
అమ్మమ్మ గాజుల, గల గలల రావమూ గురుతుంది
భోగి పిడకలు చేసే పంతమూ గురుతుంది
గొబ్బి పాటలు ఇంకా మరపు రాకున్నాయి.

మావయ్యల, పిన్నమ్మల పిల్లలతొ
పోర్లాడి ఆడిన ఆటలెన్నో గుర్తు.
అమ్మమ్మ ఇల్లే ఇల్లంటె ఇల్లు.
మా ఆటపాటలు, పువ్వులై పూచిన పొదరిల్లు.

బడిలోని పిల్లలతొ ఉన్నంత సందడి,
బసవయ్య మెడలోని గంటల్లొ సందడి,
మడిలోని పంటలు, పండిన సందడి
అమ్మమ్మ ఇల్లంత సందడే సందడి.
గోల గోలగ ఆడు పిల్లలో సందడి,
తాత చేయీ పట్టి పొలమెళ్ళు సందడి,
పిండి వంటలు చేయు అమ్మమ్మ సందడి,
సంక్రాంతి అంటేనె, సందడే సందడి.

ఆ గతము గతమే!
రాదాయె మరల
అమ్మమ్మ రాదు, తాతయ్య రాదు,
ఆట పాటల చెలికాళ్ళు, చెల్లచెదురయ్యారు,'

సంక్రాంతి వచ్చినా, ఆ శోభ రాదు
భోగి పిడకలు, గొబ్బి పాటలు, గంగిరెద్దులు
దాసరి స్వరములు, హరిదాసు కీర్తనలు, యాయవారాలు
అభ్యుదయమనీ కాదు, అవే లక్ష్యాలనీ కాదు
గతపు అనుభూతులనే, మరల అరుదెంచవనే
తీయ తీయగ తట్టు సంక్రాంతి
సందడైన గతపు తలపులను ఈనాడు.

పనిలేక మతిపోయి, గతితప్పి గమ్యమే కనరాక,
పల్లెపట్టులొ జనం, పట్టణం వైపే,
ఉరుకు పరుగుల వలస మొదలు పెట్టారు.
బోసిపోయిన ఊరు ఉసూరంటోంది.

పల్లె శోభలు ఎపుడొ మరల రానున్నాయి,
పల్లెవాసుల బ్రతుకు, పట్టణంతో సమం,
ఎపుడో కాకున్నాది.
మారిన విలువలతొ, మంచి మనసులతొ,
జనం పల్లెకు మరల తరలనున్నారు.
పండుగలు మారును, సంక్రాంతీ మారును
పండగలు మారినా, సంక్రాంతి మారినా,
సమక్రాంతి అరుదెంచి,
శాంతి కాంతిని నింపు పల్లె వాడల్లొ.

# అవినీతిపై యుద్ధం

- పి.ఎ.దేవి

**లక్షల కోట్ల విలువ చేసే వనరులను ప్రైవేటు పరంచేయటంతో (విమానాశ్రయాలు, నీరు, విద్యుత్ వంటివి) అవినీతిని అరికట్టడం కష్టసాధ్యంగా తయారైంది. 80 శాతం జనాభా ఆదాయం మొత్తం కలిపినా పది కార్పొరేట్ల ఆస్తులకు సమంకాదు, అటువంటి ఈ కార్పొరేట్లు మీడియాని, ప్రభుత్వాలను కూడా గుప్పెట్లో ఉంచుకున్నాయి. వీటి ధాటికి న్యాయవ్యవస్థ, పోలీసు యంత్రాంగం, లోకాయుక్త ఏదీ ప్రతిఘటించి నిలబడే స్థితి లేదు.**




అవినీతిపై పోరాటం అన్నా హజారేతోనే పుట్టిందనీ, లోక్‌పాల్ అనేది ఆయన కనిపెట్టిన అద్భుతం అనీ అనుకునే అమాయకులు చాలామందే ఉన్నారు. ఇదొక మంచి పనేకదా మద్దతిస్తే పోలా అనే ఉదారవాదులూ ఉన్నారు. ఇక మీడియా అయితే అన్నా భజన పారవశ్యంలో ఉంది.

ఈ నేపథ్యంలో అవినీతి విశ్వరూపం ఏమిటి? దాని మూలం ఏమిటి? దానిని ఎట్లా అరికట్టాలి అనే వాటిని ఒక సమగ్ర దృక్పథంతో పరిశీలించాల్సి ఉంది.

“అవినీతి పరుల్ని వీధి కరెంటు స్తంభాలకు ఉరితీయాలి” అని భారత తొలి ప్రధాని హూంకరించడానికి ముందే అంటే కాంగ్రెస్ ప్రభుత్వాలు బ్రిటీష్ కాలంలో ఏర్పడినపుడే వారి అవినీతి లీలలపై తెలుగు పోరాటకవి గరిమెళ్ళ అనేక పాటలు రాశారు. అంటే అవినీతికి, అధికారానికీ విడదీయలేని బంధం అనాదిగా ఉంది. దీనిపై అభ్యుదయవాదులూ, ప్రజాస్వామ్యవాదులు, వామపక్షాలు సుదీర్ఘకాలంగా పోరాడుతూనే ఉన్నారు.

ఫలితంగానే స్వాతంత్ర్యానంతరం తొలిసారిగా 1968లో లోక్‌పాల్ బిల్లును పార్లమెంటులో ప్రవేశపెట్టారు. అప్పటి నుండి 8సార్లు (1971, 1977, 1985, 1989,1996, 1998,2001లో)లోక్‌పాల్ చర్చకు వచ్చింది. ఈ అన్ని సందర్భాల్లో వామపక్షాలు, ఇతర ప్రజాస్వామ్య శక్తులు తెచ్చిన ఒత్తిడే లోక్‌పాల్ చర్చకు దారితీసిందని గమనించాలి. వామపక్షాల ఒత్తిడి వల్లే యుపిఎ తన 2004 ఎన్నికల ప్రణాళికలో లోక్‌పాల్ వాగ్దానం చేసింది.

ఇప్పుడు అవినీతిని అరికట్టేందుకు ‘లోక్‌పాల్’ అనే నినాదం ఊపందుకున్న నేపథ్యంలో ముందుగా అసలు అవినీతి అంటే ఏమిటో అర్థం చేసుకోవాలి.

## అవినీతి అంటే

అవినీతి అంటే లంచం తీసుకోవటం లేదా వివిధ పథకాల అమలులో ప్రజాధనాన్ని స్వాహా చేయటం మాత్రమే కాదు.

అవినీతి అంటే సహజ వనరులనూ, ప్రభుత్వ ఆస్తులనూ ప్రైవేటు పరం చేయటం. ఈ చేసే క్రమంలో పారదర్శకత, బహిరంగ వేలం, జవాబుదారీతనం లేకపోవటం.

ఫలితంగా సహజ వనరులు దోచుకోవటానికి (గాలి బ్రదర్స్‌లాగా) అవకాశం పొందినవారు, దోచుకున్న దానిలో కొంత రాజకీయ నాయకులకూ అధికారులకూ (దేవుళ్ళకూ) భాగం పెట్టి మొత్తం వ్యవస్థనే అవినీతిమయం చేస్తున్నారు. అంటే నిర్దాక్షిణ్యంగా ప్రజలనూ, ప్రజాధనాన్ని, సహజ వనరులనూ యథేచ్ఛగా దోపిడీ చేసుకోవటానికి కార్పొరేట్ సంస్థలకు అవకాశం కల్పించే ప్రభుత్వ విధానాలే కార్పొరేట్ మాఫియాను సృష్టించాయి. ఈ మాఫియాకు అన్ని చట్టాలనూ వంచగలిగే శక్తి ఉంది. అన్ని సంస్థలనూ...(స్వచ్ఛంద సంస్థలతో సహా) కొనగలిగే స్థితిలో ఉంది. ఓట్లు, పదవులూ చివరికి అసెంబ్లీని (కర్నాటక మాదిరి) కూడా అదే శాసిస్తుంది. లక్షల కోట్ల విలువ చేసే వనరులను ప్రైవేటు పరంచేయటంతో (విమానాశ్రయాలు, నీరు, విద్యుత్ వంటివి) అవినీతిని అరికట్టడం కష్టసాధ్యంగా తయారైంది. 80 శాతం జనాభా ఆదాయం మొత్తం కలిపినా పది కార్పొరేట్ల ఆస్తులకు సమంకాదు, అటువంటి ఈ కార్పొరేట్లు మీడియాని, ప్రభుత్వాలను కూడా గుప్పెట్లో ఉంచుకున్నాయి. వీటి ధాటికి న్యాయ వ్యవస్థ, పోలీసు యంత్రాంగం, లోకాయుక్త ఏదీ ప్రతిఘటించి నిలబడే స్థితి లేదు.

చమురు, గ్యాస్, ఖనిజాలు వంటి వాటిపై గుత్తాధిపత్యాన్ని కేవలం చిల్లిగవ్వలు చెల్లించి పొందుతున్నాయి ఈ కార్పొరేట్ సంస్థలు. దానిలో కొంత ఉన్నతా

ధికారులకూ, నేతలకూ వాటా చెల్లిస్తున్నాయి. అంటే ప్రభుత్వం అనుసరించే విధానాలు 'అవినీతి'ని అనివార్యమైన ఒక అవసరంగా, ఒక ఆచారంగా అలవాటు చేశాయి. భారీగా పన్ను రాయితీ పొందటానికి కొంత లంచం పారేయడానికి ఏ కంపెనీ వెనుకాడదు. నిర్ణయం చేసే అధికారంగల వారందరికీ (2జి కుంభకోణం), వారిని ప్రభావితం చేసే వారందరికీ (నీరారాడియా) తలాయింతా పారేస్తారు.



కాబట్టి ఈనాటి అవినీతి ప్రభుత్వ విధానాల విశ్వరూపమే.

## ఎందుకంత మద్దతు లభించింది?

అవినీతి ఎక్కడ జరుగుతున్నదో, ఎవరు చేస్తున్నారో పూర్తి సమాచారం ఉంది, దానిని అరికట్టే అధికారం, సాధనాలు ఉండికూడా ప్రభుత్వం చిత్తశుద్ధితో అవినీతిని అరికట్టే ప్రయత్నం కూడా చేయటంలేదు. నల్లధనం జాడతీసే రాజకీయ నిబద్ధత కూడా ప్రభుత్వానికి లేదని జనాభిప్రాయం.

హద్దూ ఆపూ లేకుండా అన్ని స్థాయిల్లో, ప్రభుత్వంలోనూ, బయటా జరుగుతున్న అవినీతిపై జనంలో అసంతృప్తి ఉంది. ఇటీవలి కాలపు భారీ కుంభకోణాలతో అది తీవ్రంగా పెరిగింది. ఈ అసంతృప్తికి గొంతుకనిచ్చింది అన్నా హజారే నిరాహార దీక్ష.

ప్రభుత్వం ప్రజాధనాన్ని రక్షించే సంస్థ అని, అది ఆ విషయంలో విఫలం అయ్యిందనే అన్నా ప్రకటనకు అన్ని వర్గాల ఆమోదం లభించింది. నిస్వార్థపరుడు, గాంధేయవాది, అవినీతి లేని వ్యక్తి, నిరాడంబరుడు కావడం జనామోదానికి మరో కారణం. ఇంత పెద్ద ఎత్తున ప్రజల మద్దతు, అందులోనూ మధ్య తరగతి మద్దతు లభిస్తుందని అన్నా బృందం కూడా ఊహించలేదు.

అన్నాకు మద్దతు కూడ గట్టడంలో మీడియా, ఇంటర్‌నెట్ కీలక పాత్ర పోషించాయి. అదే కాలంలో రెండు లక్షల మంది అసంఘటిత కార్మికుల ఊరేగింపును రెండు నిమిషాలు కూడా చూపించని మీడియా కేవలం వేలమందితో జరిగిన అన్నా హజారే దీక్షా శిబిరం దగ్గరే పడిగాపులుగాసింది. కొవ్వొత్తుల ప్రదర్శనలు వంటి మధ్య తరగతిని ఆకర్షించే వాటినీ, అన్నా హజారేను, ఆయన బృందాన్ని పదే పదే ప్రసారం చేస్తూ ఆకాశానికెత్తింది. వార్తా పత్రికలు పతాక శీర్షికలు, సంపాదకీయాలు అన్నీ ఒక రకమైన 'అద్భుతం' అనే వాతావరణం సృష్టించాయి.

అన్నా బృందం ఎస్ఎంఎస్‌లను బాగా వినియోగించింది. వెబ్‌సైట్లు, ట్విట్టర్, ఫేస్‌బుక్‌లు వాఖ్యానాలు, మద్దతుతో నిండిపోయాయి. హిందీ సినీ తారలంతా అన్నాను పొగడ్తలతో ముంచెత్తి ఉద్యమానికి గ్లామర్ సమకూర్చారు. బాబా రామ్‌దేవ్, రవిశంకర్‌లు ఉచిత వీడియో సీడిలు పంచారు. ఇంత చేసినా మొత్తం కలిపి 21,833 మందే అన్నా సమాజంలో చేరారు. వీరిలో విద్యార్థులు, మధ్య తరగతి యువత ఎక్కువ. ఇంత చేసినా గ్రామీణ భారతం పెద్దగా కదల్లేదు. 79 నగరాలు, పట్టణాల్లో ధర్నాలు, ఊరేగింపులు జరిగాయి. ఊరేగింపుల్లో ద్విచక్ర వాహనాల కంటే కార్లే అధికంగా ఉన్నాయి. మొత్తమ్మీద ఈ ఉద్యమం ప్రధానంగా పట్టణ మధ్య తరగతిని ఆకర్షించిందని చెప్పొచ్చు.

అయితే ప్రధాన స్రవంతిలోని రాజకీయాలు అవినీతిని అరికట్టడంలో విఫలం కావటం వలన ఏర్పడిన ఖాళీని అన్నా ఉద్యమం భర్తీ చేసిందనే చెప్పాలి. రాజకీయ నాయకుల్లోని భారీ అవినీతి వారిని జనం ఈసడించుకోవటానికి కారణం అయ్యింది. గత కాలంలో రాజకీయ నాయకులే యువతకు స్ఫూర్తి అయితే దిగజారిన విలువల వల్ల వారు ఆ స్థానం కోల్పోయారు. వారిపై అనుమానం, కోపం వారిని జనానికి దూరం చేశాయి. అయిదేళ్ళకు ఒకసారి వచ్చి ఓట్లు కొనుక్కుని గెలిచి మళ్ళీ సంపాదించుకుంటారనే అభిప్రాయం మధ్యతరగతిలో బాగా స్థిరపడింది. దానితో రాజకీయాలు, ప్రభుత్వం చట్టాలంటేనే ఒక తృణీకార ధోరణి ఏర్పడింది. దాంతో అవసరం అయిన

అన్నాకు మద్దతు కూడ గట్టడంలో మీడియా, ఇంటర్‌నెట్ కీలక పాత్ర పోషించాయి. అదే కాలంలో రెండు లక్షల మంది అసంఘటిత కార్మికుల ఊరేగింపును రెండు నిమిషాలు కూడా చూపించని మీడియా కేవలం వేలమందితో జరిగిన అన్నా హజారే దీక్షా శిబిరం దగ్గరే పడిగాపులుగాసింది. కొవ్వొత్తుల ప్రదర్శనలు వంటి మధ్య తరగతిని ఆకర్షించే వాటినీ, అన్నా హజారేను, ఆయన బృందాన్ని పదే పదే ప్రసారం చేస్తూ ఆకాశానికెత్తింది.

చట్టాల కోసం ఒత్తిడి చేయడానికీ, ఉన్న చట్టాలలో మార్పులు తేవడానికీ కూడా మధ్య తరగతి దూరంగానే ఉంటున్నది.

అన్నా హజారే దీక్ష వలన 'అవినీతిపై చట్టం ఉండాలి. అవినీతి నిరోధించడం ప్రభుత్వ బాధ్యత' అనే అభిప్రాయం తిరిగి రంగం మీదికి వచ్చింది. విధాన నిర్ణయాల్లో, చట్టాల రచనలో జనాభిప్రాయం పరిగణనలోకి తీసుకోవాలనే భావానికి భారీ మద్దతు అభిస్తున్నది.

ప్రజా మద్దతు ప్రభుత్వాన్ని వంచగలదనీ, రాజకీయ వర్గాలలో తాత్కాలిక, దీర్ఘకాలిక దిద్దుబాట్లు జరిగేలా ఒత్తిడి చేయగలదనీ మరోసారి నిరూపితం అయ్యింది.

**రాజకీయాలపై అన్నా బృందం.**

"రాజకీయ నాయకుల్ని రాబందులకు వేయాలి", "వాళ్ళు కుక్కలు" "రాజకీయ నాయకులంతా దోపిడీదార్లు" ఇవీ అన్నా మద్దతుదార్ల నుండి తరచుగా వినవచ్చిన నినాదాలు. కిరణ్‌బేడీ ఏకంగా ఏకపాత్రాభినయం చేసి రాజకీయాల్ని కించపరిచింది. అందర్నీ ఒకే గాటన కట్టి తిట్టిపోసింది.

ఈ సమయంలో రాజకీయాల ఆవిర్భావాన్ని, పరిణామాన్ని, అవసరాన్ని, ప్రభావాన్ని సమగ్రంగా అర్థం చేసుకోవటంలో అన్నా బృందం పరిమితులు స్పష్టంగా కనిపించాయి. వివిధ రాజకీయ ఘటనలనూ, అనుభవాలను దేశాన్ని మలచడంలో వాటి ప్రాధాన్యతనూ, అట్లాగే రాజకీయ నాయకులు వ్యక్తులుగా చేసిన కృషిని అవగాహన చేసుకోవటంలో, అంచనా వేయటంలో నిష్పక్షపాతంగా ఒక నిర్ణయానికి రావడంలో ఈ బృందం విఫలం అయింది. చివరికి రాజకీయ నాయకులందర్నీ విచక్షణ లేకుండా విమర్శించింది. చెడు రాజకీయాల్ని కాకుండా అసలు రాజకీయాల పట్లనే ప్రతికూల భావం ప్రచారం చేసింది.

నరేంద్రమోడీనీ, నితీష్‌కుమార్‌ను గ్రామీణాభివృద్ధి చేశారంటూ పొగిడిన అన్నా హజారే లౌకిక వాదుల నుండి విమర్శలు ఎదుర్కొన్నారు. ముస్లింలను ఊచకోత కోసి విచారణలను ఎదుర్కొంటున్న మోడీ ప్రభుత్వం ఎస్సీ, ఎస్టీల సంక్షేమాన్ని కూడా కాలరాసింది. గుజరాత్‌లో ఉన్నత తరగతులు, కార్పొరేటు కంపెనీలు మాత్రం బాగా లబ్ధిపొందాయి. అంతేకాకుండా లోకాయుక్త నియామకం పదేళ్ళుగా వాయిదా వేస్తున్న మోడీ వేల ఎకరాలు కార్పొరేట్లకు కట్టబెట్టడంతో ప్రజలు నిర్వాసితులవడం ఏ రకమైన అభివృద్ధి అంటూ భాగస్వాములే భారీగా విమర్శలు చేశారు.

> **ఎక్కువ భాగం మీడియా, స్వచ్ఛంద సంస్థలు కూడా ఈ కార్పొరేటు అవినీతిలో భాగమే. లోక్‌పాల్ చట్టం (అన్నా బృందం చెప్పినట్లు) మంత్ర దండం కాదు. అది రాగానే అవినీతి ఆగుతుందంటే అది భ్రమ. అవినీతిని పైపైన సంకుచితంగా అర్థం చేసుకోవటం ప్రమాదకరం.**

ఈ అవినీతి వ్యతిరేక ఉద్యమం కూడా మనదేశంలో పాతుకుని ఉన్న కుల, మత, లింగ వివక్షతలకూ అతీతం కాదు. అన్నా హజారే ఆలోచనా విధానం అతని సాంప్రదాయక, సామాజిక, రాజకీయ అవగాహనా పరిమితుల్లోనే ఉంది. సమానత్వం, ప్రజాస్వామ్యం, సార్వజనీన హక్కులు అనే వాటికి దానిలో ప్రాధాన్యతలేదు. ఒక వ్యక్తి నైతిక స్వచ్ఛతపై ఆధారపడిన ఈ ఉద్యమం వలన కొన్ని మంచి పనులు జరగవచ్చు. అయితే ప్రధానాంశాలపై స్పష్టమయిన అవగాహనతో పనిచేస్తూ నిర్మాణం అయిన సంఘటిత సంస్థ లేకుండా ఏ అంశంలోనయినా సమూల మార్పు జరుగుతుందని ఆశించడం నేల విడిచి సాము చేయటమే అవుతుంది.

**ఇది ఉద్యమమా?**

అవినీతిపై పోరాటం మరో స్వతంత్ర్య ఉద్యమం అంటూ అన్నాతోపాటు మీడియా ఘోషించింది. అసలు ఉద్యమం అంటే ఏమిటి?

కొన్ని ఖచ్చితమయిన డిమాండ్లను అంగీకరించిన ప్రజలు కలిసి కట్టుగా వాటి సాధనకు ఘర్షణ పడటం- అవసరం అయితే ఆ ఘర్షణలో మూల్యం చెల్లించడానికి సిద్ధపడి తాము ఎంచుకున్న, అంగీకరించిన సమగ్ర దృక్పథం గల నాయకత్వం ఆధ్వర్యంలో పోరాడటం ఉద్యమమవుతుంది.

ప్రజా ఉద్యమంలో ప్రజలే పోరాడతారు. వారే పోరాట రూపాలు కనిపెడతారు. నాయకులు పోరాడే ప్రజల్లో భాగంగా ముందు పీఠిన నిలుస్తారు. అన్నా దీక్షలో ప్రజలెవ్వరికీ భాగస్వామ్యం లేదు. వారు ప్రేక్షకులు. అవినీతిపై అన్నా ఒంటి చేత్తో పోరాడుతారు. ఆయన బృందం సహకరిస్తుంది. జనం చప్పట్లు కొట్టాలి. భజనలు వినాలి అంతే. అన్నా ఒక ప్రవక్త లేదా ఒక బాబా... అవినీతిపై పోరాటం అంటే ఏమిటి? అని అక్కడ చేరిన వారిని అడిగితే ఒక్కొక్కరూ ఒక్కోరకంగా చెబుతారు. కొంతమంది కార్పొరేట్ దోపిడీకి, మరికొందరు రాజకీయ నాయకుల అవినీతికి, కొందరు అధికారుల లంచగొండితనానికి, ఇంకొందరు రికమండేషన్లకూ, కొందరయితే ట్రాఫిక్ కానిస్టేబుల్ మామూళ్ళకి వ్యతిరేకం. ఎక్కువ భాగం వారి వారి వ్యక్తిగత అనుభవాల కోపంతో ఇక్కడ చేరినవారే. వారికి అన్నా బృందం "అవినీతి' పై స్పష్టత ఇవ్వలేదు. జనలోక్‌పాల్ మంత్రం చదవటం తప్ప దాని డిమాండ్లేమిటో వివరించలేదు. ప్రభుత్వంతో చర్చల వివరాలు చెప్పలేదు. అంతా అన్నా, ఆయన బృందం చూసుకున్నారు. అంటే వచ్చిన జనానికి జెండా ఊపడం, టోపీలు కొనుక్కోవడం తప్ప పనిలేదు.

ఎప్పుడూ వీధుల్లోకి రాని మధ్య తరగతి యువతరం కదిలితే వారికి

ప్రభుత్వ విధానాలపై, అవినీతిపై నిరసన తెల్పడానికీ, పోరాడటానికీ అన్నా హజారేకు హక్కుంది. కాని అది రాజ్యాంగాన్ని, రాజ్యాంగ బద్ధమయిన సంస్థ పార్లమెంటునూ కాదని వాటికి అతీతంగా, వాటిని త్రోసిరాజనే విధంగా అన్నా బృందం తన మేధావుల అభిప్రాయాలు పార్లమెంటుపై రుద్దడం సరైందా? ఒక వ్యక్తి నైతిక విలువ ఆధారంగా ప్రజాస్వామ్యం నడవాలా? పార్లమెంటరీ వ్యవస్థలో లోపాలుంటే వాటిని ప్రజాస్వామ్య పద్ధతుల్లోనే సరిచేయాలి.

డిమాండ్లు వివరించి చురుకయిన భాగస్వాముల్ని చేసి కార్యాచరణకు పురికొల్పటం మానేసి, వారికి పనిలేకుండా నిర్వీర్యం చేసింది ఈ కార్యక్రమం. డిమాండ్లు తెలిసిన ప్రజలంతా భాగస్వాములయితే ఉద్యమం అవుతుంది తప్ప ఒక్కరు చేస్తేకాదు. కనుకనే ముంబాయి దీక్షకి హాజరు బాగా పలచబడింది.

వామపక్షాలు ఇటువంటి వాటిని ప్రోత్సహించవు. బయటినుండి మద్దతు తెల్పుతాయి కాని భాగస్వాములు కావు. ఎందుకంటే ప్రజలు చైతన్యవంతంగా భాగస్వాములయ్యే ఉద్యమాలు నిర్మించడం వామపక్షాల బాధ్యత. ప్రజల్ని ప్రేక్షకపాత్రలో నిరుపయోగం చేసే కార్యక్రమాలు నిర్వహించటం వాటిపనికాదు.

## అవినీతి పోరాటం ప్రమాదకర ధోరణులు

అన్నా బృందం పార్లమెంటు, ఇతర ప్రభుత్వ సంస్థలపై దాడిని నిరంతరాయంగా కొనసాగించింది. ప్రజాభిప్రాయం అనే పేరుతో ఈ దాడి జరిగింది. అన్నా వెనుక ఉన్నారని చెప్పిన వారు 20 వేలు, పోనీ 80 పట్టణాల్లో బయటకు వచ్చిన వారితో కలిపి కొన్ని లక్షలు అనుకుందాం (హైద్రాబాద్ శిబిరంలో 100 దాటలేదు) 125 కోట్ల జనాభా అభిప్రాయానికి వీళ్ళు ప్రతినిధులా? ఆ 20 వేల మంది తరపున కూడా అన్నా ఆయన బృందం 10 మంది ఏది మాట్లాడితే అది భారత ప్రజానీకం అభిప్రాయం అవుతుందా?

'ప్రభుత్వం అవినీతిలో కూరుకు పోయింది. రాజకీయ నాయకులంతా దొంగలు' నిజమే అనుకుందాం... అన్నా బృందం పవిత్రులు! ప్రజానీకం అంతా అవినీతిని వ్యతిరేకిస్తున్నపుడు అన్నా బృందం, ఇంకా వారివంటివారు ఎన్నికల్లో నిలబడి అవినీతి అంటని వారితోనే ప్రభుత్వం ఏర్పాటు చేస్తేసరి. అసలు సమస్యే ఉండదు.

అహ అట్లా కుదరదు? ఎందుకని? అన్నా హజారే మాటల్లోనే చెప్పాలంటే "జనం 100 రూ॥లకు, సారా సీసాకు ఓటు వేస్తారు,. నాకు ఓటు వేయరు. (జనం మీద ఎంత మంచి అభిప్రాయం... ఇదే జనం ఇందిరా గాంధీ ప్రభుత్వాన్ని పడగొట్టారు మరి) అయినా గాని (మంచో చెడో) ప్రజలెన్నుకున్న ప్రభుత్వం కంటే మా మాటే చెల్లాలి" ఇది ఏరకం అయిన ప్రజాస్వామిక విలువ?

ప్రభుత్వ విధానాలపై, అవినీతిపై నిరసన తెల్పడానికీ, పోరాడటానికీ అన్నా హజారేకు హక్కుంది. కానీ అది రాజ్యాంగాన్ని, రాజ్యాంగ బద్ధమయిన సంస్థ పార్లమెంటునూ కాదని వాటికి అతీతంగా, వాటిని త్రోసిరాజనే విధంగా అన్నా బృందం తన మేధావుల అభిప్రాయాలు పార్లమెంటుపై రుద్దడం సరైందా? ఒక వ్యక్తి నైతిక విలువ ఆధారంగా ప్రజాస్వామ్యం నడవాలా? పార్లమెంటరీ వ్యవస్థలో లోపాలుంటే వాటిని ప్రజాస్వామ్య పద్ధతుల్లోనే సరిచేయాలి.

అవినీతి ఉంది కాబట్టి ప్రభుత్వ వ్యయం కత్తిరించండి అంటే ఆ కత్తిరింపులు సంక్షేమ పథకాలపై జరిగి పేదలకు హానికాదా? అట్లాగే అవినీతి ఉంది కాబట్టి నేడు పన్నులు చెల్లించనంటున్న మధ్య తరగతి నీతి ఏమిటి?

పార్లమెంటు, ఇతర రాజ్యాంగ సంస్థలపై దాడిచేసి వాటిని కించపరచి బలహీనం చేయటం అంటే ప్రజాస్వామ్యం స్థానంలో కార్పొరేటు స్వామ్యం వచ్చే ప్రమాదానికి దారితీయదా? నూతన ఆర్థిక విధానాల ఫలితం అయిన కుంభకోణాలతో బలహీనం అయిన రాజకీయ నాయకత్వం, శతకోటీశ్వరులు చేరుతున్న పార్లమెంటు ప్రజాస్వామ్యానికి చేటు తెస్తుంటే.... అసలు రాజ్యాంగ వ్యవస్థనే బలహీనం చేయటం ఎవరి ప్రయోజనం కోసం?

## సమర్ధవంతమయిన లోక్‌పాల్ బిల్లు అంటే...

- ★ జాతీయ స్థాయిలో అన్ని రకాల అధికారులనూ లోక్‌పాల్ పరిధిలోకి తేవాలి.
- ★ లోక్‌పాల్‌కు స్వంత దర్యాప్తు యంత్రాంగం ఉండాలి. సిబిఐని ఈ పరిధిలోకి తేవచ్చు. సిబిఐ డైరక్టరు ఎంపిక స్వతంత్ర సెలక్షన్ కమిటీ ద్వారా జరగాలి.
- ★ ప్రధానమంత్రిని (జాతీయ భద్రత, విదేశీ విధానంపై కొన్ని మినహాయింపులతో) లోక్‌పాల్ పరిధిలోకి తేవాలి.
- ★ పార్లమెంటు సభ్యులు అవినీతి చేస్తే వారికి రక్షణ ఉండకూడదు. దీనికి రాజ్యాంగంలో ఆర్టికల్ 105ను సవరించాలి.
- ★ కార్పొరేట్ శక్తుల ప్రమేయం గల కేసులపై దర్యాప్తు జరిపి అవసరం అయితే వాటి కాంట్రాక్టులు లైసెన్సులు రద్దుచేసే అధికారం లోక్‌పాల్‌కు ఉండాలి.
- ★ సామాన్య జనం ఇబ్బందులు, సమస్యలు తీర్చేందుకు సమర్ధవంతమయిన ప్రత్యేక యంత్రాంగం ఏర్పాటు చేయాలి.
- ★ అవినీతి నిరోధక చట్టంలో మార్పులు చేసి ముడుపులు తీసుకున్న వారేగాక ఇచ్చిన వారిని కూడా శిక్షార్హులను చేయాలి. ప్రభుత్వ డబ్బును నష్టపరిచే

నిర్ణయాలను చర్యలను కూడా అవినీతిగానే భావించాలి.

* న్యాయ వ్యవస్థలోని అవినీతిని అరికట్టేందుకు వేరుగా జాతీయ న్యాయ కమిషన్ ఏర్పాటు చేయాలి.
* ధన బలాన్ని అరికట్టేందుకు ఎన్నికల సంస్కరణలను తప్పనిసరిగా చేయాలి.

## లోక్‌పాల్ వ్యవస్థతో అవినీతి ఆగిపోతుందా?

అవినీతిపై నిఘాకు, దర్యాప్తుకు, శిక్షలకూ లోక్‌పాల్‌బిల్లు ఒక సాధనం. సమర్ధవంతంగా, చిత్తశుద్ధితో అమలు చేస్తే పరిస్థితి కొంత మెరుగుపడే అవకాశం ఉంది.

లక్షల కోట్ల రూపాయల లూటీకి ఊతమిచ్చే భూములు, సహజ వనరుల అమ్మకాలు, ప్రభుత్వ సంస్థల వేలాలు, కార్పొరేట్లకు పన్ను రాయితీలు వంటివి ప్రభుత్వ ఆర్థిక విధానాల్లో భాగం ఆ లూటీ సొమ్ములో కొంత భాగాన్ని రాజకీయులకూ అధికారులకూ భాగం పంచుతున్న కార్పొరేటు కంపెనీలకు అవినీతి ఒక అవసరం. దానితో ఒక విషవలయంలా అవినీతి మాఫియా ఏర్పడింది. కాబట్టి అవినీతికి దారితీసే ఆర్థిక విధానాలు మార్చకుండా అవినీతిని తుడిచి పెట్టడం సాధ్యంకాదు.

ఎక్కువ భాగం మీడియా, స్వచ్ఛంద సంస్థలు కూడా ఈ కార్పొరేటు అవినీతిలో భాగమే. లోక్‌పాల్ చట్టం (అన్నా బృందం చెప్పినట్లు) మంత్ర దండం కాదు. అది రాగానే అవినీతి ఆగుతుందంటే అది భ్రమ. అవినీతిని పైపైన సంకుచితంగా అర్థం చేసుకోవటం ప్రమాదకరం. అవినీతి మూలాలపై పోరాటాన్ని ట్రేడ్ యూనియన్లు, ఇతర ప్రజాసంఘాలు, సుదీర్ఘ కాలంగా చేస్తున్నాయి. వాటి శక్తి, వాటి కృషి ఈ పోరాటంలో కీలకం అని గుర్తించడం అవసరం.

## నల్లడబ్బు

బయట దేశాల్లో ఉన్న నల్ల ధనం 500 బిలియన్ డాలర్ల నుండి 1400 బిలియన్ డాలర్లు దాకా ఉంటుందని ఒక అంచనా. అయితే గ్లోబల్ ఫైనాన్షియల్ ఇంటిగ్రిటీ అనే సంస్థ ప్రకారం ఇది 460 బిలియన్ డాలర్లు లేదా 20,85,000 కోట్ల రూపాయలు.

ఈ డబ్బు తిరిగి తెచ్చే చట్టాలు, నల్లడబ్బుపై విచారణ జరిపే అన్ని చట్ట పరమయిన అధికారాలు ప్రభుత్వానికి ఉన్నాయని రాజ్యాంగ నిపుణుల అభిప్రాయం.

**ఇరోమ్ షర్మిలా గత పదేళ్ళుగా నిరాహార దీక్ష చేస్తున్నది. ప్రభుత్వం ఆమెకు బలవంతాన ద్రవ పదార్థాలు ఎక్కిస్తున్నది తప్ప షర్మిలా డిమాండు చేస్తున్నట్టుగా 'మణిపూర్‌లో అమలు చేస్తున్న మిలటరీ చట్టాన్ని ఎత్తేయాలి' అనే అంశంపై మాత్రం స్పందించడం లేదు. మణిపూర్ ఈశాన్య భారతంలో చిన్న రాష్ట్రం అవడంతో పెద్దగా మీడియా దృష్టిని ఆకర్షించ లేకపోవడం రాజకీయంగా బలాబలాల్లో మార్పు తేగలిగే సంఖ్యాబలం లేకపోవటం దీనికి ప్రధాన కారణం.**

జర్మను బ్యాంకు ఖాతాల సమాచారం ఆ దేశ అధికారులే అందించారు. ప్రతీ ఏడాదీ తరచుగా విదేశాలకు వెళ్తూ డబ్బు తరలించేవారి వివరాలు కూడా ప్రభుత్వం దగ్గర ఉన్నాయి.

## నల్ల డబ్బును ఎలా తిరిగి తేవచ్చు?

విదేశాల్లో బ్యాంకు ఖాతాలున్న వారందరి ఖాతాలనూ జాతీయం చేయటం ఒక చట్టపరమయిన మార్గం. ఎవరెవరయితే వారి డబ్బుకు చట్టపరమయిన ఆధారాలు చూపారో వారిని మినహాయించవచ్చు. (విదేశాల్లో ఉద్యోగాలు చేసేవారు...వగైరా)

భారత ప్రభుత్వం ఒక ఆర్డినెన్స్ చేస్తేచాలు స్విట్జర్లాండు ప్రభుత్వం తప్పనిసరిగా అన్ని వివరాలూ అందజేయాలి.

ఐక్యరాజ్య సమితి అవినీతి వ్యతిరేక ఒప్పందంపై సంతకం చేస్తే చాలు ప్రభుత్వానికి అవసరమయిన సమాచారం నల్లడబ్బు వెంటనే అందుతాయి.

## అవినీతి అధికారులను ఎలా శిక్షిస్తారు?

ప్రస్తుతం ప్రభుత్వోద్యోగులు అవినీతికి పాల్పడితే 1988 అవినీతి నిరోధక చట్టం కింద శిక్షార్హులు. అయితే విచారణకు సిబిఐ రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాల అనుమతి పొందాలి. 2010లో విచారణ కోసం సిబిఐ 236 కేసుల్లో అనుమతి కోసం అడిగితే కేంద్ర ప్రభుత్వం నుండి స్పందన లేదు. 155 కేసులు పెండింగ్‌లో ఉన్నాయి. రాష్ట్ర ప్రభుత్వాలను 84 కేసులకు అనుమతి అడిగితే 13 పెండింగ్ ఉన్నాయి. కేంద్ర ప్రభుత్వంలో అవినీతిపై నిఘా వేసే సంస్థ సెంట్రల్ విజిలెన్స్ కమిషన్ (సివిసి) 2005-2009 మధ్య 13,061 పెనాల్టీలు విధింపచేసింది. వీటిలో 846 కేసుల్లో క్రిమినల్ విచారణకు అనుమతి లభించింది. సివిసి అవినీతి కేసులను వెలికి తీయడానికి సిబిఐ పైనే ఆధారపడుతుంది. సిబిఐలో 21 శాతం ఉద్యోగాలు ఖాళీగా ఉన్నాయి. 2010 నాటికి 9,927 సిబిఐ కేసులు కోర్టుల్లో పెండింగ్‌లో ఉన్నాయి.

విచారణకు అనుమతి పొందటం అనే క్లాజు నిజాయితీపరులను కాపాడటానికి ఉద్దేశించింది. అదే క్లాజును అవినీతి పరులు బాగా ఉపయోగించుకుంటున్నారు. రాజకీయ ఒత్తిడులు లేకుండా స్వతంత్రంగా అవినీతిపై నిఘా ఉంచే సంస్థ లేదు. సివిసి కూడా సలహాలిచ్చే సంస్థే తప్ప క్రిమినల్ కేసు పెట్టే అధికారం దానికి లేదు.

అన్నా కోరికకు ఇంత ప్రాధాన్యత ఇవ్వడానికి మీడియా ప్రచారమే కారణమా? లేక లోక్‌పాల్ బిల్లు వలన పెద్ద ప్రమాదం లేదని ప్రభుత్వం భావిస్తున్నదా? బలహీనమయిన లోక్‌పాల్ బిల్లును తేవడం ద్వారా అవినీతిపై యుద్ధం చేస్తున్నట్టు దబ్బా కొట్టుకోవచ్చని ప్రభుత్వం భావిస్తున్నదా? ఏదయినాకావచ్చు.

### అందరి నిరాహార దీక్షల్నీ ప్రభుత్వం పట్టించుకుంటుందా?

ఇమ్రాన్ షర్మిలా గత పదేళ్ళుగా నిరాహార దీక్ష చేస్తున్నది. ప్రభుత్వం ఆమెకు బలవంతాన ద్రవ పదార్థాలు ఎక్కిస్తున్నది తప్ప షర్మిలా డిమాండు చేస్తున్నట్టుగా 'మణిపూర్‌లో అమలు చేస్తున్న మిలటరీ చట్టాన్ని ఎత్తేయాలి' అనే అంశంపై మాత్రం స్పందించడం లేదు. మణిపూర్ ఈ శాన్య భారతంలో చిన్న రాష్ట్రం అవడంతో పెద్దగా మీడియా దృష్టిని ఆకర్షించ లేకపోవడం రాజకీయంగా బలాబలాల్లో మార్పు తేగలిగే సంఖ్యాబలం లేకపోవటం దీనికి ప్రధాన కారణం. చిన్న రాష్ట్రాల పట్ల కేంద్రం ఎంత ఉదాసీనంగా వ్యవహరించగలదో దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు.

లక్షల మంది రకరకాల ప్రజలు నిరాహార దీక్షలు చేస్తున్నారు. వారెవర్నీ ప్రభుత్వం, ముఖ్యంగా మీడియా పట్టించుకోవటంలేదు. వారికి వారి వారి డిమాండ్లపై ఆయా తరగతుల ప్రజల పరిపూర్ణ మద్దతు ఉంది. అయినా పట్టించుకోరు.

అన్నా కోరికకు ఇంత ప్రాధాన్యత ఇవ్వడానికి మీడియా ప్రచారమే కారణమా? లేక లోక్‌పాల్ బిల్లు వలన పెద్ద ప్రమాదం లేదని ప్రభుత్వం భావిస్తున్నదా? బలహీనమయిన లోక్‌పాల్ బిల్లును తేవడం ద్వారా అవినీతిపై యుద్ధం చేస్తున్నట్టు దబ్బా కొట్టుకోవచ్చని ప్రభుత్వం భావిస్తున్నదా? ఏదయినాకావచ్చు.

### అన్నా బృందంపై ఆరోపణలు

1. అన్నా హజారే పుట్టిన రోజుకు పాతిక లక్షలు పైగా ఖర్చు జరిగింది. ఇది ఎట్లా సమంజసం?
2. అన్నా నిరాహారదీక్ష సందర్భంగా వచ్చిన దాదాపు కోటి రూపాయల డబ్బుకి అసలు లెక్క చూపకుండా ఆడిట్ నివేదిక మాత్రం నెట్‌లో పెట్టారు.
3. అరవింద్ కేజ్రీవాల్, కిరణ్‌బేడీతో సహా అన్నా బృందంలో ముఖ్యులంతా స్వచ్ఛంద సంస్థలు నడుపుతున్నారు. పోర్డు ఫౌండేషన్ ఇతర విదేశీ సంస్థల నుండి లక్షల డాలర్ల నిధులు పొందుతున్నారు.
4. కిరణ్‌బేడీ విమాన ప్రయాణ చార్జీలలో అనేక అవకతవకలు చేశారు.
5. అన్నా బృందానికి వచ్చిన నిధుల్లో 50 లక్షలు జిందాల్ కంపెనీ ఇచ్చింది.

### డ్రామా రక్తి కట్టింది:

లోక్‌సభలో ప్రతిపక్షాలు లోక్‌పాల్ బిల్లుకు అనేక సవరణలు ప్రతిపాదించారు. వాటిలో రెండుమాత్రం ఆమోదించారు. అతి కష్టంమీద లోక్‌సభలో లోక్‌పాల్ బిల్లు ఆమోదం పొందింది. అయితే రాజ్యసభలో మాత్రం యుపిఎ భాగస్వామ్య పక్షం అయిన తృణమూల్ కాంగ్రెస్ అడ్డంతిరగడం, మిగిలిన పార్టీలు కూడా నిరాకరించడంతో లోక్‌పాల్ బిల్లు ఆగిపోయింది. అసలు బిల్లుపై తమ పక్షాల మద్దతును కూడగట్టకుండా మీటింగ్ పెట్టిన కాంగ్రెస్‌కు బిల్లు ఆమోదం పొందదనే విషయం ముందే తెలుసు. అనుకున్నంతా జరిగింది. లోక్‌పాల్ బిల్లు చట్టం కాకుండా పోవడానికి ప్రతిపక్షాలే కారణం అని అరవడానికి కాంగ్రెస్ ఆడిన నాటకం బాగా రక్తి కట్టింది. ●

## ట్రంకు రోడ్ సేల్స్

అడవిలో పూలైనా
పల్లకాట్లో శవాలైనా
అన్నీ వ్యాపార వస్తువులే!

బాటిళ్లలో రక్తం
సెల్‌ఫోనుల్లో శీలం
అన్నీ మార్కెట్ సరుకులే!

ఇంటర్‌నెట్‌లో ప్రేమ
చాటింగ్‌లో సత్యభామ
అన్నీ అమ్మకానికే!

రాచిలుకల అమ్మకాలు
రాబందుల కొనుగోళ్లు
వరకట్నం కోర్టుల్లో
పసుపచ్చని ఉరితాళ్లు!

కొంటే దొరకని వస్తువే లేదు-
కడుపులో ఆడపిల్ల
సాగరంలో చేపపిల్ల
బస్టాండులో వేపపుల్ల
తల మండే అగ్గిపుల్ల

అమ్మకారాలకీ
మమకారాలకీ
సబ్సిడీ కూడా వర్తిస్తుంది
ప్రభుత్వ పథకాల్లాగే!

-ఈతకోట సుబ్బారావు.

చైతన్య మానవి పై మీ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు తెలియచేయాల్సిందిగా కోరుతున్నాము.

మా చిరునామా

బ్లాక్ నెం. 24, హెచ్‌ఐజి, ఫేజ్2,
1-8-1, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్-44
ఫోన్: 27605845

# స్త్రీ స్వాతంత్ర్య మర్హతి

- గోపాలుని అమ్మాజీ

'అదేంటి? నాన్న ఇలా చెప్పారు. తనకి టెన్నిస్ అంటే ప్రాణం కదా! అప్పుడంటే నిజంగానే స్టడీస్ కోసం తన కిష్టం లేకపోయినా టెన్నిస్ ఆడటం మానేసింది. అయినా కాలేజీలో చదివేటప్పుడు కూడా ఇంటర్ కాలేజ్ కాంపిటీషన్స్‌లో ఛాంపియన్‌గా వచ్చింది. ఇప్పటికీ శని, ఆదివారాలొస్తే రాకెట్ తీసుకుని గ్రౌండ్‌కి వెళ్తుంది. మరి నాన్న ఎందుకిలా చెప్పారు?,

ఏదేమైతేనేం జావళి ధైర్యం కూడకట్టుకుని తను చెప్పదల్చుకున్న విషయం చెప్పేసింది. తను చెప్పింది విన్నాక ఇంట్లో పెద్ద తుఫాను చెలరేగుతుందనుకుంది. కానీ అలా జరగలేదు. జావళి చెప్పింది విన్నాక ప్రకాష్, హైమవతమ్మలు ముందు షాకయ్యారు. తర్వాత తలపట్టుక్కూర్చున్నారు. "ఇప్పుడేమయిందని అంత డీలా పడిపోతారు. మన అదృష్టం బాగుంది కనుక ముందుగానే విషయం బయటపడింది. అదే ఆ మూడు ముళ్ళూ పడ్డాక తెలిసుంటే పిల్ల జీవితం ఎటూకాకుండా పోయేది" అంది జావళి తల్లి కోమలి, వాళ్ళిద్దరికీ కాఫీ కప్పులందిస్తూ.

"నిజమే! కానీ ఆ అమ్మాయి చెప్పిదాంట్లో అసలు నిజం ఎంతుందో తెలియాలి కదా!" అన్నాడు జావళి తండ్రి ప్రకాష్.

"ఎవరో ఏదో చెప్పారని గుడ్డిగా నమ్మేస్తే గుమ్మంలోకి వచ్చిన బంగారంలాంటి సంబంధాన్ని కాళ్ళ తన్నుకున్నట్టవుతుందేమో కొంచెం ఆలోచించరా!" అంది కొడుకు ప్రకాష్‌తో హైమవతమ్మ.

పదినిముషాల మౌనం తర్వాత "ఒక పని చెయ్యండి. మధ్యవర్తుల్ని పంపి



చూచాయగా విషయం చెప్పి నిజమేంటో కనుక్కోమనండి. పిల్లనిచ్చే వాళ్ళం. మంచీ చెడూ చూసుకోవటంలో తప్పేముంది?" అంది కోమలి.

" ఒక పనిచేద్దాం అన్నయ్యా! కొన్ని ముఖ్యమయిన విషయాలు మాట్లాడాలి, ఏమనుకోకుండా ఒకసారి మనింటికి రమ్మని వాళ్ళకి కబురు చేద్దాం. ఈలోగా మనం కూడా ఎంక్వయిరీ చేసుకుందాం. మనం విన్నది నిజమే అయితే ఆ విషయమే వాళ్ళకి చెప్పి సంబంధం క్యాన్సిల్ చేసుకోవచ్చు. నిజం కాదని తెలిస్తే వాళ్ళూ, మనం కూర్చుని పెళ్ళి విషయాలు మాట్లాడుకోవాల్సినవి చాలానే వున్నాయి కాబట్టి ఆ విషయాలు మాట్లాడుకుని పంపిద్దాం" అన్నాడు ప్రకాష్ తమ్ముడు రవీంద్ర.

"వర్కవుట్ అవుతుందంటావా?'' అనుమానంగా అడిగాడు ప్రకాష్.

"ప్రయత్నిద్దాం" అన్నాడు రవీంద్ర.

రెండు రోజుల్నించి జావళి పెళ్ళి కుదిరిందన్న ఆనందంతో సందడిగా వున్న ఇంట్లో వున్నట్టుండి ఈరోజు గంభీరమైన వాతావరణం ఏర్పడింది.

అన్నట్టు అసలు విషయం ఏంటో చెప్పలేదు కదూ! అది తెలియాలంటే నాలుగు రోజులు వెనక్కి వెళ్ళాలి.

❖❖❖❖

ఆరోజు జావళికి పెళ్ళి చూపులు. సాయంత్రం పెళ్ళివాళ్ళ ముందు ఎలా కూర్చోవాలో, ఎలా మాట్లాడాలో జావళిని రెండు గంటలు కూర్చోపెట్టి ట్రెనింగ్ ఇచ్చింది బామ్మ. సాయంత్రం అనుకున్న టైంకి పెళ్ళివాళ్ళు వచ్చారు.

"ఏమ్మా! వంట చేయటం వచ్చా?" అడిగింది పెళ్ళికొడుకు తల్లి.

" అనిరుథ్ దాదాపు రెండేళ్ళనుంచి రూప అనే అమ్మాయితో లివింగ్ టు గెదర్ రిలేషన్‌లో వున్నాడు. మేమందరం ఐదేళ్ళుగా టీమ్‌మేట్స్. మంచి ఫ్రెండ్స్‌మి కూడా. అందుకే అతను చేస్తున్నది మంచివని కాదని ఎంతగానో నచ్చచెప్పాము. కానీ వాడు మా మాటలు వినే స్టేజీలో లేడు. అదేమంటే వితండవాదన చేస్తాడు. ఎలాగైనా మీకీవిషయం తెలియజేయాలని మా టీమ్‌లోని అమ్మాయిలం అనుకున్నాం. ఒక ఆడపిల్ల జీవితం పాడైపోతుంటే చూస్తూ ఊరుకోలేం కదా.

బామ్మ చెప్పింది గుర్తొచ్చి 'ఆ!వచ్చుండి' అంది జావళి.

" మీ హాబీస్ ఏంటి?" పెళ్ళికొడుకు వదినగారి ప్రశ్న అది.

"బుక్ రీడింగ్. ఇంట్లో అమ్మకి లైబ్రరీ ఉంది. చిన్నప్పట్నుంచి బుక్స్ చదవటం అలవాటు చేసింది...." ఇంకా ఆమె జవాబు పూర్తి కాలేదు. "మీరు టెన్నిస్ ఆడతారా?" అడిగాడు పెళ్ళికొడుకు హాల్లో షోకేస్‌లో వున్న జావళి ఫోటో చూస్తూ.

జావళి సమాధానం చెప్పేలోపే " అది మా అమ్మాయి ఇంటర్‌లో వుండగా స్టేట్ లెవెల్లో ఆడి, విన్ అయినప్పుడు తీసిన ఫోటో. అప్పుడంటే ఏదో చిన్నపిల్ల కాబట్టి సరదాగా ఆడేది. ఇంటర్ తర్వాత అవన్నీ మానేసింది. ఆ తర్వాత అంతా చదువు, కెరీర్-వీటిమీదే కాన్‌సన్‌ట్రేట్ చేసింది." చెప్పాడు ప్రకాష్. 'టెన్నిస్ ఆట జావళి పెళ్ళికి ఎటువంటి ఆటంకం కాదు' అనే భావన అతని మాటల్లో చెప్పకపోయినా గొంతులో మాత్రం చాలా స్పష్టంగానే వ్యక్తమయింది. అది విన్న జావళి ఉలిక్కిపడింది. 'అదేంటి? నాన్న ఇలా చెప్పారు. తనకి టెన్నిస్ అంటే ప్రాణం కదా! అప్పుడంటే నిజంగానే స్టడీస్ కోసం తన కిష్టం లేకపోయినా టెన్నిస్ ఆడటం మానేసింది. అయినా కాలేజీలో చదివేటప్పుడు కూడా ఇంటర్ కాలేజ్ కాంపిటీషన్స్‌లో ఛాంపియన్‌గా వచ్చింది. ఇప్పటికీ శని, ఆదివారాలొస్తే రాకెట్ తీసుకుని గ్రౌండ్‌కి వెళ్తుంది. మరి నాన్న ఎందుకిలా చెప్పారు?, జావళికి చాలా బాధ కలిగింది.

"నీకు పాస్‌పోర్ట్ ఉందా, అప్లయ్ చేయాలా? మా అబ్బాయి త్వరలోనే అబ్రాడ్ వెళ్తాడు. అందుకని అడుగుతున్నాను" ఇది పెళ్ళికొడుకు తండ్రి ప్రశ్న.

ఆరకంగా వచ్చిన పెళ్ళివాళ్ళు ఎవరి యథాశక్తి వాళ్ళు జావళిని ప్రశ్నలడిగారు. అందులో ఏ ఒక్కప్రశ్న ఆమె కెరీర్‌కి సంబంధించినదిగానీ, ఆమె ఫ్యూచర్‌కి



సంబంధించినది గానీ లేకపోవటమే పెద్ద విశేషం. ప్రశ్నల పరంపర అనంతరం రెండు కుటుంబాలవాళ్ళు తమ బంధువుల గురించి, ఇంటిపేర్ల గురించి, గోత్రాల గురించి కొద్దిసేపు ఏదో పిచ్చాపాటి మాట్లాడుకున్నారు. ఆ తర్వాత పెళ్ళివాళ్ళు వెళ్ళటానికి లేచి "త్వరలోనే మా నిర్ణయం మీకు తెలియజేస్తాం" అంటూ శెలవు తీసుకున్నారు.

పెళ్ళిచూపులు జరిగిన రోజునుంచి జావళికి మనసేమీ బాగోలేదు. అసలు ఆమెకి ఆ తంతే చాలా చిరాగ్గా, అసహజంగా అనిపించింది. వాళ్ళు వచ్చి ఒక రెండు గంటలు కూర్చుని ఏవో నాల్గు ప్రశ్నలు వేసి వెళ్ళిపోయారు. ఆమెని "పెళ్ళికొడుకుతో ఏమైనా మాట్లాడుతావా'? అని మాటవరసకైనా ఎవరూ అడగలేదు. పోనీ తనే చొరవచేసి మాట్లాడుదామనుకుంటే ప్రొద్దున్న జరిగిన గొడవ గుర్తొచ్చి మాట్లాడలేకపోయింది. సాయంత్రం పెళ్ళివాళ్ళు వస్తారనగా ఆరోజు ఉదయం జావళి హైమవతమ్మతో సరదాగా 'బామ్మా! మగపెళ్ళి వాళ్ళు వచ్చి నన్ను చూసే బదులు మనమే సాయంత్రం వెళ్ళి పెళ్ళి కొడుకుని చూసి రావచ్చుకదా!" అంది. అంతే! బామ్మ ఆక్కుండా అరగంట క్లాసు పీకింది. అతి తెలివి ఎక్కువైందని. కోమలి వచ్చి అడ్డుపడింది కాబట్టి సరిపోయింది. లేకపోతే జావళికి తలవాచిపోయి డబుల్ అయ్యుండేది. అందుకే అతనితో మాట్లాడాలని మనసులో వున్నా బయటికి ఎక్స్‌ప్రెస్ చేయలేకపోయింది.

ప్రకాష్‌కి, కోమలికి, హైమవతమ్మకి ఈ సంబంధం చాలా బాగా నచ్చింది. కానీ కొన్ని సందేహాలు కూడా వున్నాయి. కట్నం గురించి, వాళ్ళ ఆస్థిపాస్థులు, అబ్రాడ్ ఏ ప్రాసెస్‌లో వెళ్తున్నాడు? ఇలాంటి విషయాల్లో వాళ్ళకి పూర్తి క్లారిటీలేదు. అయినా, అడిగితే వాళ్ళేమనుకుంటారో అన్న మొహమాటంతోనో, భయంతోనో అడగలేకపోయారు. ముందు పిల్ల నచ్చితే అవన్నీ మధ్యవర్తి ద్వారా అడగవచ్చులే అని మళ్ళీ వాళ్ళకి వాళ్ళే సమాధానం చెప్పుకున్నారు. జావళికి అర్థం కాని విషయం అదే. ఆరోజు జరిగిన పెళ్ళి చూపుల వల్ల రెండు కుటుంబాల వాళ్ళు ఒకరి గురించి ఒకరు ఏం తెలుసుకున్నారో, ఏం అర్థం చేసుకున్నారో ఆమెకి తెలీలేదు. అంతేకాదు,

"క్షమించండి ఇప్పుడు మా అనుమానం కూడా అదే. రూప గురించి తెలిసింది కాబట్టి అడిగాం. మాకు తెలీకుండా మీ అబ్బాయి మాత్రం ఎంతమందితో తిరుగుతున్నాడో ఎవరికి తెలుసు? అయినా పిల్లని చూట్టానికి రాకముందే మీరిలాంటి విషయాలన్నీ ఓపెన్‌గా మాట్లాడాలి. అంతేగానీ, విషయం మాకు తెలిశాక మేమడిగితే చెప్పటం పద్ధతికాదు. ఒకవేళ మా అమ్మాయే ఇలా చేసిందని మీకు తెలిసుంటే ఇప్పుడు మాట్లాడినంత కూల్‌గా, తాపీగా మీరు మాట్లాడేవాళ్ళా?

పెళ్ళయాక అతను అబ్రాడ్ వెళ్తే తను ఉద్యోగం మానేసి, అతని వెంట డిపెండెంట్‌గా వెళ్ళాలేమో అనుకుంది. ఆ ఆలోచనే ఆమెకి దిగులనిపించింది. ' ఈ చదువు, ఉద్యోగం కోసమేగా నాన్న తనకిష్టమైన టెన్నిస్ ఆటకి తనని దూరం చేశారు. ఇప్పుడు ముక్కూ ముఖం తెలీని వాళ్ళు వచ్చి తనని పెళ్ళి చేసుకుంటానంటే అతని కోసం ఇన్నేళ్ళు కష్టపడి బిల్డప్ చేసుకున్న కెరీర్‌నంతా గాలికొదిలేసి అతని వెంట డిపెండెంట్‌గా అబ్రాడ్ వెళ్ళిపోవాలి. అసలు తన జీవితం మీద తనకంటూ ఒక నిర్దిష్టమైన నిర్ణయాలుగానీ, అభిప్రాయాలుగానీ ఏమీ వుండవా? ఇన్నేళ్ళు రాత్రింబవళ్లు కష్టపడి తనని తాను నిరూపించుకోవటానికి ఎందుకు శ్రమించినట్టు? ఆలోచిస్తున్నకొద్దీ జావళికి దుఃఖం తన్నుకొస్తోంది.

అమ్మాయి నచ్చిందని పెళ్ళివాళ్ళ దగ్గర్నుంచి కబురు వచ్చింది మొదలు ఇంటిల్లిపాది ఆనందంతో పొంగిపోయారు. జావళికి మాత్రం ఆ కబురు ఆనందాన్ని ఇవ్వలేదు. నిజానికి అప్పటికే ఆమె ఒక నిర్ణయానికి వచ్చేసింది. అందుకే చాలా రిలాక్స్‌డ్‌గా ఉంది.

❖❖❖❖

"ఐ హావ్ కమ్ టు మీట్ మిస్టర్ అనిరుధ్" చెప్పింది జావళి రిసెప్షన్‌లో.

"ష్యూర్. విల్ యు ప్లీజ్ గివ్ ది డిటైల్స్ ఆఫ్ మిస్టర్ అనిరుధ్? అడిగింది రిసెప్షనిస్ట్.

వివరాలు చెప్పింది జావళి. అక్కడే సోఫాలో కూర్చుని కాఫీ తాగుతూ మాగజైన్ తిరగేస్తున్న ఓ అమ్మాయి " ఎక్స్‌క్యూజ్‌మి నేను అనిరుధ్ కొలీగ్‌ని. పేరు షైని. అతనిప్పుడే బయటికి వెళ్ళాడు. మీరతనికి ఏమవుతారు?" అనడిగింది నవ్వుతూ.

ఏమవుతానని చెప్పాలో అర్థం కాలేదు జావళికి. కొంచెం తటపటాయించింది. "నేను అతనితో మాట్లాడటానికి వచ్చాను. పెద్దవాళ్ళు మా ఇద్దరికీ మ్యారేజ్



చేయాలనుకుంటున్నారు". చెప్పింది జావళి.

" ఓ! లాస్ట్ సన్‌డే పెళ్ళిచూపులు జరిగాయని చెప్పాడు. అయితే మిమ్మల్నేనన్నమాట చూసింది." అంది ఆ అమ్మాయి.

సమాజంలో ఏ కొత్త సాంప్రదాయం తలెత్తినా అది మగవాడి స్వార్థానికి ఆడదాని పతనానికే కారణమవుతోంది. అలాంటిదే నేటి యువతలో కొత్తగా వెర్రితలలు వేస్తున్న ఈ లివింగ్ టు గెదర్ రిలేషన్".

'యస్' అంది జావళి.

చేతిలో మ్యాగ్‌జైన్ ప్రక్కన పడేసి జావళి దగ్గరికి వచ్చి 'మీరేమీ అనుకోకపోతే లాన్‌లో కూర్చుని మాట్లాడుకుందాం రండి.' అంది ఆ అమ్మాయి చనువుగా.

" అనిరుధ్ గురించి మీకు ఏం తెలుసో నాకు తెలీదు గానీ మా అందరికి తెలిసిన ఒక విషయం మీకు చెప్పాలనుకుంటున్నాను." అంది షైని.

"ఏంటది?" జావళికి చాలా టెన్షన్‌గా ఉంది.

" అనిరుధ్ దాదాపు రెండేళ్ళనుంచి రూప అనే అమ్మాయితో లివింగ్ టు గెదర్ రిలేషన్‌లో వున్నాడు. మేమందరం ఐదేళ్ళుగా టీమ్‌మేట్స్. మంచి ఫ్రెండ్స్‌మి కూడా. అందుకే అతను చేస్తున్నది మంచివని కాదని ఎంతగానో నచ్చచెప్పాము. కానీ వాడు మా మాటలు వినే స్టేజీలో లేడు. అదేమంటే వితండవాదన చేస్తాడు. ఎలాగైనా మీకీవిషయం తెలియజేయాలని మా టీమ్‌లోని అమ్మాయిలం అనుకున్నాం. ఒక ఆడపిల్ల జీవితం పాడైపోతుంటే చూస్తూ ఊరుకోలేం కదా. లక్కీగా మీరే ఆఫీసుకి వచ్చారు." చెప్పింది షైని.

ఆమె మాటలకి జావళి షాక్ అయింది. కొంచెం తేరుకున్నాక మళ్ళీ అనుమానం వచ్చింది షైనీ చెప్పింది నిజమో, కాదో అని. అదే అడిగింది. " మీరు చెప్పింది నిజమే అని ఏంటి నమ్మకం?".

" ఒకపని చేయండి. రూప విషయం వాళ్ళింట్లో కూడా అందరికీ తెలుసు. ఆ అమ్మాయి అప్పుడప్పుడు మా ఆఫీసుకి కూడా వస్తూవుంటుంది. మీ పేరెంట్స్‌ని ఈ విషయం గురించి వాళ్ళింట్లో వాళ్ళతో మాట్లాడమనండి. నిజమో, కాదో మీకే

తెలుస్తుంది." చాలా కాన్ఫిడెంట్‌గా చెప్పింది షైని.

ఈసారి జావళికి నిజంగానే తల తిరిగింది. అసలు ఆమె అతన్ని కలవాలనుకుంది తన ఆలోచనలు, నిర్ణయాలు అతనికి స్పష్టంగా చెప్పి, అతని అభిప్రాయాన్ని క్లియర్‌గా తెలుసుకోవటం కోసమే. తీరా ఇక్కడికి వచ్చాక అసలుకే మోసం వచ్చింది.

షైనికి థ్యాంక్స్ చెప్పి బయటికొచ్చేసింది జావళి.

ఇప్పుడు ఆమెముందు మరొక సమస్య ప్రత్యక్షమైంది. ఎట్టి పరిస్థితిల్లో ఈ విషయం ఇంట్లో వాళ్ళకి చెప్పాలి. కానీ చెప్పాక 'అసలు మాకు చెప్పకుండా అతని ఆఫీసుకి ఎందుకెళ్ళావని' తనకి పిచ్చి క్లాస్ పీకుతారు'. ఆ రాత్రంతా ఈ విషయాల గురించే బాగా ఆలోచించింది. చివరికి ఒక నిర్ణయానికి వచ్చి, మర్నాడు ఉదయం అతి ప్రయత్నంతో ధైర్యం కూడగట్టుకుని విషయాన్ని బయటపెట్టింది.

❖❖❖❖

మొత్తానికి మధ్యవర్తి ఏం చెప్పాడో తెలీదుకానీ రవీంద్ర చెప్పినట్టుగానే అనిరుధ్ తండ్రి, ఆయన స్నేహతులిద్దరు, అనిరుద్, వాళ్ళ మేనమామ ఒకరోజు సాయంత్రం ప్రకాష్ వాళ్ళింటికి వచ్చారు. అప్పటికే ప్రకాష్ వాళ్ళకి అనిరుధ్ గురించి తాము విన్నది నిజమే అని తెలిసింది. అందుకే విషయాన్ని ఎక్కువ సాగదీయకుండా పదినిమిషాలు ఆ కబుర్లు, ఈ కబుర్లు మాట్లాడాక ప్రకాష్ ఫ్రెండ్ హరికృష్ణ అసలు విషయానికొచ్చాడు. " మీ అబ్బాయి గురించి మేమొక విషయం విన్నాం. దాని గురించి మాట్లాడాలనే మిమ్మల్ని రమ్మన్నాం". అన్నాడు.

" అడగండి" అన్నాడు అనిరుధ్ తండ్రి. పెళ్ళివాళ్ళు మాట్లాడటానికి రమ్మన్నప్పుడే వాళ్ళకి అనుమానం వచ్చింది రూప గురించి తెలిసిందేమో అని.

" మీ అబ్బాయికి రూప అని ఎవరో గర్ల్‌ఫ్రెండ్ వుందిట కదా! ఆ అమ్మాయి గురించే'' అన్నాడు హరి.

ఆ మాట వినగానే వచ్చినవాళ్ళ ముఖాల్లో మార్పు స్పష్టంగానే కనిపించింది. పెళ్ళికొడుకు తండ్రి ఏం మాట్లాడాలో తెలీనట్టు తన స్నేహితుల వంక చూశారు. " మీరసలేమి విన్నారో మాకు క్లియర్‌గా చెప్తే దాన్ని గురించి వేం మాట్లాడగలం''. అన్నాడు ఆయన స్నేహితుడు కరుణాకర్.

" అదే! మీ అబ్బాయి, ఆ అమ్మాయి



దాదాపు రెండేళ్ళ నుంచి సహజీవనంలో వున్నారని తెలిసింది. ఆ విషయం మీ కుటుంబ సభ్యులకి కూడా తెలుసనివిన్నాం". అన్నాడు మళ్ళీ హరి.

''మేవే ఈ విషయం మీతో మాట్లాడాలనుకున్నాం. కానీ ఎలా చెప్పాలా అనే మీమాంసలో వుండగా మీరే కబురు చేశారు. వాళ్ళిద్దరిదీ ఏదో తెలిసీ తెలియని ఆకర్షణ. మా అబ్బాయికి పెళ్లి కుదిరిందని,

**పాతికేళ్ళు కష్టపడి నిర్మించుకున్న నా జీవితాన్ని ఇంతగా శాసించటానికి హు ఈజ్ హి డాడ్? నేను పెళ్ళి చేసుకోవాలనుకునేది జస్ట్ ఫర్ ఎ గుడ్‌లైఫ్ పార్టనర్. అంతేగానీ ఒక పర్మినెంట్ బాస్ కోసం కాదు. అయినా నా ఇష్టాయిష్టాల గురించి మీరు వాళ్ళకెందుకు ధైర్యంగా చెప్పలేకపోయారు డాడీ?"**

మీ అమ్మాయిని అదుపులో పెట్టుకోవటం మంచిదని వాళ్ళ పేరెంట్స్‌కి గట్టిగానే వార్నింగ్ ఇచ్చాం. వాళ్ళుకూడా ఆ అమ్మాయికి పెళ్లి చేయాలనే చూస్తున్నారుట. ఇవన్నీ ఈ వయసులో తెలిసీ తెలీక చేసే పిల్లచేష్టలు, అయినా పెళ్ళయి, పెళ్ళాం వస్తే వాడే దార్లో పడతాడని మా నమ్మకం. అదీకాక ఎలాగూ వాడు ఇండియా వదిలేసి వెళ్ళిపోతాడాయె. అప్పుడిక ఆ పిల్లతో సమస్యే వుండదు''. చాలా తెలివిగా, వ్యవహార్తలాగా చెప్పాననుకున్నాడు కరుణాకర్. కానీ అవన్నీ ముందుగా ప్రిపేరయి చెప్పినట్టే వున్నాయి.

"వాళ్ళిద్దరూ అంతగా ఒకరినొకరు ఇష్టపడుతున్నప్పుడు ఆ అమ్మాయినే మీ అబ్బాయికి చేసుకోవచ్చు కదా" అంది కోమలి చాలా నిదానంగా.

ఆ అమ్మాయిని చేసుకోవటమా? భలేవారండీ" అన్నాడు అప్పటిదాకా మౌనంగా వున్న పెళ్ళికొడుకు తండ్రి.

" ఏంటి అభ్యంతరం? వాళ్ళది మన కులం కాదా?'' అడిగింది కోమలి.

" ఇక్కడ సమస్య కులం కాదండి. గుణం. పెళ్ళి కాకుండానే పరాయి మగాడితో సంబంధం పెట్టుకుందంటేనే అదెంత సిగ్గు విడిచిందో అర్థం అవుతోంది. అలాంటిదాన్ని ఎవరైనా కోడలిగా తెచ్చుకుంటారా?'' అన్నాడు పెళ్ళికొడుకు తండ్రి అసహనంగా.

''ఎవరితోనో ఏముంది. మీ అబ్బాయితోనేగా" అంది కోమలి మళ్ళీ. ఇంతమంది మగవాళ్ళు వుండగా కోమలి తనే అలా పెళ్ళివాళ్ళతో డైరెక్ట్‌గా మాట్లాడ్డం

ప్రకాశానికి, హైమవతికి, రవీంద్రకి అస్సలు నచ్చలేదు.

" మనకి తెలిసి మా అబ్బాయి ఒక్కడే. తెలీకుండా ఎంతమందితో తిరుగుతుందో ఎవరికి తెలుసు?" ఈసారి అతని గొంతులో వ్యంగ్యం వుంది.

"క్షమించండి ఇప్పుడు మా అనుమానం కూడా అదే. రూప గురించి తెలిసింది కాబట్టి అడిగాం. మాకు తెలీకుండా మీ అబ్బాయి మాత్రం ఎంతమందితో తిరుగుతున్నాడో ఎవరికి తెలుసు? అయినా పిల్లని చూట్టానికి రాకముందే మీరిలాంటి విషయాలన్నీ ఓపెన్‌గా మాట్లాడాలి. అంతేగానీ, విషయం మాకు తెలిశాక మేమడిగితే చెప్పటం పద్ధతికాదు. ఒకవేళ మా అమ్మాయే ఇలా చేసిందని మీకు తెలిసుంటే ఇప్పుడు మాట్లాడినంత కూల్‌గా, తాపీగా మీరు మాట్లాడేవాళ్ళా? మా ముఖాన పేడనీళ్ళు కొట్టి, ఆ రూపని మాట్లాడినట్టే మాట్లాడేవారు. 'పెళ్ళయితే ఆ పిల్లే మారుతుందిలే' అనుకుని కోడలిగా చేసుకునేవారా? ఒక్క విషయం గుర్తుంచుకోండి. క్యారక్టర్ మనిషికి సంబంధించింది గానీ జెండర్‌కి సంబంధించింది కాదు. కానీ మనం అలా అనుకోవటం లేదు. అంతెందుకు. మీ అబ్బాయిలాగే రూప కూడా రేపు వేరే ఇంకెవరినో పెళ్ళి చేసుకుందనుకోండి. తర్వాత వీళ్ళిద్దరి వ్యవహారం ఆమె భర్తకి తెలిస్తే మరుక్షణమే అతను రూపని తన్ని పుట్టింటికి తరిమేస్తాడు. కానీ మీ అబ్బాయి విషయంలో మాత్రం భార్యకి అతని విషయం తెలిసినా చచ్చినట్టు ప్రేమతో అతన్ని మార్చుకోవాలి. తప్పు ఒక్కటే అయినా విలువలు మాత్రం భిన్నంగా ఉంటున్నాయి. పెళ్ళిముందు సహజీవనం పేరుతో ఒక ఆడపిల్ల జీవితాన్ని, పెళ్ళి చేసుకుని భార్య అనే పేరుతోమరో ఆడపిల్ల జీవితాన్ని మీ కొడుకు శాసిస్తాడన్నమాట. మీరుకూడా దాన్ని చాలా అందంగా వెనకేసుకొస్తున్నారు. శభాష్! మీలాంటి తల్లితండ్రులుండబట్టే ఆడపిల్లల జీవితాలు ఇంత అధ్వాన్నంగా తయారవుతున్నాయి. సమాజంలో ఏ కొత్త సాంప్రదాయం తలెత్తినా అది ఆడదాని పతనానికి, మగవాడి స్వార్థానికి ఉపయోగించుకుంటున్నాడు.

కోమలి ఆవేశంగా మాట్లాడుతోంది. ప్రకాష్‌కి మాత్రం ఆమె మాటలు చాలా దూరం వెళ్తున్నాయనిపించింది. అవన్నీ వాళ్ళతో డిస్కస్ చేయటం వల్ల గొడవ అవుతుందేమో అని అతని భయం. అందుకే ఆమెను వారించబోయాడు. కానీ కోమలి వినదలచుకోలేదు. తను చెప్పదల్చుకున్న విషయాన్ని చాలా స్పష్టంగా చెప్పాలనుకుంది.



" మీరు తెలుసుకోవాల్సింది, గుర్తుంచుకోవాల్సింది మరొక విషయం వుంది. ఈకాలం ఆడపిల్లలకు వాళ్ళు కెరీర్ పట్ల, జీవితం పట్ల కొన్ని ఆశలు, ఆశయాలు వున్నాయి. ఎవరో కౌన్‌కిస్కా కోసం తమ టైమ్‌ని, జీవితాన్ని త్యాగం పేరుతో వ్యర్థం చేసుకునేందుకు వాళ్ళు సిద్ధంగా లేరు. అంతేకాదు. మీ స్వార్థం కోసం ఆడపిల్లల జీవితాల్ని ప్రయోగశాలలుగా మార్చకండి.

> " ఈరోజుల్లో కూడా చాలామంది పేరెంట్స్ చేస్తున్న పొరపాటిదే. ఎంతసేపు ఆమె సుఖపడాలని ఆలోచిస్తారేగానీ, ఆమె హ్యాపీగా, శాటిస్‌ఫాక్షన్‌గా వుందా అనే విషయాన్ని గమనించరు. ఆడపిల్లలకీ మనసుంటుందని, వాళ్ళకీ కొన్ని గోల్స్, కెరీర్ ప్లానింగ్స్ వుంటాయని అర్థం చేసుకోరు. అందుకే ఈ రోజుల్లో పెళ్ళిళ్ళు ఎక్కువ శాతం ఫెయిల్ అవుతున్నాయి.

అది ఎవరికీ మంచిది కాదు". ప్రతీ మాటా చాలా స్పష్టంగా, శాసించినట్టే చెప్పింది కోమలి.

"ఎంత మోసం చేశారు. ముందుగా బయటపడింది కాబట్టి సరిపోయింది. లేకపోతే పిల్ల జీవితం నాశనం అయిపోయేది." అన్నాడు ప్రకాష్ పెళ్ళివాళ్ళు వెళ్ళిపోయాక.

" మోసమా? అంటే ఏంటి?" అడిగింది కోమలి.

అసలే కోమలి మీద కోపంతో వున్న ప్రకాష్‌కి ఆ ప్రశ్న మరింత చిర్రెత్తించింది. "నిజాన్ని దాచటం మోసం కాదా?" అన్నాడు చిరాగ్గా.

" మరి మీరూ వాళ్ళని మోసమే చేశారుగా" అంది కోమలి సూటిగా అతనివైపు చూస్తూ.

" నేను వాళ్ళని మోసం చేశానా? నీకేమైనా మతిపోయిందా? లేకపోతే అతి తెలివి ఎక్కువైందా?" అన్నాడు ప్రకాష్ కోపంగా.

"అతి తెలివి ఏముంది? జావళికి వంట వచ్చని, టెన్నిస్ ఆట ఏదో సరదాగా నేర్చుకుంది, ఇప్పుడు మానేసిందని చెప్పినవి అబద్ధాలు కాదా?" అడిగింది కోమలి.

" ఇవన్నీ చిన్న చిన్న విషయాలు. పెళ్ళయ్యాక భర్తకి ఇష్టమయితే టెన్నిస్ ఆడచ్చు. అదేమంత హెడ్ గోయింగ్ ఇష్యూ కాదు. కానీ అతని క్యారక్టరే సరైంది కాదుకదా!'' చాలా కోపంగా, చిరాగ్గా అడిగాడు.

" అవన్నీ ఎవరికి చిన్న విషయాలు నాన్నా. మీకా? వాళ్ళకా? ఎంతసేపు మీ ఆలోచనలు మీగురించి, వాళ్ళ గురించే తప్ప, పెళ్ళి చేసుకోవల్సినదాన్ని నా గురించి మాత్రం కాదు. అతనికి ఇష్టమైతే టెన్నిస్ ఆడాలి. అతను తన కెరీర్ కోసం అబ్రాడ్ వెళ్తే, నాకెరీర్ అంతా వదిలేసుకుని అతనితో వెళ్ళిపోవాలి. అతని కోసం వంట నేర్చుకోవాలి. అతని కోసం నా అలవాట్లు, ఆలోచన్లు అన్నీ మార్చుకోవాలి. పాతికేళ్ళు కష్టపడి నిర్మించుకున్న నా జీవితాన్ని ఇంతగా శాసించటానికి హు ఈజ్ హి డాడ్? నేను పెళ్ళి చేసుకోవాలనుకునేది జస్ట్ ఫర్ ఎ గుడ్‌లైఫ్ పార్టనర్. అంతేగానీ ఒక పర్మినెంట్ బాస్ కోసం కాదు. అయినా నా ఇష్టాయిష్టాల గురించి మీరు వాళ్ళకెందుకు ధైర్యంగా చెప్పలేకపోయారు డాడీ?'' జావళికి ఇంకా చాలా మాట్లాడాలనుంది కానీ అప్పటికే దుఃఖం ఆమె గొంతుకడ్డుపడింది.

జావళి మాటలకి ప్రకాష్ నిర్ఘాంతపోయాడు. తన కూతురు అలా మాట్లాడగలదనే విషయం అతనికి ఆ క్షణం దాకా తెలీదు. ఆమెని పసితనం నుంచి ఎప్పుడూ ఏలోటూ రాకుండా గుండెలమీద పెట్టుకుని పెంచాడు. ఎప్పుడైనా కోమలి మందలించినా అతను వెనకేసుకొచ్చేవాడు. అలాంటి తండ్రిని ఈరోజు ఆమె అలా ప్రశ్నించిందంటే అతనికి షాకే అయింది.

ప్రకాష్ పరిస్థితి అర్థం చేసుకున్న కోమలి అతని భుజం మీద చెయ్యి వేసి చిన్నగా చెప్పింది.

" మీకు జావళి అంటే ఎంత ప్రాణమో నాకు తెలుసు. ఒక విషయం చెప్పండి. ఈ రోజుదాకా జావళిని మనం అది ఆడపిల్లా, మగపిల్లవాడా అనే ఆలోచన లేకుండా పెంచాం, కానీ పెళ్ళి విషయానికొచ్చేసరికి మీరెందుకింత కంజర్వేటివ్‌గా థింక్ చేస్తున్నారో నాకర్థం కావటంలేదు".

" అది కంజర్వేటివ్ థింకింగ్ ఎందుకవుతుంది? అవతల కుర్రాడికి మంచి చదువు, ఉద్యోగం, మంచి ఫ్యామిలీ బ్యాక్‌గ్రౌండ్ అన్నీ ఉన్నప్పుడు మనమ్మాయి సుఖపడుతుంది కదా అనే ఆలోచనతో ఒకటి, రెండు విషయాలు అడ్జస్ట్ అవాలని చెపుతాం. అందులో తప్పేముంది?" ఈసారి ప్రకాష్ గొంతు చాలా కూల్‌గా వుంది.

" ఈరోజుల్లో కూడా చాలామంది పేరెంట్స్ చేస్తున్న పొరపాటిదే. ఎంతసేపు



ఆమె సుఖపడాలని ఆలోచిస్తారేగానీ, ఆమె హ్యాపీగా, శాటిస్‌ఫాక్షన్‌గా వుందా అనే విషయాన్ని గమనించరు. ఆడపిల్లలకీ మనసుంటుందని, వాళ్ళకీ కొన్ని గోల్స్, కెరీర్ ప్లానింగ్స్ వుంటాయని అర్థం చేసుకోరు. అందుకే ఈ రోజుల్లో పెళ్ళిళ్ళు ఎక్కువ శాతం ఫెయిల్ అవుతున్నాయి. మనం కూడా ఇప్పుడు అదే తప్పు చేస్తున్నాం. అలా కాకుండా జావళి ఆలోచనలు, అభిరుచులు తెలిసి, వాటిని ఇష్టపడే వ్యక్తితోనే దాని పెళ్ళిచేస్తే వాళ్ళిద్దరూ హ్యాపీగా వుంటారు. ఆడపిల్లలు పెళ్ళయి వేరేయింటికి వెళ్ళి అక్కడే స్థిరపడుతున్నప్పుడు మనం చెప్పినా చెప్పకపోయినా చాలా విషయాలు సర్దుకుపోతుంటారు. అవన్నీ మనం చిన్నవిషయాలుగా, చాలా సహజమైన విషయాలుగా భావిస్తాం కాబట్టి వాటిని గుర్తించం. జావళి విషయంలో కూడా నాకా నమ్మకం వుంది'' అంది కోమలి కూతురివంక మెచ్చుకోలుగా చూస్తూ.

తల్లి మాటలు విన్నాక జావళి మనసు కూడా కాస్త కుదుటపడింది. "ఏం కాలమో ఏమో! తెలిసీ తెలీక ఆ పిల్ల ఏదో మాట్లాడితే నాలుగు చివాట్లేసి కూర్చోపెట్టాల్సింది పోయి తందానా అంటే తానతందనానా అంటారు. బాగుందమ్మా నీ వరస" రుసరుసలాడింది హైమవతమ్మ. అనలే కుదిరిపోయిందనుకున్న సంబంధం తప్పిపోయిందనే బాధ వుంది ఆమె మనసులో.

ఆలోచించినకొద్దీ కోమలి మాటల్లో వాస్తవం వుందనిపించింది ప్రకాష్‌కి. 'నిజమే. పెళ్ళంటే ఒకరి అభిప్రాయాల్ని ఒకరు గౌరవించుకుంటూ, ఒకరిపై ఒకరికి నమ్మకం, ప్రేమ కలిగివుంటూ కలిసి చేసే జీవన ప్రయాణం. నిజానికి ఆడపిల్లల్ని మగపిల్లలతో సమానంగా చూస్తున్నాం అనుకుంటున్నాం గానీ, కాలానుగుణంగా తాడు పొడవుని మాత్రం పెంచుతూ పగ్గాలు మన చేతిలోనే వుంచుకుంటున్నాం. వాటిని పూర్తిగా వదలగలిగితేనే వాళ్ళు సమాజంలో నిజమైన సగభాగం అవుతారు. తమని తాము నిరూపించుకోగల్గుతారు' అనుకున్నాడు మనసులో. జావళిని దగ్గరికి తీసుకుని "సారీ డార్లింగ్. ఈసారికి నాన్నని క్షమించేసెయ్. ఇంకెప్పుడూ నిన్నిలా బాధపెట్టను. ఓకేనా?" అంటున్న ప్రకాష్ పెదవుల్ని వేళ్ళతో మూసేస్తూ "ప్లీజ్‌డాడ్! డోన్ట్‌సే లైక్ దిస్. ఐలవ్ యూ ఆల్‌వేస్". అంది ప్రేమగా.

ఆక్షణం ఆ ఇంట్లో నిజమైన ఆనంద వీచికలు అందరి మనసుల్ని హాయిగా తాకాయి. ●

# నూరేళ్ళ గురజాడ 'దేశభక్తి'

## గురజాడ 150 ఏళ్ళ జయంతోత్సవాల సందర్భంగా

- ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి



'దేశభక్తి' కవిత రాసిన గురజాడను దేశభక్తుడు కాదని నిందించటం తెలుగు వాళ్ళకే సాధ్యమయిన పనేమో! మహోన్నత దేశభక్తుడైన అంబేద్కర్‌నే దేశభక్తుడు కాదన్న మేధావులున్న భారతదేశంలో గురజాడను దేశభక్తుడు కాదనే తెలుగు వాళ్ళుండటం సహజమేనేమో!! సాంస్కృతిక మరుగుజ్జులు ఎంత గొంతు చించుకొని అరిచినా గురజాడ 'దేశభక్తి' కవిత తొంభై తొమ్మిదేళ్ళ నుండి ప్రజల నాలుకల మీదనే గాక హృదయాలలోనూ నాట్యం చేస్తూ మరో ఏడాదిలోకి అడుగుపెట్టింది. బహుశా భారతీయులకు నిజమైన దేశభక్తి అలవడే దాకా గురజాడ 'దేశభక్తి' కవిత ఆకాశంలో సూర్యునిలా ప్రకాశిస్తూనే ఉంటుంది. 'నవరసాల' వంటి వాళ్ళు నాలుకలు కాల్చుకున్నా, చీల్చుకున్నా ఆ కవితకు వన్నె తరుగదు.

భారతీయ నవలాపితామహుడైన బంకించంద్ర చటర్జీని గొప్ప రచయితగా కీర్తిస్తూనే ఆయన 'వందేమాతరం'కవిత కన్నా మన గురజాడ 'దేశభక్తి' కవిత వేయిరెట్లు గొప్పదని చెప్పడానికి సందేహించనక్కరలేదు. ఆయన 'వందేమాతరం' కవిత 'దేశభక్తి' కవితకన్నా దైవభక్తి కవిత అనడం సబబు. దైవభక్తి ఆధ్యాత్మికం, దేశభక్తి భౌతికం.

గురజాడ 'దేశభక్తి' కవితను 1910లో రచించాడు. అప్పటికి బెంగాల్ విభజన వ్యతిరేకోద్యమం ముగియుటంగాని, చివరిదశకు రావడంగాని జరిగింది. బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా భారతదేశ ప్రజలు అంతర్గత వైరుధ్యాలను పక్కనబెట్టి ఏకంకావడంలో 'వందేమాతరం' పాట పాత్ర ఎంతో ఉంది. అదొక మంత్రమన్నారు సుబ్రహ్మణ్య భారతి. బెంగాల్ విభజనను విరమించుకునేంత వరకు ప్రజలు ఉద్యమించడంలో ఆపాట స్ఫూర్తి కూడా ఉంది. రాజకీయాలకు సాహిత్యానికీ మధ్య సంబంధాన్ని కూడా ఆ పాట రుజువు చేసింది. 'వందేమాతరం మందే (మనదే) రాజ్యం' నినాదం తెలుగు నేలలో కూడా ప్రతిధ్వనించింది. 'వందేమాతరం' అన్నవాళ్ళు లాఠీ దెబ్బలు తిన్నారు. విద్యా సంస్థల నుండి బహిష్కరింపబడ్డారు. జైళ్ళకు వెళ్ళారు. శత్రువుకు చెమట పట్టించిన చరిత్ర 'వందేమాతరం' పాటకుంది. అయినా....

గురజాడ 'వందేమాతరం' పాటలో సంకుచితత్వాన్ని, అసమగ్రతను, అశాస్త్రీయతను చూశాడు. మనిషిని విస్మరించిన దేశభక్తిని గురజాడ ఆమోదించలేదు. దైవభక్తి, మతభక్తి, దేశభక్తిగా చెలామణి కావడాన్ని లౌకికవాది అయిన గురజాడ ఆమోదించలేకపోయాడు. బెంగాల్ విభజన వ్యతిరేకోద్యమంలో అన్ని మతాల వాళ్ళూ పాల్గొన్నా హిందూ దైవకీర్తన ఉండే పాట ప్రాధాన్యం వహించడాన్ని ఆయన గుర్తించాడు. 'దేశభక్తికి మతానికి సంబంధం లేదని, దేశభక్తి ఒక అహంభావంగా మారిపోయిందని గుర్తించిన గురజాడ శాస్త్రీయమైన దేశభక్తిని, మనిషి కేంద్రమైన దేశభక్తిని ప్రతిపాదిస్తూ తన కవితను రచించాడు. దేశాన్ని దేశభక్తిని ఇరుకు సందుల్లోంచి రహదారి మీదికి తీసుకొస్తూ తన కవితను రచించాడు. ఒకదేశంలో ఉండే మనుషులకు కులాలు, మతాలు ఉండవచ్చుగాని ఒక దేశానికి అవి ఉండవని చాటడానికి తన కవితను రచించాడు గురజాడ. "సుజలాం సుఫలాం మలయజశీతలాం" అన్నవి ఏ దేశంలోనైనా ఉంటాయి. మా గాలి, మా నీళ్ళు, మా పళ్ళు గొప్పవి అనడంలో అర్థంలేదు. పైగా భారతదేశంలో అన్ని ప్రాంతాలకు సుజలాం సుఫలాంలు వర్తించవు. అందుకే దేశభక్తికి సంబంధించి ప్రజల్ని సెంటిమెంటు నుంచి మనిషివైపు మళ్ళించడానికి గురజాడ ఆ కవితను రచించాడు.

గురజాడ 1910లో ' దేశమును ప్రేమించుమన్నా" అని చెప్పాడు. ఎందుకు చెప్పవలసి వచ్చింది? మనం దేశాన్ని ప్రేమించడం లేదు కాబట్టి. దేశాన్ని ప్రేమించడం మనకు తెలియదు కాబట్టి. తరగతి గదిలో అయ్యవారు "సైలెన్స్" అని ఎప్పుడంటారు? విద్యార్థులు చదవడం మానేసి అల్లరి చేస్తున్నపుడు. అలాగే మనం దేశాన్ని ప్రేమించకుండా కులాన్నో, మతాన్నో ప్రేమిస్తూ ఉంటే 'మనం ప్రేమించవలసింది దేశాన్ని' అని గురజాడ మనకు నేర్పారు.

దేశభక్తిని బ్రిటిష్ వాళ్ళ నుంచి భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించడానికి స్ఫూర్తినిచ్చే కేవలం రాజకీయ పనిముట్టుగా మాత్రమే గురజాడ భావించలేదు. ఆయన దేశభక్తిని ఒక జీవిత వేదాంతంగా, ఒక అభివృద్ధి మంత్రంగా చూశాడు. ఇవాళ మన దేశభక్తి కవితను మనం పాడుకొని రేపు ఇరుగు పొరుగు దేశాలతో ఎలాంటి భేషజమూ లేకుండా స్నేహపూర్వకంగా మసలుకోగలిగేట్టు రాశాడు గురజాడ.

1936లో డా॥ బి.ఆర్ అంబేద్కర్ 'కులనిర్మూలన' ప్రసంగ పత్రం రాశారు. "మనదేశంలో మనలో మనం పరస్పరం స్వాతంత్ర్య మిచ్చుకోకుండా, బ్రిటిష్ వాళ్ళ నుంచి స్వాతంత్ర్యం కోరే హక్కు మనకెక్కడుంది?'' అని ఆయన ప్రశ్నించారు. రాజకీయ నిరంకుశత్వం కన్నా సాంఘిక నిరంకుశత్వం చాలా క్రూరమైంది గనుక ఆర్థిక, రాజకీయ విప్లవాల కన్నా ముందు సాంఘిక విప్లవం రావాలని వాదించారు. సుభాస్ చంద్రబోస్, భగత్‌సింగ్ వంటివాళ్ళు స్వాతంత్రమంటే అధికారం తెల్లదొరల నుంచి నల్లదొరల చేతుల్లోకి మారడంకాదని ఒక మనిషి మరొక మనిషిని దోచుకునే వ్యవస్థ నిర్మూలనే అసలైన స్వాతంత్ర్యమని అన్నారు. 'మాకొద్దీ తెల్లదొరతనం' అని గరిమెళ్ళ అంటే 'మాకొద్దీ నల్లదొరతనం' అని కుసుమ ధర్మన్న పాడారు. బహుశా గురజాడలో ఈ ఆలోచనలు మొలకదశలో ఉన్నవేమో, వాళ్ళెవరూ బ్రిటిష్ వాళ్ళు మనదేశంలో శాశ్వతంగా ఉండిపోవాలని కోరుకున్నవాళ్ళుకారు. అయిదవ జార్జి మీద గేయం రాశాడనో,

**'కన్నుగానని వస్తుతత్వము కాంచ**
**నేర్పరులింగిరేజులు**
**కల్లనొల్లరు, వారి విద్యల**
**కరచి సత్యము నరసితిన్"**

అని రాశాడనో 'వెఱ్ఱిపురాణగాథల నమ్మజెల్లునె" అని అన్నాడనో గురజాడ దేశభక్తుడు కాదనడం ఆయన దేశభక్తి కవితను సరిగా అర్థం చేసుకోకపోవడమే. బ్రిటిష్ వాళ్ళొచ్చి భారతీయుల్ని ఆత్మన్యూనతలోకి నెట్టేస్తే అలా ఆత్మన్యూనతలో పడి మన సంప్రదాయాలను తిరస్కరించిన వాళ్ళలో గురజాడ ఒకరట. మన పురోహిత వర్గం బ్రిటిష్‌వాళ్ళ కన్నా ముందే కొన్నివేల ఏళ్ళ క్రితమే కర్మసిద్ధాంతంతో మొత్తం భారతీయ శ్రామిక జనాన్ని ఆత్మన్యూనతలోకి నెట్టివేసి ఉంది. బ్రిటిష్ వాళ్ళు వచ్చి కొత్తగా మనల్ని ఆత్మన్యూనతలోకి నెట్టారనటం అబద్ధం. కర్మ సిద్ధాంతం, కులవ్యవస్థ అత్యధికులైన శ్రామికుల్ని ఆత్మన్యూనతలోకి నెట్టేసి ఉంటే, వాళ్ళలో ఆత్మవిశ్వాసం కలిగించడానికి వేమన, వీరబ్రహ్మం వంటి వాళ్ళు మధ్యయుగాలలో దేశవ్యాప్తంగా తమవైన పద్ధతుల్లోకృషి చేశారు. వాళ్ళ ప్రయత్నాలు ఆధునిక యుగంలో కార్యరూపం ధరించే పరిస్థితి ఏర్పడింది. అదింకా పూర్తికాలేదు. గురజాడ 'దేశభక్తి' కవితను ఈ నేపథ్యంలో అర్థం చేసుకోవాలి.

గురజాడ 1910లో ' దేశమును ప్రేమించుమన్నా" అని చెప్పాడు. ఎందుకు చెప్పవలసి వచ్చింది? మనం దేశాన్ని ప్రేమించడం లేదు కాబట్టి. దేశాన్ని ప్రేమించడం మనకు తెలియదు కాబట్టి. తరగతి గదిలో అయ్యవారు "సైలెన్స్" అని ఎప్పుడంటారు? విద్యార్థులు చదవడం మానేసి అల్లరి చేస్తున్నపుడు. అలాగే మనం దేశాన్ని ప్రేమించకుండా కులాన్నో, మతాన్నో ప్రేమిస్తూ ఉంటే 'మనం ప్రేమించవలసింది దేశాన్ని' అని గురజాడ మనకు నేర్పారు. గురజాడ దేశభక్తుడు కాకపోతే ఇక దేశంలో దేశభక్తులంటూ ఎవరూ ఉండరు. 1910లో గురజాడ దేశభక్తి కవిత రాస్తే 1948లో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి 'కొత్తచూపు' కథలో "బ్రిటిష్ వాళ్ళు వచ్చేదాకా మనకు తెలిసింది" దైవభక్తి, రాజభక్తీ తప్ప దేశభక్తి కాదు. అది ఆ తర్వాతనే తెలిసింది అనిపించాడు ఒక పాత్రతో. మనిషి తన రూపంలో తాను సృష్టించిన దేవునికి తానే బానిసైపోయి సాటి మనిషిని రాయికన్నా హీనంగా చూసే దశకు దేశం చేరుకుంది. అప్పుడు గురజాడ దేశాన్ని ప్రేమించుమన్నాడు. మంచిని పెంచుమన్నాడు. దేశభక్తికి మంచికి మధ్య ఉండే పేగుబంధం గురజాడకు తెలుసు. మనదేశాన్ని ఆర్థికాభివృద్ధివైపు నడిపించి, సమాజాన్ని ప్రజాస్వామ్యంవైపు మళ్ళించే సాధనమే ఆయన దృష్టిలో దేశభక్తి. నా గాలి గొప్పది, నా నీళ్ళు గొప్పవి అని తొడలు చరచడం ఆయన దృష్టిలో దేశభక్తికాదు.

అందుకే దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్ అన్నారు. దేశాన్ని ప్రేమించడమంటే దేశంలోని మనుషుల్ని ప్రేమించడమే. ఆయన దృష్టిలో మనిషిని నమ్మేవాడు, మనిషిని గౌరవించేవాడే నిజమైన దేశభక్తుడు. "మనిషి చేసిన రాయి

దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్ అన్నారు. దేశాన్ని ప్రేమించడమంటే దేశంలోని మనుషుల్ని ప్రేమించడమే. ఆయన దృష్టిలో మనిషిని నమ్మేవాడు, మనిషిని గౌరవించేవాడే నిజమైన దేశభక్తుడు.

**కోల్పోయింది తక్కువేమీకాదు. ప్రజలు 'మనం మనుషులం' అనే నిజాన్ని మరిచిపోయి మనం కులాలం, మతాలం అని గుర్తుపెట్టుకోవడం వల్ల ప్రజల మధ్య ఆర్థిక, సాంఘిక వైరుధ్యాలు, అనైక్యత పెరిగాయి.**

రప్పకు మహిమ కలదని సాగిమొక్కుతూ సాటి మనిషిని రాయికన్నా హీనంగా చూసే" భక్తిని గురజాడ దేశభక్తిగా గుర్తించలేదు. ఆమోదించలేదు. మనిషిని మనిషివైపు నిలబడమన్నాడు. ఆయన దేశభక్తికి మానవీయ స్పర్శఉంది. జాతీయ దురహంకారానికి మానవీయ స్పర్శ పొడగిట్టదు. గురజాడ దేశభక్తి మనుస్మృతిలోంచి పుట్టలేదు. అది ఫ్రెంచి విప్లవం అందించిన స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే సూత్రాలలోంచి పుట్టింది. దానికి అంతర్జాతీయ నేపథ్యముంది. గురజాడది విప్లవాత్మక దేశభక్తి. మనుషుల్ని కులాలుగా, మతాలుగా చీల్చి దేశాన్ని నిర్వీర్యం చేసే దుర్మార్గానికి భిన్నంగా మనిషిని మనిషిగా గౌరవించే దేశభక్తి గురజాడది.

గురజాడ దేశభక్తికి మనిషి పునాది. మనిషి-మానవ శ్రమ- దాని ఉత్పత్తి- మానవ సంబంధాలు ఇవీ గురజాడ దేశభక్తిలోని కీలకాంశాలు. ఆయనవి భౌగోళిక సరిహద్దురాళ్ళ దేశభక్తి కాదు. అందుకే "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్" అన్నారు. మనిషి అంటే ఆరోగ్యంగా ఉండే మనిషి. మనిషి ఆరోగ్యంగా ఉండాలంటే తిండి కావాలి. తిండి కావాలంటే పంటలు పండించాలి. ఉత్పత్తులు పెంచాలి. అవి కావాలంటే శ్రమించాలి మనిషి. శ్రమ చెయ్యాలంటే మళ్ళీ తిండే గతి. శ్రమించే మనుషుల మధ్య ప్రేమపూరిత సంబంధాలుండాలి. సౌభ్రాతృత్వభావన ఉండాలి. దీనికి మానసిక ఆరోగ్యం ముఖ్యం.

భారతీయ వేదాంతం మనిషిని నిష్క్రియాశీలుణ్ణి చేస్తే, ఆంగ్లవిద్య భారతీయులకు ఉపన్యాస కళను నేర్పింది. గిరీశంలాంటి కొందరైనా ఇందుకుదాహరణలు. కోట పురుషోత్తం చెప్పినట్లుగా 'తడి తక్కువ తమాషా ఎక్కువ'. మాటలు పెరిగి పని తగ్గిపోయింది. అందుకే గురజాడ....

**"వొట్టి మాటలు కట్టిపెట్టోయ్**
**గట్టిమేల్ తలపెట్టవోయ్"**

అని ప్రబోధించాడు. దేశంలో ఉత్పత్తులు పెంచి ఆర్థికాభివృద్ధికి పాటుపడడమే ఆ మేలు.

**" ఈసురోమని మనుషులుంటే**
**దేశమేగతి బాగుపడునోయ్"**

అని ప్రశ్నించాడు. మనిషికి తిండిలేని చోట "సుజలాం సుఫలాం" అని పాడినందువల్ల ప్రయోజనమేమిటి? దేశం అభివృద్ధి చెందాలంటే దేశ సంపద పెరగాలి. సంపద పెరగాలంటే ప్రపంచ దేశాల జ్ఞానం మనకు దక్కాలి. మనకు అందుబాటులోకి రావాలి.

**"జల్దుకొని కళలెల్ల నేర్చుకు**
**దేశి సరుకులు నించవోయ్"**

అన్నాడు గురజాడ. "దేశి సరుకులు నించవోయ్" దేశి సరుకులనమ్మవోయ్" అన్న గురజాడను దేశభక్తుడు కాదంటున్నామంటే మన మానసిక స్థాయి ఏమిటో అర్థం చేసుకోవచ్చు.

భూస్వామ్య వ్యవస్థను కదిలిస్తూ పెట్టుబడిదారీ వ్యవస్థ వచ్చింది. దానికన్నా ఇది మేలైనది. దానిని ఆహ్వానించడమే అప్పటికి ప్రగతిశీల చర్య. గురజాడ ఆ పనే చేశారు.

**"డబ్బు తేలేనట్టినరులకు**
**కీర్తి సంపదలబ్బవోయి"**

అని అందుకే గురజాడ అనవలసి వచ్చింది.

గురజాడ గతాన్ని పూర్తిగా తిరస్కరించలేదు. అట్లని గతంలోనే ఇరుక్కు పొమ్మనలేదు. గతంలో ఉండే కొంచెం మంచిని స్వీకరించమన్నాడు.

**"వెనక చూసిన కార్యమేమోయి**
**మంచిగతమున కొంచమేనోయి**
**మందగించక ముందు అడుగేయి**
**వెనకబడితే వెనకేనోయ్"**

అని హెచ్చరించాడు. వైతాళికుడంటే ఇలా హెచ్చరించేవాడే. భారతీయులకు అప్పటికి ఇంతకన్నా అవసరమైన హెచ్చరిక ఏమున్నది?. ఈ హెచ్చరిక చెయ్యడం కన్నా మించిన దేశభక్తి అప్పటికి ఇంకొకటిలేదు. సంస్కృతికి గతమేగాని వర్తమాన ముందదని భావించే వారికి గురజాడ అర్థమవుతాడా? "మంచిగతమున కొంచెమేనోయ్" అన్న కవి ఆత్మన్యూనతలో పడ్డాడని అనేవాళ్ళ నిజాయితీ సందేహాస్పదం. "కొత్తపాతల మేలుకలయిక"ను ప్రతిపాదించిన కవి గురజాడ అన్న విషయాన్ని మరిచిపోతే ఎలా? భారతదేశం కులమతాల నిలయం. వీటివల్ల మన సమాజం కోల్పోయింది తక్కువేమీకాదు. ప్రజలు 'మనం మనుషులం' అనే నిజాన్ని మరిచిపోయి మనం కులాలం, మతాలం అని గుర్తుపెట్టుకోవడం వల్ల ప్రజల మధ్య ఆర్థిక, సాంఘిక వైరుధ్యాలు, అనైక్యత పెరిగాయి. డా॥బి.ఆర్. అంబేద్కర్ అన్నట్లు శ్రమ విభజనే కాకుండా శ్రామిక విభజన కూడా జరిగిపోయింది. బ్రిటిష్ వాళ్ళు వచ్చి మనల్ని విభజించి పాలించడం నిజం కాదు. వాళ్ళు రాకముందే భారతీయులు నాలుగు వేలకు మించిన కులాలుగా విడిపోయి ఉన్నారు. కర్మసిద్ధాంతం ఉండనే ఉంది. అనేకం ఉన్నప్పుడు ఘర్షణ తప్పదు. కులమతాల మధ్య సంఘర్షణ అనివార్యం. కులమత నిర్మూలనే దానికి పరిష్కారం. అవి నిర్మూలింపబడేదాకా ఏమి చెయ్యాలి?. సామరస్య జీవనమొక్కటే మార్గం.

**చెట్టపట్టాల్ పట్టుకుని**
**దేశస్థులంతా నడవవలెనోయ్**
**అన్నదమ్ముల వలెను జాతులు**
**మతములన్నీ మెలగవలెనోయి**
**మతం వేరైతేను యేమోయి**
**మనసులొకటై మనుషులుంటే**
**జాతమన్నది లేచి పెరిగి**
**లోకమున రాణించునోయి**

ఇదీ గురజాడ ప్రభోధించిన మార్గం. విడిపోయిన జనాన్ని కలిసి బతకమని ప్రబోధించిన కవిని దేశభక్తుడు కాదనడం మూర్ఖత్వం కన్నా మించిన ఘోరం. మతం పేరుమీద నిరంతరం పరస్పరం కత్తులు దూసుకుని మారణకాండను నడిపించే శక్తులను మార్చేప్రక్రియ చేపట్టిన కవికన్నా దేశభక్తుడెవరు? ఆర్థిక,సాంఘిక, ధార్మిక వైరుధ్యాలతో సతమతమవుతున్న భారతదేశానికి "శ్రమ-ప్రేమ" అనే సిద్ధాంతాన్ని మందుగా అందించాడు గురజాడ.

**దేశమనియెడు దొడ్డ వృక్షం**
**ప్రేమలను పూలెత్తవలెనోయ్**
**నరుల చమటను తడిసి మూలం**
**ధనం పంటలు పండవలెనోయి**

ద్వేషమే కూడు, గూడు, గుడ్డగా బతికేవాళ్ళకు ఈ ప్రేమసిద్ధాంతం అర్థంకాదు. విశ్రాంతి వర్గానికి ఈ చమట సిద్ధాంతం వంటబట్టదు. భారతీయుల మధ్య కుల, మత సంబంధాలను తిరస్కరించి ప్రేమ-సౌభ్రాతృత్వ పూరితమైన మానవ సంబంధాలను ప్రతిపాదించాడు గురజాడ. అంతర్గత వైరుధ్యాలను నిర్మూలించుకొని జనమంతా సామూహికంగా శ్రమిస్తే దేశం ఆర్థికాభివృద్ధి చెందుతుంది. కాబట్టి శ్రమకు ప్రేమకు మధ్య విడదీయరాని సంబంధముంది. దేశభక్తి కవిత పుట్టి నూరేళ్ళు కావస్తున్నది. ఆయన దేశభక్తి కవితలో ప్రతిపాదించిన అంశాలు-ఇవాళ వాస్తవాలు-వీటిని పోల్చుకుంటే మనం

**ఈ నూరవ సంవత్సరంలో దేశభక్తి కవితను మూలమూలకు తీసుకొని పోవాలి. గురజాడది విదేశీవాదమనో, మితవాదమనో కొట్టి పారేస్తే నష్టపోయేది మన సమాజమే. "యెల్లలోకమువొక్క యిల్లై" అనే కోరికగల గురజాడ దేశభక్తి కవితకు ఏ దేశానికైనా జాతీయగీతం కాగలిగిన అర్హత ఉంది.**

గురజాడ దగ్గరికైనా వెళ్ళామా? గురజాడ మాటలు మనం విన్నామా? వంటి ప్రశ్నలకు సమాధానం దొరుకుతుంది.

దేశభక్తి విషయంలో మనం బంకింబాబును దాటి రాలేదు. గురజాడను ఎప్పుడు చేరతామో! కులాల కుమ్ములాటలు, మతాల మారణహోమాలు కొనసాగుతూనే ఉన్నాయి. విదేశీ సరుకుల మీద వ్యామోహం పెరుగుతున్నది. మనుషులు క్రమక్రమంగా శ్రమకు దూరం కావడంలేదా? క్రికెట్ మ్యాచ్ మనదేశభక్తికి కొలమానమయ్యే దౌర్భాగ్యస్థితిలో ఉన్నాం. ఇరుగుపొరుగు దేశాల పట్ల శత్రుభావం కలిగుండడమే దేశభక్తిగా తయారయింది.

**"సొంత లాభము కొంత మానుకు**
**పొరుగువాడికి తోడుపడవోయ్"**

అన్న ప్రబోధం తలకిందులైపోయి ఆదాయం పన్ను ఎగవేతదారుల ధర్మసత్రంగా దేశం తయారయ్యింది. దేశమనే దొడ్డ వృక్షాన్ని తలా ఒక కొమ్మ నరుక్కుంటున్నారు. దేశభక్తి వేషానికి పరిమితమైపోయి ఆచరణ దానికి భిన్నంగా ఉంటున్నది. వెనకచూపునకు కొదవేలేదు. కాలం చెల్లిన శాస్త్రాలు ఇంకా మనుషుల్ని నియంత్రిస్తూనే ఉన్నాయి. "పూనుస్పర్ధను విద్యలందే" అన్నమాట అర్థాన్ని మార్చుకుంది. అనారోగ్యకరమైన దురభిమానాన్ని వదులుకొని, దేశంమీద ప్రేమను పెంచుకొని గురజాడ మార్గం అనుసరించనంత వరకు మనదేశం అన్ని విధాలుగా ఆధునిక దేశం కాదు. మనదేశం నిజమైన లౌకిక దేశంగా మారేదాకా ఆయన దేశభక్తి కవితకు విలువ ఉంటుంది. దేశభక్తిని మూఢనమ్మకంగా కాక దేశాభివృద్ధికి సాధనంగా మార్చుకుంటే ప్రయోజనముంది. చెట్టపట్టాల్ వేసుకొని దేశస్థులంతా మెలిగేరోజు వచ్చేదాకా దేశభక్తి కవిత మార్గదర్శిగానే ఉంటుంది.

ఈ నూరవ సంవత్సరంలో దేశభక్తి కవితను మూలమూలకు తీసుకొని పోవాలి. గురజాడది విదేశీవాదమనో, మితవాదమనో కొట్టి పారేస్తే నష్టపోయేది మన సమాజమే. "యెల్లలోకమువొక్క యిల్లై" అనే కోరికగల గురజాడ దేశభక్తి కవితకు ఏ దేశానికైనా జాతీయగీతం కాగలిగిన అర్హత ఉంది. మనదేశంలో జాతీయ గీతం కాదగిన లక్షణం బంకిం గీతం కన్నా గురజాడ గీతానికే ఎక్కువగా ఉంది. విగ్రహాలను కూలగొట్టటం ఇష్టం లేకపోతే తెలుగు ప్రజలకన్నా 'దేశభక్తి' రాష్ట్ర గీతం కావాలి. బలవంతంగా పాడించనక్కరలేదు గాని స్వచ్ఛందంగా ప్రజలు పాడుకునే చైతన్యం తీసుకురావాలి. ఆంగ్లంలోకి, ఇతర భారతీయ భాషలలోకి "దేశభక్తి" గీతాన్ని అనువదించాలి.

**('దీపధారి గురజాడ' వ్యాసాల సంకలనం నుంచి)**

## హైకూలు

వెయ్యినాణెమైంది
యూరియాకు
వయసు పెరిగింది
రైతన్నకు వెన్ను విరిగింది
ఊరించావ్

❖ ❖ ❖

మొక్క ఎదగాలంటే
కావాలండోయ్ ఎరువు
పదవి ఉండాలంటే
వేయాలండోయ్ దరువు
పచ్చదనం కావాలంటే
వచ్చిందండోయ్ కరువు

❖ ❖ ❖

ఊరించావ్
ఉడికించావ్
వలపుసెగ రగిలించావ్
పదుచుపిల్లవు కావు
ప్రపంచీకరణవు

ధాన్యం రాసులు రాసులు
గాదెల్లో, పురుల్లో
కొందామంటే కొరివి
అమ్ముదామంటే అడవి
దైన్యంతో దిగాలుగా రైతన్న

❖ ❖ ❖

– విశ్వశ్రీ

# నక్షత్ర

- శాంతి శ్రీ




'చిట్టి చిలకమ్మా... అమ్మ కొత్తిందా? తోటకెల్లావా...? పండూ తెచ్చావా? గూతిలో పెట్టావా? గుతుక్కుమన్నావా?...." అంటూ చిన్నారి నక్షత్ర వచ్చీరాని మాటలను కూర్చి రాగయుక్తంగా తలూపుతూ పాడుతుంటే అప్పుడే ఆఫీసు నుంచి వచ్చిన శ్రావణి మురిసిపోతూ అలానే నిల్చుండిపోయింది. శ్రావణిని చూడగానే 'అమ్మా...అమ్మా..." అంటూ వచ్చేసి చీరను తన గుప్పిట్లో పట్టుకుని నిలబడి చేతులిచ్చేసి ఎత్తుకోమని...'ఎత్తు...ఎత్తు...' అంటోంది. 'ఇప్పుడే కదరా ఆఫీసు నుండి వచ్చింది. కొంచెం కాళ్ళూ చేతులు కడుక్కోనివ్వరా ఎత్తుకుంటా అంటూ నక్షత్రను వదిలించుకుని లోపలికెళ్ళింది శ్రావణి. అంతే బిక్కమొఖం వేసుకుని కూర్చుండిపోయింది నక్షత్ర. "చిన్నీ ఇటురారా... 'కాళ్ళాగజ్జ' ఆడదాం... రా...రా' అని అమ్మమ్మ శారదమ్మ పిలవగానే...గబగబా నడవలేక దభీమని కిందపడింది. వెంటనే లేవకుండా అలాగే పడుకొని వేగంగా పాక్కుంటూ శారదమ్మ దగ్గరకు వెళ్లింది. శారదమ్మ పక్కనే గోడకానుకుని కూర్చుని రెండు కాళ్ళూ జాపింది. 'కాళ్ళా గజ్జా కంకాళమ్మా....వేగుల చుక్కా వెలగా పండు....కాలూతీసి కరగాపెట్టూ...' అని శారదమ్మ పాడగానే కాలు లోపలికి ముడిచేసింది. ఈలోపు శ్రావణి పాలు కలుపుకుని రాగానే ఆ ఆట మానేసి శ్రావణి దగ్గరకు గబగబా వచ్చేసింది. శ్రావణి ఎ అంటే...నక్షత్ర బి అంటుంది. సి అంటే డి అంటుంది...ఒన్ అంటే టూ అంటుంది. త్రీ...అంటే ఫోర్ అంటుంది. అలా..అంటూ అంటూ అటూ ఇటూగా చెప్పేసి లాస్ట్‌కి 'టెన్' అని మాత్రం తనే పెద్దగా అంటుంది. దాని చేష్టలకు ఇంట్లో అందరూ మురిసిపోవడమే. నక్షత్రకు మూడో ఏడు రాబోతోంది. ఇక పట్టుకోవటం కష్టమవుతోంది.

టీవీలో పాటరాగానే నడుమంతా తిప్పుతూ ఒకటే డ్యాన్సులు...ఒక రోజైతే శ్రావణి తమ్ముడు కిరణ్ దాని డ్యాన్స్‌కి మురిసిపోయి సిడిప్లేయర్ తెచ్చాడు. పాట తర్వాత పాట పెడుతూ ఉంటే అలాగే వేస్తూ ఉంది. ఇక ఒక దశలో దానంతటది నుంచోలేక గోడపక్కన నిలబెట్టిన మంచాన్ని పట్టుకుని డ్యాన్స్ వేయడం ప్రారంభించింది. అందరూ మురిసిపోయారు. తెల్లారి పిల్ల నుంచోలేక అవస్థలు పడుతుంటే శ్రావణికి చాలా బాధేసింది. అయ్యో...చిన్నితల్లి ...అది డ్యాన్స్ చేస్తుందని మురిసిపోయామేగానీ... దాని ఇబ్బందిని తల్లినై ఉండి ఆలోచించలేకపోయానే' అని తనను తాను తిట్టుకుంది. ఆరోజు ఆఫీసుకు సెలవు పెట్టేసింది. నక్షత్ర కాళ్ళకు వెన్నపూస రాసింది....సవరదీసింది....నొక్కింది...వేడినీళ్ళ కాపడం పెట్టింది. ఆరోజంతా ఎత్తుకునే తిప్పింది. అసలే శ్రావణి భర్త శరత్‌కి డ్యాన్స్ అంటే పడదు. 'డ్యాన్స్ చాలా తప్పు అనేది అతని అభిప్రాయం. ఎంత చెప్పినా దాన్నిమాత్రం మార్చుకోడు. ఇప్పుడు పిల్లకిలా అయిందని తెలిసి మరీ సీరియస్‌గా ఉన్నాడు. వాళ్ళ అచ్చట్లూ ముచ్చట్లూ చూసి మురిసిపోవాలి. కాకపోతే ఏదీ అతి కూడదు. రియాల్టీషోల్లాంటివీ తనకూ నచ్చవూ.... కానీ ముద్దుగా ఇంట్లో వచ్చీరానీ డ్యాన్స్ చేస్తుంటే వద్దనుకోవడం సరికాదు...' అనుకోకుండా ఉండలేకపోయింది శ్రావణి.

❖❖❖❖

నక్షత్ర ఇప్పుడు ఆరోతరగతిలోకి వచ్చింది. ఇద్దరూ ఉద్యోగాలు చేసేవాళ్ళే. ఈ ట్రాఫిక్ రద్దీలో....ఉదయం పది గంటలకు వెళ్ళిన వాళ్ళు సాయంత్రం ఇంటికి చేరేసరికి ఎనిమిది. ఒక్కోసారి తొమ్మిదికూడా దాటుతుంది. నక్షత్రతో గడిపే సమయం చాలా తక్కువైపోతోంది. చదువులో వెనకబడుతుందని మార్కులు చూస్తే

> ఆరోజు ట్యూషన్ నుంచి వస్తూనే...'మున్సిపాలిటీ వ్యాను వచ్చిందంట...కుక్కల్నితీసుకెళ్ళిపోయారంట...' ఆనందంతో చెపుతోంది నక్షత్ర. ఆ కళ్ళల్లో ' నేనిక నిశ్చింతగా ట్యూషన్‌కి వెళ్ళిరావొచ్చు....రోడ్డుమీద స్వేచ్ఛగా తిరగొచ్చు'అన్న భరోసా కనిపించింది శ్రావణికి.

అర్ధమవుతుంది. అన్నీ చదివి అప్పజెప్పావుగా మరేంటి ఈ మార్కులు అంటే... గుర్తుండటంలేదమ్మా...'అంటుంది.

ఇదే విషయం ఆఫీసులో స్నేహితురాలు సరోజతో చెప్పి బాధపడింది శ్రావణి. 'నువ్వేం బాధపడకు శ్రావణీ... సంగీతం నేర్పించావంటే మీ అమ్మాయికి జ్ఞాపకశక్తి పెరుగుతుంది. కావాలంటే నేర్పించి చూడు నీకే తెలుస్తుంది' అని భరోసాగా చెప్పింది. దీంతో శ్రావణి మనస్సు కొంచెం తేలికపడింది. వెంటనే ఇంటికి దగ్గర్లో సంగీతం నేర్పేవారు ఎవరున్నారా? అని శ్రావణి, శరత్ ఎంక్వయిరీ చేశారు. సాయంత్రం స్కూలు అయ్యాక సంగీతానికి వెళ్ళే ఏర్పాటు చేశారు. రెండేళ్ళు బాగానే గడిచిపోయాయి. నిజంగానే నక్షత్ర జ్ఞాపకశక్తి మెరుగుపడింది. ఆ తర్వాత క్లాసు పెరగటం...అందులోనూ నక్షత్ర కార్పొరేట్ స్కూల్లో చదవటం వల్ల సంగీతం నేర్చుకోవటం అదనంగా మారి, ఒత్తిడికి లోనవుతోంది. అదీ కాకుండా, ఈ ఏడాది ట్యూషన్ కూడా పెట్టించారు. ఫీజులు కూడా తడిసి మోపెడయ్యాయి. దానికీ ఒత్తిడి పెరుగుతుంది 'ఎలా? నక్షత్రకు ఇబ్బంది కలగకుండా ప్లాన్ వేయడమా?'అని శ్రావణి తలబద్ధలు కొట్టుకుంటుంటే....శరత్ మాత్రం రెండో ఆలోచనకు అవకాశం లేకుండా నక్షత్రా! రేపటి నుంచి సంగీతం క్లాస్‌కెళ్ళొద్దు....' అంటూ ఆదేశాలు జారీ చేసేశాడు.

❖❖❖❖

'పొద్దున వెళ్ళి రాత్రికొస్తారు. పిల్ల ఏం ఇబ్బంది పడ్తుందో...ఏంటో ఆజాపజా కనుక్కోడమే లేదు....' అంటూ ఆఫీసు నుండి రాగానే శ్రావణికి శారదమ్మ చెప్పటం మొదలు పెట్టింది. 'ఏంటమ్మా...? విషయం చెప్పు...!అంది శ్రావణి కొద్దిగా చిరాగ్గానే...'ఏం చెప్పమంటావ్...ట్యూషన్ నుంచి వచ్చేప్పుడు కుక్కలు వెంటపడుతున్నాయంట...' 'అది చెప్తేగా తెలిసేది...' అంది శ్రావణి. 'మీరూ తెలుసుకోవాలిగా! స్కూల్లో టీచర్లను, ట్యూషన్ టీచర్‌ను కలిసి ఎలా చదువుతుందో? ఏంటో ఒక్కరోజు టైం కేటాయించలేరా...? అంటూ శ్రావణికి క్లాస్ తీయడం మొదలు పెట్టింది శారదమ్మ. 'సరే...సరే...నక్షత్ర వచ్చాక..అన్నీ కనుక్కుంటా...' అంటూ వంటకు ఉపక్రమించింది శ్రావణి.

రాత్రి 8.30 అవుతుండగా ఏడుస్తూ వచ్చింది నక్షత్ర....'ఏంట్రా?' అంటూ అప్పటికే దానికోసం బాల్కనీలో నుంచి ఎదురుచూస్తున్న శారదమ్మ కిందకెళ్ళిపోయింది.'నేనెంత మొత్తుకున్నా మీ అమ్మా నాన్నకు పట్టదు...రేపట్నుంచి ఇద్దరం కలిసి నడుచుకుంటూ వెళ్దాం..' అంటూ పైకి వచ్చారు అమ్మమ్మా మనుమరాలు. 'అమ్మా! మన కాలనీలో కుక్కలు రోజూ వెంటపడుతున్నాయమ్మా? నాకు చాలా భయమేస్తుంది...నేట్యూషన్‌కు వెళ్లనమ్మా....' ఏడుస్తూ శ్రావణిని చుట్టుకుపోయి ....కరాఖండీగా చెప్పింది నక్షత్ర. ' అలా కంగారు వద్దు చిన్నీ....' అంటూ నక్షత్రను దగ్గరకు తీసుకుంటూ ' ఆ సమస్యకు పరిష్కారమేంటో ఆలోచిద్దాం...నువ్వు ముందు ఫ్రెష్ అయిరా...భోజనం చేద్దువుగానీ....' అంది శ్రావణి.

రాత్రికి శరత్ ఇంటికి వచ్చాక విషయం చెప్పింది శ్రావణి. 'ఏం చేద్దాం....? అన్నాడు శరత్. 'రోడ్డు మీద తిరిగే ఊరకుక్కల్ని తీసికెళ్ళాలని మున్సిపాలిటీ వాళ్ళకు కంప్లెయింట్ చేద్దామని... మన కాలనీ వారందర్నీ సమావేశపరిచి చెపుదాం....' ప్రపోజ్ చేసింది శ్రావణి. 'గుడ్ ఐడియా... ఏమైనా నీ బుర్ర చాలా షార్ప్' అంటూ శ్రావణిని మెచ్చు కున్నాడు శరత్.

**'నేవెళ్లనని ఎన్నిసార్లు చెప్పాలి? భవానీ వాళ్ళ తమ్ముడు కిందేమన్నా కనిపిస్తాడేమో వాడ్ని పిలుస్తా' అంటూ వెళ్ళబోయింది. శ్రావణికి ఎక్కడలేని కోపం ముంచుకొచ్చింది. వెళుతున్నదాని జడలాగిపుచ్చుకుని ఒక్కలాగు లాగి ఒక్కటిచ్చుకుంది. 'వయస్సు పెరుగుతున్నా జ్ఞానం ఉండటంలేదు...చెప్పగానే వినటం నేర్చుకో బాగుపడతావ్...'అని కేకలేసింది.**

'రేపు ఆదివారమే సమావేశ మవుదాం అనుకుని' నిద్రకుపక్రమించారిద్దరూ.

ఆదివారం సమావేశంలో శ్రావణి, శరత్ తమ అభిప్రాయాన్ని చెప్పారు. కాలనీ వారంతా ఆమోదం తెలిపారు. కొందరు కలిసి మున్సిపాలిటీ వాళ్ళకూ, స్థానిక కార్పొరేటర్‌కు కూడా కంప్లెయింట్ చేశారు. వారం రోజులైనా ఎటువంటి చర్యా లేదు. రెండుసార్లు కంప్లెయింట్ చేసిన తర్వాత వారం రోజులకు మున్సిపాలిటీ వాళ్ళు వచ్చి కుక్కల్ని పట్టికెళ్ళారు.

ఆరోజు ట్యూషన్ నుంచి వస్తూనే...'మున్సిపాలిటీ వ్యాను వచ్చిందంట...కుక్కల్ని తీసుకెళ్ళిపోయారంట...' ఆనందంతో చెపుతోంది నక్షత్ర. ఆ కళ్ళల్లో 'నేనిక నిశ్చింతగా ట్యూషన్‌కి వెళ్ళిరావొచ్చు....రోడ్డుమీద స్వేచ్ఛగా తిరగొచ్చు'అన్న భరోసా కనిపించింది శ్రావణికి.

శ్రావణి, శరత్‌ల అనురాగాల పంట నక్షత్ర. తమ కళ్ళముందే చిట్టి చిట్టి మాటలు చెపుతూ బాల్కనీ కుండీలో రోజా మొక్క మొగ్గలు తొడిగినట్లు...నేడు నక్షత్ర పరువాల తొలిమెట్టు ఎక్కింది. మొదటి నుంచీ వారిద్దరి అభిప్రాయాలూ ఒక్కటే. ఈ సమాజం మారితేనే ఎన్నో సమస్యలకు పరిష్కారమన్నది వారు నమ్మే సిద్ధాంతం. అందువల్లనే శ్రావణి, శరత్ వేర్వేరు కులాలైనా ఒక్కటయ్యారు. ఆడపిల్లే కావాలని కోరుకోవడం వెనుక ఆంతర్యమూ అదే. వారి కోరిక ఫలించి నక్షత్ర పుట్టింది. నక్షత్రను 'ఆడపిల్ల...ఆడపిల్ల...' అంటూ పిరికిగా పెంచకూడదనుకున్నారు. అట్లాగే అన్ని పనులూ తానేచేసుకునేలా ...ధైర్యంగా

వెళ్ళేలా తయారుచేశారు. అందుకే నేడు నక్షత్ర పెద్దదయినా అందరిలా భయపడలేదు శ్రావణి. ఫంక్షన్ చేయమని శ్రావణి అత్తయ్య, అమ్మ, ఆడపడుచు అడిగారు. శ్రావణి, శరత్ ససేమిరా అనేశారు. ' మా ఇంట్లో ఆడపిల్ల పెద్దదయిందని అందరికీ టముకేయాలా ఏంటి? ఈ రోజుల్లో ఇవన్నీ ఏంటి?' అంటూ శ్రావణి కన్నా ముందే శరత్ గట్టిగా చెప్పాడు. ఇక ఎవరూ నోరెత్తలేదు.

ఈ మధ్య నక్షత్ర ఎదురు చెప్పటం మొదలు పెట్టింది. షాపుకెళ్ళి ఏమైనా తెమ్మన్నా... పైన ఇంటివాళ్ళ దగ్గరకెళ్ళి ఏదైనా అడిగి పట్రమ్మన్నా... వెళ్ళనని మొండికేస్తోంది. దానికన్నా ముందే శారదమ్మ కూడా 'అది వెళ్ళదులే...నే తెస్తా ఏం కావాలి? చెప్పు..' అని అడగటం మొదలుపెట్టింది. మొదట్లో శ్రావణి అంతగా పట్టించుకోలేదు. తర్వాతర్వాత 'దాన్నెళ్ళమంటే నువ్వెళతానంటావేంటి? అదెప్పుడు నేర్చుకుంటుంది...ఇలాంటి చిన్న చిన్న పనులు కూడా చేయకపోతే ఎలా? ఓపిక లేనిదానివి నువ్వు వెళ్లడమేంటి? అది వెళుతుందిలే...' అంటూ నక్షత్రను పిలిచి పక్కసందులో సంతోష్ షాపులో పాలప్యాకెట్ తీసుకురా...పొద్దున్న పాలు రెండోసారి వేడిచేద్దామనుకుంటూనే మర్చిపోయి చచ్చా....'అంటూ డబ్బులిచ్చింది శ్రావణి.

'నేవెళ్లనని ఎన్నిసార్లు చెప్పాలి? భవానీ వాళ్ళ తమ్ముడు కిందేమన్నా కనిపిస్తాడేమో వాడ్ని పిలుస్తా' అంటూ వెళ్ళబోయింది. శ్రావణికి ఎక్కడలేని కోపం ముంచుకొచ్చింది. వెళుతున్నదాని జడలాగివుచ్చుకుని ఒక్కలాగు లాగి ఒక్కటిచ్చుకుంది. 'వయస్సు పెరుగుతున్నా జ్ఞానం ఉండటంలేదు...చెప్పగానే వినటం నేర్చుకో బాగుపడతావ్...'అని కేకలేసింది. శ్రావణి కోపం చూసి శారదమ్మ కూడా ప్రస్తుతానికి మాట్లాడకుండా ఉండటమే మేలనుకొని గొణుక్కుంటూ బాల్కనీలోకి వెళ్ళిపోయింది. నక్షత్ర కళ్లు తుడుచుకుంటూ పౌరుషంగా వెళ్లి, పాల ప్యాకెట్ తెచ్చి విసురుగా స్టౌ గట్టుపై విసిరేసి, మంచంపై బోర్లా పడుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది...

శ్రావణి మాతృ హృదయం తల్లడిల్లిపోయింది. 'తొందరపడ్డానా నేను'అనుకుంటూ దాని పక్కనే పడుకుని మీద చేయివేసి...ఏంమైందిరా?' లాలనగా అడిగింది శ్రావణి. 'నే వెళ్లనంటే ఎందుకమ్మా వెళ్ళు వెళ్ళు అంటావు? ఆ షాపంకుల్ నా బుగ్గలు గిల్లుతాడు. అక్కడకు వచ్చే సాయి అంకుల్ నా భుజం చుట్టూ చెయ్యేసి దగ్గరకు లాక్కుంటాడు. మీరేమో ఆఫీసు నుండి లేటుగా వస్తారు. ఏదో వంకతో పక్కింటి అంకుల్ నన్ను పిలిచి పక్కన కూర్చోబెట్టుకొని వీపంతా నిమురుతాడు. నాచేతిని తన చేతిలోకి తీసుకుని వదలరు. ఏమిటేమిటో అడుగుతూ ఉంటాడు. నేను వస్తుంటే పోతూంటే మగపిల్లలు పిచ్చిపిచ్చిగా మాట్లాడుతు న్నారమ్మా.. నాకివన్నీ నచ్చుడం లేదమ్మా..నన్నెక్కడికీ పంపకమ్మా..నన్ను అర్థం చేసుకోమ్మా...' ఏడుస్తూనే నక్షత్ర చెపుతూ ఉంటే శ్రావణి ఒక్కసారి తన కాళ్లకింది భూమి కుంగి పోయినట్లనిపించింది. సమాజంలో పరిస్థితుల గురించి ఎంతోకొంత అవగాహన ఉండే తను నక్షత్ర విషయంలో ఎందుకని అంచనా తప్పాను? ఏం చేయాలి? బయటికి పంపకుండా ఎంతకాలం? ఇలాంటి ప్రశ్నలన్నీ శ్రావణిని కందిరీగల్లా చుట్టుముట్టేస్తున్నాయి. నక్షత్రను గుండెలకదుముని తనకి తాను 'ధైర్యంగా ఉండాలి' అని మనస్సులోనే అనుకొంటోంది శ్రావణి. శరత్ వచ్చాక అన్ని విషయాలు మాట్లాడింది. అన్ని పనులకూ బయటకు పంపకుండా నక్షత్ర పూర్తి బాధ్యతను శరతే తీసుకున్నాడు. - సశేషం.

## జీవన గమనంలో సహచరి

- దుర్గాప్రసన్న

తానెళ్ళిపోయాక తెలిసింది
నేనొంటరినయ్యానని
జీవితంలో నాలుగు దశాబ్దాలు
సుదీర్ఘకాలమనీ,
తానెళ్ళిన నాలుగు నాళ్ళకే బోధపడింది
తోడుగా ఉండి, తాను నీడలా అనుసరించిందనీ,
నా కనుసన్నలలో మసలుతూనే
నన్నధిగమించిందనీ.....
తానెళ్ళిపోయాక తెలిసింది

నా చిటికెన వేలు పట్టుకుని
నా ఇంట అడుగుపెట్టిన నాటినుండీ
ఆ కళ్ళలో భయం చెదరకుండా
నా పురుషాహంకారం కాపలా ఉంచాను
విశ్రాంతీ, విరామాలు లేకుండా చాకిరీలు
చేయించాను
పుట్టింటి పేరుని కూడా మర్చిపోయి
నాతోపాటు
నా తల్లితండ్రులకూ, తోబుట్టువులకూ
చివరకు నా పిల్లలకూ
అడగకముందే అన్నీ అమర్చేది
ఎన్నెన్నో సపర్యలు చేసేది
యంత్రానైనా సర్వీసింగ్‌కిస్తాం
రీచార్జ్ అంటూ చేయిస్తాం
జీతంరాళ్ళ కోసం పని చేసే నేను కూడా
పదవీ విరమణ అంటూ తీసుకున్నాను
సంతోషాలు సరదాలు వెతుక్కున్నాను
పాపం పిచ్చిమొద్దు!
ఏనాడూ నాతో ఏమీ అనలేదు
ఏమీ అడగనూ లేదు.
నాకా గ్రహింపు కలగలేదు
ఇపుడు-
ముందస్తు సమాచారమివ్వకుండా
శెవంటూ వెళ్లిపోయింది.
నన్ను- ఏ కూర వండాలో అడిగేది చేసేది
ఏ రంగు చీర కట్టుకోవాలోఅడిగేది
అడగకుండా గుమ్మం బయట కాలు
పెట్టడాన్కికూడా సంశయించేది
అసలు ఏం మాట్లాడాలన్నా......నా....
అనుమతి కోసం ఎదురు చూసేది
అలాంటిది ఇపుడు-
నా ఆమోదం కోరలేదు
నా ఆనతి కోసం ఆగనూలేదు
అన్నాళ్ళూ నేను నొచ్చుకుంటానని
నా కనుసన్నల్లో మెలిగింది...కానీ-
తానుగా నిర్ణయాలు తీసుకోలేకకాదు!
నాకన్నా- నిర్దయగా వ్యవహరించలేకా కాదు!!
అని- తానెళ్ళిపోయాక తెలిసింది. ●




**గౌరవనీయులైన ఎడిటర్‌గారికి!**

చైతన్య మానవి అక్టోబరు-డిసెంబరు పత్రికలోని స్త్రీలెపుడు స్నేహ వారధులే కథ నిజ జీవితానికి చాలా దగ్గరగా ఉంది. తానూ ఒకప్పుడు కోడలినే అన్న విషయం ప్రతీ అత్తా గుర్తుంచుకోవాలి. ఆ విషయం మరిచి కోడళ్ళని చిత్రహింసలకు గురిచేస్తున్నారు. వాళ్ళు ఆనందంగా ఉంటే మనం కూడా ఆనందంగా ఉంటాం. సమాజంలో నుంచి అత్తగారుగా పేరు తెచ్చుకోవచ్చు. మనల్ని చూసి ప్రతి అత్తగారు నేర్చుకోవాలి అనే పట్టుదల ఉంటే మనం సమాజాన్ని బాగుచెయ్యవచ్చు. వరకట్నం చావుకేకలు వినిపించవు. డా॥శిలాలోలితగారికి ధన్యవాదాలు. గులాబీదండు నాయకురాలు సంపత్‌పాల్ ధైర్యంతో గూండాలను ఎదిరించి అక్కడ స్త్రీల సమస్యలను పరిష్కరించటం మగవారిని బాదటానికి సైతం వెనుకాడని మహిళగా హర్షనీయం. మదర్ థెరిస్సా లాంటి మహిళ ఎన్నో సేవలు ప్రజలకు అందించారు. ఆమె అందరి హృదయాల్లోనూ జీవించే ఉన్నారు. మంచి విషయాలు తెలియపరిచినందుకు ఎడిటర్‌గారికి ధన్యవాదాలు.

**సిహెచ్. రమ, కూకట్‌పల్లి.**

**ఎడిటర్‌గారికి!**

'మహా మానవతావాది మదర్ థెరిస్సా" గురించి ఎన్నిసార్లు చదివినా తనివితీరదు. అలాంటి మహనీయురాలి గురించి మరల చదివే అవకాశం కల్పించినందుకు కృతజ్ఞతలు. "పెట్టుబడి" కవితలో మానవతా విలువలు చాలా చక్కగా పొందుపరిచారు. డా॥రంగారావుగారి జ్ఞాపకాలులో మోటూరుటాన్యాగారి సేవా దృక్పథం, విశాల హృదయం, నిస్వార్ధం, మంచితనం గురించి చదివి ఆమెకు జోహార్లు అనకుండా ఉండలేకపోయాను. కె.అరుణగారి 'కళపేరిట కరాళ నృత్యం' చాలా కరక్టుగా అనిపించింది. నా మనసులో కూడా స్టేజీషోలు చూస్తున్నపుడు అదే రకమైన ఆలోచన ఉండేది.

విముక్త (ఓల్గా) కథలో ఊర్మిళ వ్యక్తిత్వం ఆదర్శవంతంగా అనిపించింది. "నీమీద అధికారాన్ని నువ్వే తీసుకో. ఇతరులపై అధికారాన్ని వదులుకో అప్పుడు నీకు నువ్వు చెందుతావు, నీకు నువ్వు దక్కుతావు. మనకు మనం మిగలాలి" ఆ ఒక్క సందేశం చాలు మనిషి ప్రశాంతంగా, ఆరోగ్యంగా, ఆనందంగా ఉండటానికి.

రాష్ట్రంలో ఐద్వా ఎన్నో రకాలుగా ప్రభుత్వాన్ని, మీడియాని లిఖితపూర్వకంగా, ఉద్యమాల ద్వారా, సమాజంలో జరిగే అన్యాయాలని తనదైన శైలిలో డిమాండు చేయటం అభినందనీయం.

భావ విప్లవకారుడు గురజాడగారి వర్ధంతి సందర్భంగా ఆయన గురించిన వ్యాసం పుస్తకం వెనుక పేజీలో ప్రచురించి, పత్రికలోని ప్రతి అంశం ఎంతో విలువైనదిగా చేశారు. ఈ పత్రిక మిగిలిన పత్రికలలా ఒకసారి చదివి పడేయకుండా తరచు పాత పత్రికలు తిరగెయ్యాలని పించేలా ఉంది.పత్రిక సంపాదక వర్గం అందరికీ ధన్యవాదాలు.

**కె. జయలక్ష్మి, కూకట్‌పల్లి**

**ఎడిటర్‌గారికి!**

డాక్టర్ రమాదేవిగారు డెంగ్యూ ఫీవర్ వివరాలు వ్రాశారు. వీటి గురించి తెలియని వారికి చాలా ఉపయోగంగా ఉంటుంది. ఇలాగా స్త్రీల సమస్యలు కూడా ప్రతీ సంచికలోనూ వస్తే బాగుంటుంది.

**పి.విజయలక్ష్మి,కూకట్‌పల్లి.**

**ఎడిటర్‌గారికి!**

భారతిగారు వ్రాసిన నువ్వుల్లో నూరు గుణాలు వ్యాసం చాలా బాగుంది. ఇంట్లో వాడే నువ్వులు ఆడవారికి ఎలా ఉపయోగమో రాశారు. ఇలాంటి కాలమ్ తప్పనిసరిగా ఉండాలి. స్త్రీలకు మేలు చేసిన గురజాడ కవితలు తప్పనిసరిగా ఉంటే బాగుంటుంది.

**కె.లక్ష్మితాయారు,హయత్‌నగర్.**

**ఎడిటర్‌గారికి!**

చైతన్యమానవి అక్టోబరు-డిసెంబరు పత్రికలో ప్రచురించిన అన్ని అంశాలు చాలా బాగున్నాయి. ముఖ్యంగా నన్ను బాగా ఆకట్టుకున్నది ఓల్గాగారు "విముక్త".14 సంవత్సరాల అజ్ఞాతవాసాన్ని అనుభవించిన ఊర్మిళ గురించి చాలా బాగా వర్ణించారు. నాకు ఈ విముక్త చదివే వరకు ఊర్మిళ మనోభావాలు తెలియదు. అందరిలాగే తను నిద్రలోనే ఉండిపోయిందనుకున్నాను. ఒక స్త్రీ తాను గురైన మానసిక సంఘర్షణ ప్రతి అక్షరంలోను కనిపించింది. ఏవిధంగా స్పందించాలో అర్థం కాని ఆ పరిస్థితుల్లో తనకు తాను ఆంతర్మధనం చేసుకునే ప్రయత్నంలో తాను తెలుసుకున్న విషయాలు ప్రతిస్త్రీకీ అవసరమే. తనను తాను గెలిచి నిలబడినపుడే ప్రతీదీ ఈ సృష్టిలో అర్థవంతంగా, స్పష్టంగా అవగతమవుతుంది. ఊర్మిళ వంటి స్త్రీకి జోహార్లు.

చైతన్యమానవి చదవటం వలన చాలా విషయాలు తెలుస్తున్నాయి. ఇంతమంచి విషయాలు మాకు అందించే ప్రయత్నం చేస్తున్న ఎడిటర్‌గారికి కృతజ్ఞతలు. అమ్మమ్మ కథ చాలా బాగుంది. వాస్తవంగా జరుగుతున్న పరిస్థితులకుఅద్దం పట్టేలా ఉంది. టాన్యతో ఆత్మీయానుబంధం' అనే వ్యాసం కూడా చాలా బాగుంది. 'కళపేరిట కరాళ నృత్యం' అనే పేరుతో ప్రచురితమయిన నిజంగానే కళలు ఇంతగా దిగజారిపోయినాయా అనిపించింది. ఇందులో రెండు మూడు సూక్తులను అదనంగా చేర్చితే మరింత బాగుంటుందనిపించింది.

**-పి.సుమలత,కూకట్‌పల్లి.**

# వీర గున్నమ్మ

-డాక్టర్ వకుళాభరణం లలిత

చారిత్రాత్మకమైన మందస సంస్థానంలో జరిగిన రైతాంగ పోరాట కాల్పుల చరిత్ర, ఆ పోరాటంలో పాల్గొన్న వీర గున్నమ్మ త్యాగనిరతి, ప్రదర్శించిన వీరత్వం అద్వితీయమైనది.

సామాన్య రైతు కుటుంబంలో జన్మించిన కళింగబిడ్డ గున్నమ్మ. కన్నవారు దుంపలవారు. అత్తగారు సానుమాను వారు. భర్త మాధవయ్య కాలంచేశాడు. కన్నీటి ధారలతో కలబోసుకుంటూ జీవితం గడిపింది. చిన్నతనంలోనే తల్లి మరణిస్తే, తండ్రి పెంపకంలో పెరిగింది. నలభై సంవత్సరాల వయస్సు, నల్లని కండ పుష్టి గల శరీరం, నిమ్మకాయలంతేసి కనుగుడ్లు ఆజానుబాహువు.

ఆ గడ్డపై పుట్టిన పోరాటయోధుడు చక్రపాణి వీర గున్నమ్మ ఆదేశాలను తూ.చ తప్పకుండా పాటించేవాడు.

అవి 1942 క్విట్ ఇండియా ఉద్యమం జరుగుతున్న రోజులు. ఆ సంవత్సరం అఖిల భారత 5వ కిసాన్ సభ జరిగింది. జమిందారీ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా మందస గడ్డపై జామీన్ రైతుల తిరుగుబాటును లేవదీసింది వీర గున్నమ్మ. మందస సంస్థానం ఒక అగ్నిగోళమైంది. కిసాన్ సభ జరిగిన మరుసటి రోజే మందస జమీందారీ రిజర్వ్ ఫారెస్టులో రైతులు ప్రవేశించి చెట్లను కొట్టి బండ్లపై ఎక్కించుకుని...

"ఎవడబ్బగారి సొమ్మో-ఈ భూమి. ఎవడమ్మగారి సొత్తో" "మమ్మెవరాపగలరు?-ఈ భూమి మమ్మెవ్వరడ్డగలరు?" పాడుతూ వెళుతుండగా,

జమిందారు ఉన్నతాధికారులను, తాబేదార్లను వినియోగించి బండ్లను అటకాయించాడు. రైతులకు, జమిందార్లకు మధ్య ఘర్షణ ప్రారంభమైంది. మార్పు పద్మనాభం అనే రైతు నాయకుని నాయకత్వంలో రైతాంగం రాజాపురం దగ్గర చేరుకున్నారు. రాజాపురం గ్రామానికి చెందిన సానుమాను గున్నమ్మ తన ఒడి నిండా కారంపొడి వేసుకుని వచ్చి శతృమూకల కళ్లలో కొట్టింది.

భూమికోసం, భుక్తి కోసం, మూరెడు గుడ్డ కోసం ఉద్యమం చేశారు.

తెల్లారేసరికల్లా రుషిగురి అడవికి వెళ్లాలని, వీర గున్నమ్మ వీరావేశంతో

"మాకొద్దూ ఈ జమిందార్ల పాలన, మా ప్రాణాలపై పొంచి, మానాలు హరించే"

**"కత్తులు దూసుకపోయిన**
**నెత్తురు టేరులు పారిన**
**ఎత్తిన జెండా దించకోయ్**
**వెనుక చూపు చూడకోయ్"**

అంటూ మందస సంస్థానం జమిందారు పై దాడి చేశారు.

రాత్రనకా, పగలనకా అష్టకష్టాలు పడి పండించిన పంటను అనుభవించడానికి హక్కు లేదంటే అది ఎంత కడుపు మంట తెస్తుందో. మనకు పంట దక్కకుండా చేస్తున్న ఆ 'జమిందారు కుత్తుకనైనా తరగనీయ్' గున్నమ్మ గుండెల్లో ఊపిరున్నంతవరకూ మందాసా రైతాంగం బతికున్నంత వరకు, మా రైతులకు బేడీలు వేయడానికి మీకెన్ని గుండెలు'' అంటూ ఉగ్రమూర్తిలా ముందుకురికింది గున్నమ్మ. ''పక్కకు తప్పుకో, ఆడదానివి నీతో పోరు ధర్మ విరుద్ధం" అన్నాడు పోలీసు సూపరిండెంటు. ఆ మాటలకు "మా ఆడంగుల్ని వివస్త్రలను చేసి మానభంగాలు జరిపి, నిండు చూలాండ్ర గర్భాల్లో చురకత్తులు దూర్చి ,ఎదురుపడ్డ ఇల్లాండ్ర శీలాలను అపహరించి, చెట్టుకు కట్టి తుపాకులతో కాల్చి, స్త్రీల రొమ్ములకి తేళ్లను కరిపించి, మగువల మాంగల్యాలను తెంచి, ఉరికంబాలెక్కించటం, ఊచకోతలు కోయటం ధర్మామా?" అని బెబ్బులిలా గర్జించింది గున్నమ్మ.

"ఈ తిరుగుబాటు పీడిత రైతాంగ విముక్తి కోసమని, ప్రభుత్వానికి ఉన్నది పశుబలం అయితే, తమకున్నది ఆత్మబలమని, చిట్లిపోయిన జీవితాలతో, చితికిపోయిన సంసారాలతో కుంగి, కృశించి, నశించిపోతున్న రైతాంగంకోసం తాను దేనికైనా సిద్ధం" అంటూ కలెక్టరుతో గట్టిగా వాదించింది గున్నమ్మ.

పోరాటంలో చక్రపాణి నేలకొరగటంతో తోకతొక్కిన కోడెత్రాచులా కదం తొక్కి కలెక్టరు మీదికి గొడ్డలి విసిరింది. కలెక్టరు పడిపోయాడు. "వీర గున్నమ్మ జిందాబాద్'' అంటూ మార్మోగింది రణభూమి. రైతాంగ వీరులంతా గున్నమ్మ చుట్టూ చేరి ఆనందంతో నృత్యం చేశారు.

తూటాలు దూసుకుపోయిన ఆమె శరీరం జల్లెడకళ్ళులా కన్పించింది. చెదిరిన ప్రాణాలు కూడదీసుకుని గావుకేక పెట్టింది గున్నమ్మ. గున్నమ్మతో పాటు ఆరుగురు రైతు సోదరులు మరణించారు.

మందస ఉన్నంత వరకూ చిరస్థాయిగా ఉండటమే కాదు, స్త్రీగా వీరత్వంతో పోరాటం సల్పిన వీరగున్నమ్మ ఎందరెందరికో మార్గదర్శకురాలు. అప్పటి నుంచీ మందస గడ్డపై ఎక్కడ తిరుగుబాట్లు, పోరాటాలు జరిగిన గున్నమ్మ విప్లవ ప్రభోదాలు స్ఫూర్తినిస్తూనే ఉంటాయి. సాయుధ సమరంలో రుధిర తర్పణం చేసిన గున్నమ్మ వీర యోధుల వీర గున్నమ్మగా చరిత్రలో శాశ్వతంగా నిల్చిపోయింది.

★

# అత్యాచారాలకు ఆడవాళ్ళే కారణమా?

- స్ఫూర్తి

**సమస్యల మూలం వదిలి ఆకుని పట్టుకుంటే ఏం లాభం? అత్యాచారానికి గురవుతున్న వారిలో అత్యధికులు ఆర్థికంగా వనరులపరంగా వెనుకబడిన హరిజనులు, గిరిజనులు కావటం ఆశ్చర్యం కాదు. ఇంటిపనివారలుగా ఉంటున్న 91 శాతం మంది బాలికలపై లైంగిక హింస జరగటం ఏ దుస్తులవలన?**

**"ఆడవాళ్ళు ఆధునిక దుస్తులు ధరించడం కూడా అత్యాచారాలు పెరగడానికి ఒక కారణం"**

ఈ మాటలన్నది ఎవరో జ్ఞానం లేని గన్నయ్యకాదు. మత ఛాందసవాది అంతకన్నాకాదు. సాక్షాత్తు డిజిపి దొరవారు. పోలీసులతో తరచుగా వ్యవహరించే అవకాశం లేనివారు నివ్వెరపోవవచ్చుగాని నిరంతరం స్త్రీల సమస్యలు పట్టుకుని వారిచుట్టూ తిరిగే మహిళా కార్యకర్తలెవరూ బహుశా అంత ఆశ్చర్యపోలేదు. పోలీసువాళ్ళెంత అశాస్త్రీయంగా, మోటుగా ఉండగలరో వారికి బాగా తెలుసు. అయితే దాన్ని అత్యున్నత పదవిలోకి వచ్చినా దాచుకోలేదెందుకా అనేది కాస్త విచిత్రం.

ఏది ఏమయినా పోలీసుల ప్రవర్తన పనితీరుల్లో మార్పు తేవడానికి వ్యవస్థలో సంస్కరణలు, శిక్షణలో మార్పు తేవడం ఎంత అవసరమో మరోసారి అర్థం అయ్యింది. స్త్రీల పట్ల పోలీసులకుండే అభిప్రాయాలు లోకానికి చాటి చెప్పినందుకు వారికి ధన్యవాదాలు. "భర్త హింసిస్తున్నాడు" అనగానే "నీవేం చేశావు?" అని అడిగేయటం, "మగపిల్లలు వెంట పడుతున్నారు, వేధిస్తున్నారు" అనగానే "నీవు సైగలు చేసుంటావు ఊరికే నీవెంట ఎందుకు పడతారు" అనడం, "లైంగికంగా బలాత్కారం జరిగింది" అని కేసు రాగానే "ఆమె శీలం మంచిది కాదు" అని నిర్ధారణకు రావడం పోలీసుల సున్నిత అవగాహనలో భాగం. పధ్నాలుగేళ్ళ పిల్ల తననెవరో రేప్ చేశాడని ఏడిస్తే, ఒకడిని కాపలా ఉంచి తానూ అదే చేయటం, కట్నం కేసుల్లో లంచాలు తిని మరణ వాంగ్మూలాలు రాయటం, నేరస్తులతో చేతులు కలపడం, ఫిర్యాదు చేయడానికి వస్తే రేప్ చేయటం, కుల, మత, రాజకీయ ప్రభావాల్లో భాగంగా పనిచేయటం, చట్టం రాజ్యాంగం గురించి పెద్దగా పట్టించుకోకపోవటం ఇట్లా రాసుకుంటూ పోతే వారి లీలలు అంతం



కానివి. ఇవన్నీ వారి డ్యూటీలో అంతర్భాగంగా మారిపోయి ఒకరిద్దరు మంచివారుంటే వెలిగా మిగిలిపోవటం ఇదీ నేటి స్థితి.

ఆడవాళ్ళ ఆధునిక దుస్తులు-అంటే ఏవి ప్యాంటు, షర్టా? పంజాబీ డ్రస్సా? లంగాలు, గాగ్రాలా? లేదా చీరా, జాకెట్టా (జాకెట్టు మనకొచ్చి కూడా వందేళ్ళగా అయ్యింది) ఇవన్నీ మగవాళ్ళని రేప్ చేయమనేంత రెచ్చగొడతాయా? ఎటువంటి డ్రస్సు రెచ్చగొడుతుంది? ఏ మేరకు శరీరం కనబడితే రెచ్చగొట్టినట్టు? శరీరంపై అక్కడక్కడా గుడ్డపీలికలు తగిలించుకుని కన్పించే తారలపై అత్యాచారాలు జరిగాయా? తాళ్ళతో జాకెట్టు, టీషర్టులు షార్టులు టాటులు వేసుకుని పబ్బులకు తిరిగే విలాసవతులపై అత్యాచారాలు ఎందుకు జరగవు? ఎందుకంటే వారు అందుబాటులో ఒంటరిగా దొరకరు కాబట్టి. ఒకవేళ జరిగితే వారికున్న డబ్బు హోదా వీటినుండి వచ్చే అధికారం చేసిన వాడికి ఉరేస్తాయి కాబట్టి. ఒకవేళ వాడూ సమాన స్థాయివాడయితే రాజీ పడతారు కామోసు... ఇదంతా పెద్దల గోల...

అత్యాచారాలు పెరుగుతున్నది బాలబాలికల పైననే. 53 శాతం బాలబాలికలు అత్యాచారాలకు గురవుతున్నారని ప్రభుత్వ సర్వే. మరి మగపిల్లలు కూడా రెచ్చగొడుతున్నారా? ప్రపంచీకరణలో భారతదేశం సెక్స్ టూరిజానికి అడ్డాగా మారింది. కాబట్టి అక్రమ రవాణా పెరిగింది. వ్యభిచార కూపాల్లో మగ్గుతున్న వారిలో 25 శాతం మంది 15 ఏళ్ళ లోపు బాలికలే. అంతర్జాతీయ విటుల" ప్రత్యేక అవసరాలు" బాల బాలికలపై లైంగిక అత్యాచారాలే...

నీలి చిత్రాలు, నీలి సాహిత్యం, హింసాత్మక సినిమాలు, ఛానల్సు ఇవన్నీ వికృత లైంగిక కోర్కెలకు హింసాత్మక రూపం ఇస్తున్నాయి. పెరుగుతున్న ఆర్థిక తారతమ్యాలు, వలసలు, తాగుడు, విశృంఖలత్వం అన్నీ కలిసి నేరాలు ప్రత్యేకించి లైంగిక నేరాలు పెరగడానికి కారణం అవుతున్నాయి. ఆర్థిక నేరాలు భారీ ఎత్తున పెరగటమే డబ్బుతో నడిచే మార్కెట్

సమాజం ఏర్పడి స్త్రీల స్థానం దిగజారిందని చెప్పడానికి ఓ ప్రత్యక్ష నిదర్శనం. ద్రవ్య చలామణి పెరిగిన మేరకు స్త్రీల స్థితి దిగజారుతుంది. దాని ఫలితమే అత్యాచారాలు పెచ్చరిల్లిపోవడం.

సమస్యల మూలం వదిలి ఆకుని పట్టుకుంటే ఏం లాభం? అత్యాచారానికి గురవుతున్న వారిలో అత్యధికులు ఆర్థికంగా వనరులపరంగా వెనుకబడిన హరిజనులు, గిరిజనులు కావటం ఆశ్చర్యం కాదు. ఇంటిపనివారలుగా ఉంటున్న 91 శాతం మంది బాలికలపై లైంగిక హింస జరగటం ఏ దుస్తులవలన?

యువతరాన్ని రెచ్చగొట్టే అశ్లీల పోస్టర్లు, సినిమాలు, నృత్యాలపై ఘనత వహించిన పోలీసువారు ఏ చర్యలు తీసుకున్నారో చెప్పగలరా? ఏదో ఒక యూనిఫాంలో నిండుగా ఉండే మహిళా పోలీసులపై పని ప్రదేశాల్లో లైంగిక వేధింపులు అన్ని శాఖల్లో కంటే ఎక్కువ ఎందుకు జరుగుతున్నాయో వివరించగలరా?

పోనీ బురఖాలు, కవచ కుండలాలు, వళ్ళంతా తొడుగులు వంటివి వేసుకుంటే అత్యాచారాలు జరగవని హామీ ఇవ్వగలరా? నగ్నంగా కూడా ఉండే అవకాశం గల బీచ్‌లు గల స్వీడన్‌లో అత్యాచారాలు ఒక శాతం కూడా లేవు. వేళ్ళు కనపడినా నరికేసే ఆఫ్ఘనిస్థాన్ తాలిబన్ మత రాజ్యంలో 9 శాతం మంది అత్యాచారాలు, వేధింపులకు గురవుతున్నారు. దీన్ని ఎలా విశ్లేషించాలి.

దుస్తులు ధరించే తీరు ఆయా దేశాల సంస్కృతిని బట్టి ఉంటుంది. ఏ దుస్తులు శృంగారపరంగా ఉంటాయంటే మల్లెపూలు తెల్లచీర జాకెట్టని టకీమని చెబుతారు. కాని తెల్ల దుస్తులు అనేక దేశాల్లో పవిత్రం. ఎర్ర దుస్తులు శృంగారం.

ఈనాటి ప్రపంచంలో ఏ దేశంలోనైనా ఏవో వేడుకలు పండుగ పబ్బాల్లో తప్ప వారి సాంప్రదాయ వస్త్రధారణ చేయటంలేదు. వేగం పెరిగిన జీవితంలో పరుగులు తీయడానికి సౌకర్యంగా ఉండే దుస్తులను ఎంచుకుంటున్నారు. ఇపుడు మన రాష్ట్రంలో పంజాబీ డ్రస్సు లేదా ప్యాంటు టాప్ కాకుండా రోజువారీ లంగా వోణీలతో అమ్మాయిలు కాలేజీకెళితే వారిని చిత్రంగా చూసి 'పాత' అని హేళన చేసే కాలం వచ్చింది. మరి అమ్మాయిలు ఈ ఆధునిక దుస్తులు ధరించకుండా ఆపడం ఎవరి వల్లవుతుంది? అసలు అట్లా ఆపడం నబబా? ఆడపిల్లయిన పాపానికి అసౌకర్యంతోనే బతకాలా? మగ మహారాజులు ప్యాంట్లు కోట్లతో సంస్కృతిని నిలబెడతారా? లేదంటే వాళ్ళేం వేసుకున్నా, వేసుకోకున్నా చెల్లిపోతుందా?

"స్త్రీని ఒక అనుభవించే వస్తువుగా" మగవారి బుర్రలో నాటడమే ఈ వేధింపులకు మూలం. అనుభవించే ఆధిపత్యం మగవాడికి ఉందనే భావజాలం స్త్రీలపై లైంగిక అత్యాచారాల అణచివేతకు కారణం.

"దున్నపోతు ఈనిందంటే దూడను కట్టేయమన్నట్లు" డిఐజి వాఖ్యలతో మత ఛాందసులు వారి వాదనలకు బలం చేకూరినట్టు సంబర పడుతున్నారు. డ్రస్సులపైనా, ప్రేమలపైనా, కళలపైనా సాంస్కృతిక పోలీసుతనం చేయవచ్చని కలలుకంటున్నారు.

దుస్తులలో, జీవన విధానంలో ప్రవర్తనల్లో...మార్పులు ఆర్థిక మార్పుల నుండే వస్తాయనడానికి ప్రత్యక్ష నిదర్శనం ఐ.టి. సెక్టారు. సరళీకృత ఆర్థిక విధానాలు ఆహ్వానించిన మతోన్మాద రాజకీయ పార్టీలు వాటితోపాటు వచ్చే విశృంఖల వికృత హింసా ధోరణులు మాత్రం మతంతో కులంతో కట్టుబాట్లు పెట్టి వెయ్యి సంవత్సరాలు వెనక్కి నడిచి నివారిస్తాం అంటున్నారు. ఆహా... ఎయిడ్స్‌కి ఆకుపసరు రాసినట్టే.

కాబట్టి పనికిమాలిన వంకలు మానేసి బలమయిన చట్టాలు చేయడానికి రాజకీయ పార్టీలు, ఆ చట్టాలు అమలు చేసి స్త్రీలకు ,బలహీనులకు రక్షణ కల్పించడానికి పోలీసు యంత్రాంగం పూనుకోవటం అవసరం. జరుగుతున్న నేరాల తీరుతెన్నులు విశ్లేషించి విచారణ సమగ్రంగా జరిపి, నివారణ అవకాశాలు పరిశీలించడం అవసరం. ఎవరెటువంటి దుస్తులు ఎంత శాతం ఒళ్ళు కనబడేలా వేసుకోవాలో ఊసుపోని ఉపన్యాసాలు చెప్పకుండా పనిచేస్తే ఉపయోగం. దుస్తులు నిర్ణయించుకోవటం పూర్తిగా వ్యక్తిగతం. అది వారి ప్రాథమిక హక్కు. ●




**ఎడిటర్‌గారికి!**

ఉద్యమ వార్తలు చాలా మంచి కాలమ్. ఇంటినుండి బయటకు వెళ్ళలేని స్త్రీలకు ఆ వార్తలు చదివినపుడు అన్ని జిల్లాల విషయాలు తెలుసుకుంటారు. అంజన రాసిన 'గులాబిదండు కదిలింది' చదివితే మన పాలకులకు అధికారం అండతో కోట్లు సంపాదనేకాని నలుగురి మంచి పట్టదని, కేవలం ఒక స్త్రీ చేయలేనిది చేయడం గమనిస్తే సంపత్‌పాల్ దేవికున్న మనోధైర్యం,కార్యదక్షత అర్ధమవుతుంది. పరిమళగారి "ఈ పాపం పాలకులదే'లో భార్యల్ని అమ్ముతున్న భర్తలు అని ఆవేదన కనబరిచారు. భారతంలో ధర్మానికి ప్రతినిధిగా చెప్పబడే ధర్మరాజు భార్యని జూదంలో ఓడినట్లు కథలు విన్నాం. వాళ్ళ వారసులుగా వీళ్ళు ఆచరణ చేస్తున్నారు. ఆ గ్రామంలోని 200 మంది వితంతువులను కాపాడటానికి మరో వీరేశలింగం కావాలి. కమ్మలమ్మగారి 'ఆకాంక్ష'లో టాన్యాగారి గురించి రాసిన తీరు టాన్యాగారిని చూసినట్లు అనిపిస్తుంది. అలాంటి డాక్టర్లు కొంతమంది అయినా ఉండబట్టే పేదవాళ్ళకి అండ.

చైతన్య మానవి పై మీ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు తెలియచేయాల్సిందిగా కోరుతున్నాము.

**మా చిరునామా**

బ్లాక్ నెం. 24, హెచ్‌ఐజి, ఫేజ్2,
1-8-1,బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్-44
ఫోన్: 27605845

కుతుబ్‌షాహీ వంశీయులు పరమత సహిష్ణులుగా పేరుగాంచారు. వారిలో ఇబ్రహీం ఖులీకుతుబ్‌షా సాహిత్య ప్రియుడు. సాహిత్య ప్రియుడే కాకుండా మూడు భాషల్లో పార్శీ, ఉర్దూ, తెలుగు భాషల్లో కవిత్వం రాసి అనర్గళంగా చదివేవాడు.

- వేములపల్లి సత్యవతి

# ఒకరు నాట్యమయూరి-మరొకరు సంగీత సామ్రాజ్ఞి

తెలుగు నేలంతా ఏకఛత్రం క్రింద పరిపాలించిన ఘనత శాతవాహన వంశీయులది. శాతవాహనులు తెలుగువారు. ఈ మధ్య కరీంనగర్ జిల్లాలో జరిగిన త్రవ్వకాలలో బయటపడిన కోటిలింగాలను శాతవాహనులు రాజధానిగా పరిపాలించారని పురావస్తుశాఖవారి అభిప్రాయం. శాతవాహనులు అమరావతిని, ధరణికోటను కూడా రాజధానిగా చేసుకొని పాలించారు. వారి తర్వాత కాకతీయ వంశరాజులు ఓరుగల్లును (నేటి వరంగల్) రాజధానిగా చేసుకొని పాలించారు. ఓరుగల్లుకు ఏకశిలానగరమని కూడా పేరుంది. (ఓరు= ఒక, ఒంటి, గ(క)ల్లురాయి. ఉప్పుగల్లు= ఉప్పుకాయ) వారి కాలంలోనే వరంగల్‌లోని వేయిస్తంభాల గుడి, ప్రసిద్ధి చెందిన రామప్ప దేవాలయం కట్టించబడినవి. తర్వాత విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన రాజులలో ఆంధ్రభోజునిగా పేరుగాంచిన శ్రీకృష్ణదేవరాయలు తెలుగునేలను పాలించిన వారిలో ప్రముఖుడుగా చరిత్రలో పేరుగాంచాడు. ఆయన పాలనలో ఒక పౌరుడు 'కొండవీడు మనదేరా, కొండపల్లి మనదేరా! కాదని వాదుకువస్తే కటకం దాకా మనదేరా అని పాట పాడాడట. కటకం దాకా మనదేరా అన్నమాటకు ఒడిసా ప్రభుత్వం అభ్యంతరం తెలిపిందన్న వార్త చాలాకాలం క్రితం పత్రికలో చదివాను.


తారామతి బారాదరి

బ్రిటిష్‌వారు రాకపూర్వం విశాలమైన తెలుగునేలను పరిపాలించిన వారు కుతబ్‌షాహి, నిజాంషాహీ వంశీయులైన నవాబులు. వీరు గోలకొండను రాజధానిగా చేసుకొని పాలించారు. మొదట గోలకొండ సామ్రాజ్యం ఉత్తరాన నర్మదా

మూసీనదికి అవతలవైపు ఉన్న గ్రామంలో సుల్తాన్ ప్రేయసి నివసిస్తుండేది. తారామతి, ప్రేమావతి కవలపిల్లలు. కళావంతుల కుటుంబంలో జన్మించారు. ఒకరు నృత్యంలోను, మరొకరు సంగీతంలోను అసమాన ప్రతిభావంతులుగా ప్రసిద్ధికెక్కారు.

నది నుండి దక్షిణాన రామేశ్వరం వరకూ, పడమర నాసిక్ నుండి తూర్పున బంగాళాఖాతం వరకూ విస్తరించి ఉండేది. గోలకొండ రాజ్యాన్ని రెండు వంశాలకు చెందిన నవాబులే పరిపాలించారు. హిందూరాజులెవరూ పాలించలేదు. చరిత్రలో కూడా ఔరంగజేబు(ఢిల్లీ చక్రవర్తి) గోలకొండ మీద దండెత్తాడనే చదువుకున్నాం.

కుతుబ్‌షాహీ వంశీయులు పరమత సహిష్ణులుగా పేరుగాంచారు. వారిలో ఇబ్రహీం ఖులీకుతుబ్‌షా సాహిత్య ప్రియుడు. సాహిత్య ప్రియుడే కాకుండా మూడు భాషల్లో పార్శీ, ఉర్దూ, తెలుగు భాషల్లో కవిత్వం రాసి అనర్గళంగా చదివేవాడు. మల్కిభరాముడు, ఇభరాముడని తెలుగు కవులు అతనిని కీర్తించారు. ఇబ్రహీం నవాబు హిందువులపైనున్న జిజియా పన్నును రద్దు చేశాడు. దేవాలయాలపై,

పుణ్యక్షేత్రాలపై పన్నును తొలగింపజేశాడు. భాగీరథి అన్న హిందూ యువతిని పెళ్ళి చేసుకున్నాడు. ఇబ్రహీం కులీ తర్వాత అతని కుమారుడు సుల్తాన్ మహ్మద్ ఖులీకుతుబ్‌షా 1580లో గోలకొండ సింహాసనాన్ని అధీష్ఠించాడు. ఇతడే హైదరాబాద్ నగర నిర్మాత. పెరుగుతున్న జనాభాను దృష్టిలో పెట్టుకుని ప్రజలకు స్వచ్ఛమైన గాలి, నీరు అందించటానికి ఒక కొత్త నగరాన్ని నిర్మింపదలచాడు. గోలకొండ కోటకు అయిదారు కిలోమీటర్ల దూరంలో హైదరాబాద్ నగరాన్ని నిర్మింపచేశాడు. దానికి తన ప్రేయసి పేరున భాగ్యనగరమని నామకరణం చేశాడు.

మూసీనదికి అవతలవైపు ఉన్న గ్రామంలో సుల్తాన్ ప్రేయసి నివసిస్తుండేది. తారామతి, ప్రేమావతి కవలపిల్లలు. కళావంతుల కుటుంబంలో జన్మించారు. ఒకరు నృత్యంలోను, మరొకరు సంగీతంలోను అసమాన ప్రతిభావంతులుగా ప్రసిద్ధికెక్కారు. వారి కీర్తి చంద్రికలు సుల్తాన్ చెవులకు చేరాయి. ఆ కళలను చెవులారా విని, కనులారా గాంచి తన్మయం చెందటానికి రోజూ గుర్రం మీద మూసీనదిని దాటి వారి యింటికి వచ్చేవాడు. ఒకసారి మూసీ నదికి ఉధృతమైన వరదలొచ్చి నవాబుకు దాటి వెళ్ళశక్యంకాలేదు. అందుకే దీనిమీద వంతెన కట్టించాడని అంటారు. అదే నేడు హైకోర్టు దగ్గర వున్న పురానాపూల్ (పాతవంతెన). తారామతికి ఒక పేరు భాగమతి అయివుండవచ్చు. ఆమెను వివాహమాడి ఆమె పేరుమీద తాను నిర్మింప చేసిన కొత్త నగరానికి భాగ్యనగరమని నామకరణం చేశాడని అంటారు. భాగమతి తన ప్రియుని కోసం మతం మార్చుకొని హైదరబానో అని పేరు కూడా మార్చుకుంది. హైదరబానో పేరే రాగారాగా హైదరాబాద్‌గా మారివుండవచ్చని అంటారు. ఏది ఏమైనా సుల్తాన్ ఆ యిరువురు సోదరీమణులను తన ఆస్థాన నర్తకీమణులుగా నియమించాడు. సుల్తాన్ మహ్మద్ వారిరువురకు ఎక్కడాలేని, ఎవరూ పొందని ఎనలేని గౌవరమర్యాదలనొసగి గౌరవించాడు.

పూర్వకాలంలో రాజులు తాము జీవించివుండగానే తమ కొరకు సమాధులను ఏర్పాటు చేసుకునేవారు. రాజవంశీయుల సమాధులు తప్ప వేరేవారి సమాధులు వారి సమాధుల ప్రక్క నిర్మించకూడదు. అలాంటిది సుల్తాన్ మహ్మద్ తన సమాధి ప్రక్కనే కళావంతులైన ఆ అక్కచెల్లెండ్ర సమాధులను కట్టించాడు. అలాంటి పని అప్పటివరకు చరిత్రలో రాజవంశీయులలో ఎక్కడా జరగని ఒక అద్భుతమని చెప్పవచ్చు. ప్రేమావతి సమాధిపై **"స్వర్గధామంలో స్వర్ణ కమలాలు"** అన్న మాటలను పార్శీభాషలో చెక్కించాడు. హైదరాబాద్ నగర పొలిమేరలలో వున్న రెండు గ్రామాలు వారికిచ్చి ఆ గ్రామాలకు వారి పేర్లే పెట్టించారు. హయత్‌నగర్ వద్ద ఉన్న తారామతిపేట, శివరాంపల్లివద్ద ప్రేమావతిపేట నేటికీ వున్నాయి. అయితే అవి వాటి పూర్వ వైభవాన్ని కోల్పోయి శిధిలావస్థలో వున్నాయి. వాటిలో తారామతి బారాదరీని నటరాజ రామకృష్ణ పూనుకొని అన్ని హంగులతో కళా కేంద్రంగా తీర్చిదిద్దారు. ప్రేమావతి సమాధిని కూడా పునరుద్ధరించాలని ఆయన తలచారు. దురదృష్టవశాత్తు ఆ సంకల్పం నెరవేరకముందే నటరాజ రామకృష్ణ ఈ లోకాన్ని వదలి వెళ్లారు. నేటి కళాకారులు పూనుకొని ఆ పని పూర్తి చేస్తే ఆ కళాతపస్వి నటరాజ స్వప్నం నెరవేరినట్లే. ఆ బాధ్యత ఇప్పటి కళాకారులపై ఉంది. తానీషా-భక్త రామదాసు కథ తెలియని తెలుగువాడుండడు. తానీషా కూడా కుతుబ్‌షాహీ వంశానికి చెందినవాడే.

తర్వాత నిజాం షాహీ వంశీయులు ఏడుగురు నవాబులు పరిపాలించారు. బ్రిటిష్‌వారు మన దేశంలోనికి అడుగిడేనాటికి దక్షిణ భారతంలో కర్నాటక నవాబుల, గోలకొండ నవాబుల, మరాఠీ పీష్వాల మధ్య తరచుగా యుద్ధాలు జరుగుతుండేవి. పిట్టపోరు, పిట్టపోరు పిల్లి తీర్చిన చందాన వీరి మధ్య జరిగే యుద్ధాలలో బ్రిటిష్‌వారు (ఆంగ్లేయ కంపెనీ) ఒక్కొక్కసారి ఒక్కొక్కరి పక్షాన నిలబడి వారిని తమ అధీనంలోకి తెచ్చుకున్నారు. కర్నాటకను పరిపాలిస్తున్న టిప్పు సుల్తాన్ బ్రిటిష్‌వారినెదిరించి పోరాడినపుడు అప్పటి నిజాం నవాబు బ్రిటిష్ వారి కొమ్ముకాశాడు. పీష్వాలు దాడి చేసినపుడు తనకు సాయపడేందుకు రాయలసీమ అయిదు జిల్లాలను గోల్కొండ పాలకులు బ్రిటిష్‌వారికి ధారాదత్తం చేశారు. అందుకే దత్త మండలాలన్న పేరు వచ్చింది. తర్వాతకోస్తా జిల్లాలను ఫ్రెంచివారికి అమ్మివేశాడు. ఫ్రెంచి వారికి బ్రిటిష్‌వారికి జరిగిన యుద్ధంలో ఫ్రెంచివారి నుంచి కోస్తా జిల్లాలన్నీ బ్రిటిష్ వారి అధీనమయినవి. అంతవరకు ఒకటిగా ఉన్న తెలుగునేల రెండు ముక్కలయింది. ఒక్క ముక్క బ్రిటిష్ వారి కిందకు పోగా మిగిలిన ముక్కను నిజాంషాహీ నవాబులు పాలించారు. ఆనాడే తెలుగునేల రెండు ముక్కలై 1956లో మరల ఒక్కటిగా ఏర్పడింది. మరి యిప్పుడు రెండు నుంచి నాల్గు, అయిదు ముక్కలు కావాలన్న ఉద్యమాలు మొదలయినాయి. చరిత్ర గతిలో ఏమి జరగనుందో వేచి చూడవలసిందే.



# గొలుసు

-కె. అంజన



పల్లవి బస్సు కోసం ఎదురుచూస్తోంది. తను ఎక్కవలసిన బస్సు మినహా అన్నీ వచ్చి వెళ్తున్నాయి. విసుగొచ్చేసింది. ఎంతసేపని అలా నిలబడడం. కాళ్ళు పీక్కుపోతుంటేను. 'ఆటోలో వెళ్దామా' అంటే పర్సు పర్మిట్ చేయదు. 'పోనీ...నడిచి వెళ్దామా' అంటే ఇల్లు దగ్గర కాదు. చచ్చినట్టు బస్సులోనే వెళ్లాలి. నిన్నటి సంఘటన తర్వాత బస్టాప్‌లో నిలబడాలంటేనే భయంగా ఉందామెకు. విసుగ్గా వాచీ వైపు చూసుకుంటోంది.

ఈలోగా ఓ బైకు వేగంగా వచ్చి సరిగ్గా పల్లవి ఎదురుగా ఆగింది.

తల పైకెత్తి చూసేలోపే...విసురుగా ఏదో వచ్చి తగిలినట్లనిపించింది. చూస్తే.....గొలుసు. తనదే. నిన్న పోగొట్టుకున్న గొలుసు. అది ఇప్పుడు తనమీద ఎలా పడిందోనని తల పైకెత్తి చూసింది ఆశ్చర్యంగా....

బైకు మీద ఇద్దరు యువకులు. తలకు హెల్మెట్లతో ఉన్నారు. ఒకడు బైకు పక్కకు తిప్పుతుండగా మరొకడు....పల్లవి చెంప ఛెళ్ళుమనిపించాడు..తేరుకునేలోపే... గిల్టు నగలు పెట్టుకుని ఊపుకుంటూ వచ్చేస్తారు రోడ్డుమీదికి.. అదేదో గోల్డు చైననుకుని పెట్రోలు వేస్టు చేసుకుని మాలాంటివాళ్లు వెంటపడటం... కష్టపడి లాక్కుపోవటం... అమ్మబోతే అక్కడ సేఠు మమ్మల్ని వెర్రి వెంగళప్పల్ని చూసినట్టు చూడటం అవసరమా....ఈసారి రోల్డుగోల్డు చైను వేసుకుని రోడ్డుమీద కొస్తే ఊరుకునేదిలేదు....పోనీయ్‌రా....' అనేసి వెళ్లిపోయారు.

జరిగిన హఠాత్ పరిణామానికి పల్లవే కాదు. పక్కన నిలబడినవారు కూడా చిత్తరువులై పోయారు. ఓ పెద్దావిడ తేరుకుని...అమ్మా....ఇది మరీ విడ్డూరంగా ఉందే. దొంగలు దొంగల్లా మాట్లాడుతున్నారా? వీళ్ల చేతులిరిగిపోను... కాళ్లిరిగిపోను...గొలుసు నొక్కేసిందిగాక అది గిల్టుదని మొహాన విసిరికొడతారా? అది చాలదన్నట్టు పిల్ల చెంప పగలగొడతారా? ముదనష్టపు వెధవలు...వాళ్ల కాష్టంగాల...." తిట్ల పురాణం అందుకుంది.

ఆవిడ సానుభూతి వచనాలకు అడ్డుకట్ట వేస్తూ.....ఓనడి వయసు మహిళ మొదలు పెట్టింది. " అమ్మాయ్! నువ్వు చాలా అదృష్టవంతురాలివి తెల్సా. ఒక్క దెబ్బ వేసి వెళ్లిపోయారు. మొన్నామధ్య మా బంధువొకామె చెవులు తెగ్గొట్టారు తెల్సా. పార్కులో తన మానాన తను నడుస్తుంటే ఇద్దరు దొంగ సచ్చినోళ్లు వచ్చి చెవి పోగులు లాక్కుని పారిపోయారు. చెవులెంట ఒకటే రక్తం. ఆఖరికి పార్కులో కూడా ప్రశాంతంగా ఉండటానికి లేకుండా పోయింది. ఎవరు ఎటువైపు నుంచి వచ్చి ఏం గుంజుకెళతారోనని భయపడి చావాల్సి వస్తోంది...."

"ఏవమ్మోయ్. వీళ్లిద్దరూ నయం కాదూ. మా ఇంటి దగ్గరైతే మరీ ఘోరం జరిగింది. టులెట్ బోర్డు సాకుతో ఇద్దరు అగంతకులు లోపలికొచ్చారు. పాపం ఇంటావిడ ఇక్కతే వంట చేసుకుంటోంది లోపల. కాలింగ్ బెల్ శబ్దం విని వచ్చి తలుపు తీసింది. ఖాళీ పోర్షన్ చూపించమన్నారు. తాళం తీసి అన్ని గదులు చూపించింది. వాళ్లలో ఒకడు మంచినీళ్ళడిగాడు. ఆమె వంటగదికేసి నడుస్తుండగా...వెనుక నుండి గట్టి వస్తువుతో తలమీద కొట్టారు. కింద పడగానే వంటిమీద నగలు వల్చుకుంది చాలక...బీరువా కూడా ఊడ్చేసి పోయారు. తల పగిలి రక్తమోడుతున్న ఆమెను ఇరుగు పొరుగు ఆస్పత్రిలో చేర్చి ప్రాణాలు కాపాడారు....కోలుకునేసరికి నెల రోజులు పట్టింది. పాతికవేలు ఖర్చయ్యాయి. అయితే

ప్రాణాలు దక్కాయని సరిపెట్టుకున్నారు... అలా ఉందమ్మా... మాయదారి లోకం....” చెప్పుకొచ్చాడు ఓ తాతయ్య.

అప్పుడే అక్కడికి వచ్చిన ఓ ప్రయాణీకుడు కలుగచేసుకుని..."హూ..చైన్ స్నాచర్ల గురించా మీరు మాట్లాడుకునేది. వాళ్ల గురించి ఎంత తక్కువ చెప్పుకుంటే అంత మంచిది. అంతగా బరితెగించిపోతున్నారు. మొన్నటికి మొన్న మా అపార్టుమెంట్లో ఓ వృద్ధ దంపతుల ప్రాణాలు తీసేసి మరీ నగలు మూటగట్టుకెళ్లారు. బంగారం ముందు ప్రాణాలు గడ్డిపోచలయ్యాయంటే నమ్మండి....." విచారం వెలిబుచ్చారు.

"మారె...బాగా చెప్పారు. పుత్తడి రేటు ఆకాశాన్నంటితే ఇలాంటివే జరుగుతాయి. ఇదివరకు దొంగ సొత్తును అమ్మడానికి కొద్దిగా కష్టపడాల్సి వచ్చేది. ఇప్పుడు ఎంచక్కా మణప్పురమనీ, ఆ పురమనీ... ఈ పురమనీ ఎన్ని కంపెనీలు వచ్చాయి. అది దొంగసొత్తా, సొంత సొత్తా అన్నదాంతో సంబంధం లేకుండా హాయిగా డబ్బులిచ్చేస్తున్నారు. దొంగలకు వాటంగా ఉంది. అడ్డూ అదుపూ లేకుండా పోతోంది..." ప్రయివేటు బ్యాంకులో పనిచేసే వ్యక్తి చెప్పుకొచ్చాడు.

"కాలేజీ కుర్రాళ్లు సైతం దొంగతనాలకు తెగబడుతున్నారంట. మరి అడ్డమైన వ్యసనాలకు బానిసలయ్యాక డబ్బు కావాలి కదా. అందుకోసం ఇంట్లోవాళ్లను వేధించినన్నాళ్లు వేధించి తీసుకుంటారు. వాళ్లు మాత్రం ఎంతని ఇస్తారు? ఆనక ఇదిగో ఇలా రోడ్డునపడి గొలుసులు లాక్కెళుతుంటారు. అంతా ఈజీ మనీ చలవే బాస్..." చెప్పుకొచ్చాడో యువకుడు.

ఇవన్నీ వింటుంటే పల్లవికి తల తిరిగినంత పనైంది. ఒంటిమీద బంగారం ఉంటే ఒక తంటా. గిల్టు నగలు ఉంటే మరో తంటా. అస్సలు నగలే లేకపోతే ఏం చేస్తారో? ఎలా చచ్చేది? అయినా వాడికెంత ధైర్యం? రోల్డుగోల్డు నగ పెట్టుకున్నానని నన్నే చెంప వగలగొడతాడా? చేత్తో చెంప రుద్దుకుంటుండగా...

"అబ్బ....ఇప్పటి వరకు ఉన్న గృహహింస చాలదన్నట్లు...బంగారం రేటు పెరిగాక ఇదిగో ఇలాంటివన్నీ జరుగుతున్నాయి. ఆడవాళ్లకు రక్షణే లేకుండా పోయింది. ఇదిగో అమ్మాయ్! పిచ్చి నగే కదా అని అశ్రద్ధ చేయకు. పదడుగులు వేస్తే పోలీస్ స్టేషన్. వెళ్లి ఫిర్యాదు చెయ్యి. భడవకానాలకు ఎంత పొగరు కాకపోతే గిల్టు నగ మొహాన విసిరేసి చెంప దెబ్బ కొట్టి వెళతారు?! పద...మేమంతా వచ్చి సాక్ష్యం చెప్తాం... అన్నాడు మధ్య వయసు వ్యక్తి.

అందరూ అవునంటూ పోలీస్ స్టేషన్‌కు బయల్దేరారు.

ఏంటి విశ్వంగారు ఇందాకటి నుండి చూస్తున్నాను? హడావిడి పడుతున్నారు. ఏమిటి విశేషం?

"ఏముంటుంది మేడమ్. మార్చి 8వ తేదీ మహిళా దినోత్సవం కదా! ఎప్పటిలా మహిళా ఉద్యోగులతో మీటింగు పెట్టాలి కదా! ఈసారి మీటింగు ఎలా చేయాలా అని హడావుడి".

"అదేంటి విశ్వంగారు, ఇక్కడ మహిళా ఉద్యోగులు చాలామంది ఉన్నారు కదా! వాళ్ళు చూసుకుంటారు. మీ హడావిడే అర్థం కావటం లేదు".

గట్టిగా పగలపడి నవ్వుతూ, "మరిచాను ఈ ఆఫీసుకు మీరు వచ్చి ఆరు నెలలే అయింది కదా! ఇక్కడ పనిచేసే ఆడాళ్ళందరూ వాళ్ళ భర్తల కాలర్ చాటు భార్యలండి. ఇల్లు, ఆఫీసు తప్పితే తల పక్కకు తిప్పి చూడరు. ఐదు అయిందంటే చాలు బ్యాగులు సర్దుకుని తుర్రుమంటారు. ఏం చేయమంటారు? ఆ రోజంతా మేము మీటింగు పెట్టి ఆడవాళ్ళ సమస్యల గురించి చర్చిస్తాము".

"ఆడవాళ్ళ సమస్యల గురించి మీరు చర్చిస్తారా?"

"ఛఛ, మేము చర్చించటం కాదు మేడమ్. వాళ్ళు చర్చించుకోవటానికి మేము మీటింగు ఏర్పాటు చేస్తాము."

"చాలా బాగుంది, చాలా చాలా బాగుంది. మొత్తానికి విశ్వంగారిలో కందుకూరి వీరేశలింగం పంతులు గారు, రాజారామ్మోహన్‌రాయ్ గారు కన్పిస్తున్నారు."

"జోకులు వేయకండి మేడమ్"

'లేకపోతే ఏమిటండీ,?' మీరు వాళ్ళకు అవకాశం ఇచ్చి ఉండరు,'

'ఓకే మీరు కొత్త కదా, విషయాలు నిదానంగా తెలుస్తాయి. మా మగాళ్ళందరము ఈసారికి హాయిగా రెస్టు తీసుకుంటాము. మీరే మీటింగు బాధ్యత తీసుకోండి.'

'విశ్వంగారికి కోపం వచ్చినట్లు ఉంది 'అంటుండగా,

మిగతా స్టాఫ్ విశ్వం చుట్టూ మూగి "లేచింది, నిద్రలేచింది మహిళా లోకం, దద్దరిల్లింది పురుష ప్రపంచం "అంటూ సుబ్బారావు "ఎక్కడమ్మా, నీవు లేనిది, ఏమిటమ్మా నీవు చేయలేనిది" అంటూ ప్రభాకర్, 'మేడమ్ చంద్రికగారి నాయకత్వం వర్ధిల్లాలి' అంటూ మధు. ఇలా ఆటపట్టిస్తూ 'ఈ దినోత్సవం కొత్తగా వచ్చిన మహిళా నాయకురాలు చంద్రికగారి ఆధ్వర్యంలో నిర్వహిస్తున్నాం' అంటూ విశ్వం ప్రకటించాడు.

'అందరికీ నమస్కారం. నేను కొత్తగా ఇక్కడకు ట్రాన్స్‌ఫర్ అయి రావటం వలన ఇక్కడి పరిస్థితి గురించి అవగాహన లేదు. మీరు ఇచ్చిన గురుతర బాధ్యతను సవినయంగా స్వీకరిస్తున్నాను. ముందుగా మీ అందరి అభిప్రాయాలు చెబితే వాటిల్లో ఏది అందరికీ సమ్మతంగా ఉంటే అది చేద్దాము.

# తుది నిర్ణయం

– పి. రాజ్యలక్ష్మి



ఆటపట్టిస్తున్నారన్న విషయం గ్రహించి, చాలెంజ్‌గా తీసుకోవాలని మనస్సులో అనుకొని 'ఓకే, ఓకే ఒక పనిచేయండి, నేనే నాయకత్వం వహిస్తాను. కొత్త కాబట్టి మీరందరూ నాకు సహకరించాలి.'

'ఓకే, ఓకే తప్పకుండా సహకరిస్తాము.' అని అంటుండగా సీట్లల్లోని ఆడవాళ్ళందరూ వచ్చి చంద్రికకు సపోర్టుగా చుట్టూ చేరిపోయారు.

'సరే ఎల్లుండి ఆదివారం కదా! అందరం ఇక్కడే ఒక గంట కూర్చొని కార్యక్రమం ఎలా నిర్వహించాలో చర్చించుకుందాం'అని ఎవరి సీట్లలోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

కార్యక్రమం గురించి చర్చ నుడుస్తుంది.

'వెంకయ్య అందరికీ స్ట్రాంగ్ కాఫీలు పట్టుకురా' అని పురమాయించాడు విశ్వం. 'ఇప్పుడు మేడమ్ చంద్రిక గారు కార్యక్రమం ఎలా నిర్వహించాల తెలియజేస్తారు.'

'అందరికీ నమస్కారం. నేను కొత్తగా ఇక్కడకు ట్రాన్సఫర్ అయి రావటం వలన ఇక్కడి పరిస్థితి గురించి అవగాహన లేదు. మీరు ఇచ్చిన గురుతర బాధ్యతను సవినయంగా స్వీకరిస్తున్నాను. ముందుగా మీ అందరి అభిప్రాయాలు చెబితే వాటిల్లో ఏది అందరికీ సమ్మతంగా ఉంటే అది చేద్దాము. ముందుగా సుబ్బారావుగారు, సెక్షన్ హెడ్‌గారు తమ అభిప్రాయం చెప్పవలసిందిగా కోరుతున్నాను.'ఇలా అందరూ తమ తమ అభిప్రాయాలు తెలియజేసారు.

ఆరోజు భారీ ఎత్తున కార్యక్రమం నిర్వహించాలని, మహిళల చట్టాల గురించి, సమస్యల గురించి స్పీకర్స్‌ను పిలవాలని, అలాగే ఈ జిల్లాలో ప్రప్రథమంగా మహిళా శాసన సభ్యురాలిగా ఎన్నికయిన సుబ్బాయమ్మ గారికి సన్మానం చేయాలని, ముఖ్య అతిథులుగా మిసెస్ కలెక్టరును పిలవాలని, కార్యక్రమానికి అధ్యక్షతగా చంద్రికగారిని, వందన సమర్పణకు మల్లిక, కార్యక్రమానికి 200ల కుర్చీలు, పూలదండలు, మైకు, మెమెంటోలు, శాలువాలు, లైట్లు, రెండు సన్మాన కుర్చీలు తీసుకునే వచ్చే బాధ్యత వైకుంఠరావుకు, 'టీ,స్నాక్స్ సుశీల, అతిథులను ఆహ్వానించటం సత్యవతి, కార్యక్రమం పర్యవేక్షణ



విశ్వానికని ఏకగ్రీవ నిర్ణయం జరిగింది.

చంద్రిక కలుగజేసుకుని రెండు సన్మాన కుర్చీలు ఎందుకండి సుబ్బాయమ్మగారికి ఒక్కరికే కదా సన్మానం.

విశ్వం కలుగజేసుకుని, వ్యంగ్యంగా 'ఆవిడగారి గన్‌మెన్ అదేనండి, వాళ్ళాయనకు కూడా సన్మానం చేయాలి కదా!

అదేంటి ఆయనకు ఎందుకు చేస్తాము?

చంద్రిక మేడమ్‌గారు నిజంగా అమాయకురాలిగా కనిపిస్తున్నారు, ఇక్కడి విషయాలు తెలియవు కదా. ఆవిడ పేరుకు శాసన సభ్యురాలు. ఓన్లీ రబ్బరుస్టాంపు. పెత్తనం అంతా వాళ్లాయనే. మహిళా రిజర్వేషన్ అండీ, మీరందరూ 33 శాతం కావాలి, మహిళా బిల్లు రావాలి అని అరుస్తారుగా. వచ్చిమట్టుకు ఏం చేస్తారండి. పేరుకు మీ పేరు. పెత్తనం మాదేనండి. మీరు ఎప్పుడయినా గమనించారా? బస్సులు ఆడవాళ్ళ సీట్లలో మగవాళ్ళు, రైళ్ళలో లేడీస్ కంపార్టుమెంటు నిండా మగవాళ్ళు ఉండటం అలా. ఏమయినా మేడమ్ మీకు కోపం వస్తుందేమోగాని ఆడది కింద ఉండి మగవాడు పైన ఉంటేనే సమతుల్యంగా ఉంటుంది.

ఏంటి విశ్వంగారూ మీరు మాట్లాడుతున్నది. కొంచెం మాటలు జాగ్రత్తగా మాట్లాడితే బాగుంటుంది. చదువుకున్న మనమే ఇలా మాట్లాడితే మిగతా వారి సంగతి ఏమిటి?

సారీ మేడమ్. కొంచెం ఆవేశంతో మాట జారాను. ప్లీజ్ ఏమీ అనుకోకండి అదికాదు మేడమ్, మీకు కోపం వస్తుందిగానీ, ఆడవాళ్ళకు వచ్చిన రిజర్వేషన్ల ఫలాలు పూర్తిగా అందాలంటే ఇంకో వంద సంవత్సరాలు పడుతుంది. నాయకత్వ స్థాయిలోకి మహిళలు ఇంకా ముందుకు రావటంలేదు. వచ్చినా ఇంకా మగవాడి చాటు మనుషులుగా ఉంటున్నారు. కాస్తో కూస్తో నాయకత్వ లక్షణాలు, సమర్థత ఉండి వచ్చిన వాళ్ళకు అవకాశాలు రాకుండ అడ్డం

"నేను కూడా బాగా అలసిపోయాను. నిద్ర వస్తుంది రేపు అన్నీ ఆడవాళ్ళ మీటింగులే కదా మీరు ఎందుకు. ఇంట్లో హాయిగా విశ్రాంతి తీసుకోండి. నేను ఒక్కదాన్ని వెళ్ళి వస్తాను. మీ అవసరం గూడా అంత ఉండదు కదా."

> **నేను కూడా తలుచుకుంటే ఏపనయినా చేయగలను. ఒక్కసారి, కాదనుకుని ఈ నాలుగు గోడలు దాటి నేను గొంతెత్తితే పాతాళానికి వెళ్ళేది నువ్వు, ఆకాశమంత ఎత్తుకు ఎదిగేది నేను. ఇప్పటి వరకూ నీకు నేను, నాకు నీవు అని ఒకరికి ఒకరం సహాయ సహకార పద్ధతిలో ఈ సంసారాన్ని సాగించాము. ఈ సంసారంలో మన ఇద్దరి బాధ్యత సమానంగా ఉంది. చెల్లుకు చెల్లు. మహిళా రిజర్వేషన్ పుణ్యమాని అనుకోని అవకాశం తలుపు తట్టింది. ఈ అవకాశాన్ని నలుగురికీ సేవ చేయటానికి ఉపయోగిస్తాను.**

వడుతున్నారు. ఎందుకంటే నుబ్బాయమ్మగారికి వాస్తవంగా మంచి తెలివితేటలు, సమర్ధత ఉన్నాయి. ఆమె ఒకప్పుడు అతి సాధారణ వ్యక్తి. ఇంకా చెప్పాలంటే భర్త చాటు భార్య. ఆయనే చక్రం తిప్పేది. పల్లెటూరిలో వ్యవసాయం నుండి టౌనులో రియల్ ఎస్టేట్, వడ్డీ వ్యాపారాలతో బాగా సంపాదించాడు. పిల్లలు బాగా చదువుకొని విదేశాలలో స్థిరపడ్డారు. డబ్బుకు ఢోకాలేదు. అందుకని రాజకీయాలు అవసరం అయ్యాయి. దాదాపు ఎంఎల్ఎ సీటు ఆయనకే ఖాయం అనుకున్నారు. ఆఖరి క్షణంలో మహిళా రిజర్వేషన్ అయింది. ఆయన బదులు ఆమె వచ్చిందేకాని, రాజకీయాలు, అధికారం మాత్రం ఆయన చేతుల్లో ఉంది. ఇప్పటికి కూడా ఆమె భర్తచాటు భార్య. సంతకాలు మాత్రమే ఆమెవి. ఇక పబ్లిక్‌లోకి వచ్చినా ఆమె పక్కన ఆయనకు సీటు ఉండాలి. ఈ రెండు కుర్చీలు తప్పటంలేదు. జనం కూడా చెవులు కొరుక్కుంటున్నారు. ఆయనకు అవేమీ పట్టవు. దానికి తోడు ఆయన చుట్టూ మందీ మార్బలం, ఆర్భాటం ఉండటాన ఆయన వాస్తవాలు పట్టించుకోవటం లేదు.

విశ్వంగారూ, మరయితే ఆమెకు సన్మానం చేయటం సబబేనా, మహిళా సాధికారతకు అర్థం లేకుండా పోతుంది. మహిళలు స్వయం సమృద్ధి సాధించుకుని వాళ్ళ కాళ్ళమీద వాళ్లు నిలబడి సమానత్వం సాధించాలని మహానుభావులు కన్న కలలు కల్లలుగానే ఉన్నాయనిపిస్తుంది. నాకయితే మనస్కరించటంలేదు.

వద్దు మేడమ్ అలా అనకండి. ముందుగా మనం సన్మానం అనుకుని డ్రాప్ అయినామంటే మన ఆఫీసులో ఉన్న ఆయన జాగిలాలు ఆయనకు సమాచారం అందించారంటే మనకు శంకరగిరి మాన్యాలు తప్పవు. ఎందుకు వచ్చిన తంటా ఈసారికి సన్మానం కానిచ్చేద్దాము.

❖❖❖❖❖

ఇదిగో రేపు ఆడోళ్ళ దినోత్సమట. చాలా మీటింగులు ఉన్నాయి. మన పి.ఎ ఎక్కడెక్కడ ఏమీ మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో చెప్పాడా. రోజు పనివాళ్ళు చేస్తున్న టిఫిన్లు తినలేక ఛస్తున్నాను, పెందలాడే లేచి నీచేత్తో జీడిపప్పు వేసి ఉప్మా చేసి తగలడు. అవునుగాని తిరిగి తిరిగి ఒళ్ళంతా నొప్పులుగా ఉన్నాయి, కొంచెం కాళ్ళు పట్టరాదా.

"నేను కూడా బాగా అలసిపోయాను. నిద్ర వస్తుంది రేపు అన్నీ ఆడవాళ్ళ మీటింగులే కదా మీరు ఎందుకు. ఇంట్లో హాయిగా విశ్రాంతి తీసుకోండి. నేను ఒక్కదాన్ని వెళ్ళి వస్తాను. మీ అవసరం గూడా అంత ఉండదు కదా."

అంతే పడుకున్నవాడు ఒక్క ఉదుటున స్ప్రింగు యాక్షన్‌లా లేచి కూర్చున్నాడు.

ఏంటసే ఒక్కదానివి పోతావా. ఆడోళ్ళ దినం రోజున నీ ఒక్కదానివి దండలు, శాలువాలు, వేయించు కొని సన్మానాలు చేయించు కుంటావా? ఆ చెబుతాను, అసలు నేను లేకుండ నీవు ఎక్కడ ఉన్నావే. ఇవన్నీ నీకు ఏడనుండి వచ్చాయే, నిన్ను చంటిబిడ్డలా చేయిపట్టుకొని నడిపించి, ఒక మనిషిగా చేసి ఎంత పైకి తీసుకొచ్చాను, దీనికంతటికీ కారణం మా ఆయనే, మా ఆయన లేకపోతే నేను లేను, ప్రతి పురుషుని వెనుక ఒక స్త్రీ ఉన్నట్లు, ఒక స్త్రీ వెంట ఒక పురుషుడు ఉంటాడని, కాబట్టి ఈ సన్మానాలు నాకుకాదు, ఆయనకే అంకితం అని నీవు చెప్పొద్దా. జనం చప్పట్లు కొట్టొద్దా. ఈ మహిళా రిజర్వేషన్ తగలడకపోతే ఈ సన్మానాలు, పొగడ్తలు నాకే వచ్చేవి కదా దిష్టిబొమ్మలా నిన్ను తీసుకొని రావలసిన ఖర్మ లేకుండా పోయేది.

నేను నీతో 30 ఏళ్ళ కాపురం చేశాను, నిన్ను అణువణువు చదివిన దాన్ని. అంటే ఈ సమాజాన్ని చదివినదానను. ఇన్నాళ్ళూ నీవు ఏమి చెప్పినా చేశాను. తల్లి పిల్లగాడిని ఎప్పుడూ వేలుపట్టి నడిపించదు. నడక వచ్చేంత వరకే ఆమె ఆసరాగా ఉంటుంది. తరువాత పిల్లగాడు బాగా నడుస్తాడు. బాగా పరుగెడతాడు. జీవిత పరుగుపందెంలో చాలా రకాల నకడలు నడుస్తాడు. అలాగని కడవరకూ బిడ్డవెంట తల్లి అంటిపెట్టుకుని ఉండదు. ఇప్పుడు నేను నా అంతట నేను నడువగలను. నాకు ఏమీ తెలియదు అనుకుంటే నీభ్రమ. మహిళా రిజర్వేషన్ వచ్చింది మీ మాటలకు తానతందాన అంటానికి కాదు. ఇక ఆడోళ్ళ ఆలోచనలకు నిర్ణయాలతో పనిలేనప్పుడు రిజర్వేషన్లు ఎందుకు, ఏం చేయాలో ఎలా చేయాలో తెలుసుకోగల సామర్థ్యం నాకుంది. రేపటినుండి నన్ను ఒక మనిషిగా ఉండటానికి, ఈ రాజకీయ అవకాశం పదిమందికి సేవ చేయటానికి ఉపయోగపడనీయి. నీవు చేస్తున్న ప్రతీపని

నిశితంగా గమనిస్తున్నాను. నీ పనీ ఒక్కరికి, ఒక్కరంటే ఒక్కరికన్నా ఉపయోగపడిందా?

ఎదిగిపోయావు, బాగా ఎదిగిపోయావు, మాటకు మాట సమాధానం చెబుతున్నావు. ఈ సీటు నీకు ఊరికే రాలేదు. కోట్లు కుమ్మరిస్తే వచ్చిపడింది. సేవ చేసుకుంటూపోతే చేతికి చిప్పే గతి. ఫరవాలేదు గురువుకు పంగనామాలు పెట్టే రాజకీయ లక్షణాలు బాగానే వంటబట్టాయి. నా సంగతి తెలుసుకదా. నేను ఎంత మంచోడినో అంత చెడ్డోడిని, ఒళ్ళు దగ్గర పెట్టుకుని మాట్లాడు. జాగ్రత్త, నేను తలుచుకుంటే ఏమయినా చేయగలను. ఇంకా మాట్లాడితే నీకు పుట్టగతులుండవు.

అదే నేనూ చెబుతున్నాను. నేను కూడా తలుచుకుంటే ఏపనయినా చేయగలను. ఒక్కసారి, కాదనుకుని ఈ నాలుగు గోడలు దాటి నేను గొంతెత్తితే పాతాళానికి వెళ్ళేది నువ్వు, ఆకాశమంత ఎత్తుకు ఎదిగేది నేను. ఇప్పటి వరకూ నీకు నేను, నాకు నీవు అని ఒకరికి ఒకరం సహాయ సహకార పద్ధతిలో ఈ సంసారాన్ని సాగించాము. ఈ సంసారంలో మన ఇద్దరి బాధ్యత సమానంగా ఉంది. చెల్లుకు చెల్లు. మహిళా రిజర్వేషన్ పుణ్యమాని అనుకోని అవకాశం తలుపు తట్టింది. ఈ అవకాశాన్ని నలుగురికీ సేవ చేయటానికి ఉపయోగిస్తాను. ఎవరి హద్దుల్లో వాళ్ళు ఉంటే మనందరికి మంచిది.

అంతేనంటావా?

ముమ్మాటికీ అంతే. నా విషయంలో జోక్యం చేసుకుంటే ఏమవుతుందో చేప్పేకంటే చేసి చూపిస్తాను. అంటూ గట్టిగా ధబీమని తలుపులు వేసి, తన ఆఫీసు రూమ్‌లో కూర్చుని టేబుల్‌పై ఉన్న ప్రసంగపు పేపర్లను చింపి, డస్ట్‌బిన్‌లో వేసి ఏఏ కార్యక్రమాలు ఎలా చేయాలో నోట్‌బుక్‌లో రాసుకుంది.

❖❖❖❖❖

మేడమ్ ఇందాకటి నుండి ఎంఎల్ఏ గారి భర్తకు ఫోన్ చేస్తుంటే స్విచ్ఆఫ్‌లో ఉంది.

అయితే ఆమెకే చేయండి.

ఆమె దగ్గర ఫోన్ ఉండదు మేడమ్.

మరి మనం పెద్ద ప్రోగ్రాం పెట్టుకున్నాం కదా! ఆమె రాకపోతే ఫెయిల్ అవుతుంది. నాకు టెన్షన్‌గా ఉంది. ఇప్పుడు ఏం చేయాలి?

ఏమోనండి ఇప్పటి వరకూ రెస్పాన్స్ లేదు. నాకు అనుమానంగా ఉంది. ఆమె రాకపోతే ఏం చేయాలి. పి.ఎకు ఫోన్ చేస్తే ఇదిగో వస్తున్నాము అదిగో వస్తున్నాము అంటున్నారు. లేట్ అవుతుంది.

ఇంతలో ఎంఎల్ఏగారి కారు వచ్చింది.

మేడమ్ వస్తున్నారు. సుబ్బాయమ్మ గారి నాయకత్వం వర్ధిల్లాలి అంటూ జనాలు అరుస్తున్నారు.

హమ్మయ్యా అంటూ ఊపిరి పీల్చుకున్నారు. మీటింగ్ మెదలయ్యాక అందరూ మహిళల గురించి చాలా చాలా మాట్లాడారు.

సుబ్బాయమ్మగారు మాట్లాడుతూ మహిళలు సాధించనిదంటూ ఏమీ లేదు. మహిళలు నాయకత్వంలోకి రావాలి. రాజకీయాల్లోకి రావాలి. నాయకత్వ అవకాశాలు వచ్చేది చాలా అరుదు. మహిళా రిజర్వేషన్స్‌తో నాకీ అవకాశం వచ్చింది. వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని అందరిచేత శభాష్ అనిపించుకునే విధంగా చేస్తే దానికర్థం ఉంటుంది. ఈ మహిళా దినోత్సవం సందర్భంగా నేను తీసుకుంటున్న నిర్ణయం ఏంటంటే " ఇక నుండీ రెండు కుర్చీలు అవసరం లేదు. నా కుర్చీ నాకు వేస్తే చాలు" అంటుంటే అందరి హర్షధ్వానాలు మిన్నంటాయి. సుబ్బాయమ్మగారి ముఖంలో కన్పిస్తున్న ఆత్మవిశ్వాసం కొత్త సందేశాన్ని ఇస్తున్నది.

❖

# ఓసారి అడగరాదూ?

సమాజమనే నాన్నమ్మ క్షుద్రపూజ చేసింది
నాన్నకి భూతం పట్టింది
ఇంకాసేపు ఉంటానంటే
నన్ను ముందే అమ్మ కడుపులోంచి
వచ్చేమంటున్నాడు
అందులోని ఆడపిల్లంటే
నాన్నకి ముద్దట
నేను కడుపులో పడిన దగ్గర నుంచీ
చూడాలని ఒకటే తాపత్రయం
నేను తెలివిగా ఆలోచించి నాన్నతో
"నాన్నా! నాది అచ్చం నీ పోలికే
ఉండనీ నాన్న ఇంకొన్ని రోజులు
ఇంకెన్నాళ్ళు అర్ధసంవత్సరంలో వచ్చేను"
అన్నాను
నాన్న వింటేగా నామీద ప్రేమ చాలా ఎక్కువ
ఆ అట్టహాసంతో నా మౌనఘోష నాన్నకి
వినబడలేదు
ఎంత ఖర్చైనా ఫరవాలేదు నా కూతుర్ని
నేను వెంటనే చూడాలని డాక్టరమ్మతో ఒకటే
పంతం
ఎందుకో మరి అమ్మ వద్దంది
నేను విన్నాగా కొన్ని మాటలకు ఇక తప్పదని
అహం చంపుకుంది
ఫలితం డాక్టరమ్మ చేతుల్లో నేను
పిల్లగా కాదు పిండంగా
వేల ఆశలతో ఊపిరిపోసుకోవాలన్న నా కల
పంచభూతాలను చూడకుండానే గాలిలో
కలిసిపోయింది
మీరందరూ కవులట, గాయకులట
మా నాన్నకు నేనంటే ఎందుకంత ఇష్టం
ఓసారి అడగరాదూ?

- జి. రాజశేఖర్

# టీ.ఎమ్.

- కాళీపట్నం సీతావసంత లక్ష్మి

**వారం తిరిగేసరికల్లా డబ్బాతో ప్రత్యక్ష్యం అయ్యాడు పోస్ట్‌మాన్. రెండువేల నూట ఇరవైమూడు రూపాయలు విపిపి చెల్లింపు చేసి డబ్బా తెచ్చి డైనింగ్ టేబుల్ మీదుంచింది. పెద్ద డబ్బా. ఆహా... పెట్టె. అట్టపెట్టె. బాగా చిత్తుకాగితాలు పేర్చి పేర్చి కదలకుండా ప్యాకింగ్ చేశారు. పావుగంటసేపు దాంతో కుస్తీపట్టి, లోపల చూస్తే, ఒక ప్లాస్టిక్ టిఫెన్‌బాక్స్, దానికింద ఒక చిన్నకత్తి, ఇంకా కిందుగా ఒక అడుగు పొడుగున్న ప్లాస్టిక్ స్లయిసర్, అదే కూరకోసర్ 74321 కనపడ్డాయి.**

"ఇక మీరు కూరలు తరగటం మరింత సులభం. మనకు జాన్‌గారు వివరిస్తారు. ఒకేసారిగా చకచకా ఆరు ఉల్లిపాయలు, ఆరు టమాటాలూ, ఇంకా ఎన్నెన్నో ఎలా తరిగి సలాడ్ చేసుకోవచ్చో. మీరు చేయాల్సిందల్లా ఈ కూర కోసర్‌ని ఆర్డర్ చేయటమే. కేవలం పంతొమ్మిదొందల తొంభై తొమ్మిది రూపాయలు మాత్రమే. ఇప్పుడే ఆర్డర్ చేస్తే దీనితోపాటు ఒక కత్తి ఉచితంగా పంపబడుతుంది. నచ్చకపోతే అదే పెట్టెలో ఉంచి, పదిహేను రోజులలోగా వాపస్ చేయండి, డబ్బు పొందండి". నోరెళ్ళబెట్టుకుని, గుడ్లప్పగించి చూస్తోంది వనజ టీవీని. ఇలాగే రోజూ చూస్తూంటుంది.




అబ్బ చకచకా ఎన్నికూరలు? రోజూ సలాడ్లే తిని గబగబా చిక్కిపోవచ్చు. అని మురిసిపోయింది లావుగా, బొద్దుగా ఉండే వనజ. అత్తగారు బాత్రూంలోకి వెళ్లగా చూసి వెంటనే ఫోనందుకుంది. ఇప్పుడే ఆర్డర్ చేస్తే కత్తి ఉచితంగా కూడా ఇస్తార్ట. బొంబాయి కాల్ అయినా ఫ్రీ అట.

"హలో, ఐయాం కాలింగ్ ఫ్రమ్ హైద్రాబాద్. ఐవాంట్ ఆర్డర్ ది కూరకోసర్ 74321".

"మేడమ్! కంగ్రాట్స్. మీరు తెలుగువారా? హైద్రాబాద్ నుంచి వచ్చే మొదటి ఆర్డర్‌తో మీకొక ప్లాస్టిక్ డబ్బా కూడా ఫ్రీ" అంటూనే వనజ చిరునామా తీసుకుని విపిపి చెల్లింపుగా రెండువేల నూట ఇరవై మూడు రూపాయలు రెడీగా ఉంచుకోమనీ, వారంలో ఆర్డరు అందిపోతుందని హామీ ఇచ్చి పెట్టేసింది. "అబ్బ! ఒక ప్లాస్టిక్ కంటైనర్ కూడా వస్తుంది. టీవీలో చూపించినట్లుగానే అలవోకగా సలాడ్ చేసుకుని, నేను చిక్కి అందంగా తయారవటం తథ్యం" అనుకుంటూ, తానెంత అదృష్టవంతురాలో మురిసిపోతూ ఊహాగానంలో, కలల లోకంలో తను అరవై ఏళ్ళు పైబడినా తరగని అందాలరాశి సుమమాలినిలా తయారవబోతున్నాని తేలిపోయింది. బాత్రూమ్‌లోంచి బయటకు వచ్చిన మహాలక్ష్మమ్మ ఈ మాటలు వినసే విన్నది. మళ్లీ రెండువేలు దుబారా కాబోసు అని ఉసూరుమంది ఆవిడ ప్రాణం.

వారం తిరిగేసరికల్లా డబ్బాతో ప్రత్యక్ష్యం అయ్యాడు పోస్ట్‌మాన్. రెండువేల నూట ఇరవైమూడు రూపాయలు విపిపి చెల్లింపు చేసి డబ్బా తెచ్చి డైనింగ్ టేబుల్ మీదుంచింది. పెద్ద డబ్బా. ఆహా... పెట్టె. అట్టపెట్టె. బాగా చిత్తుకాగితాలు పేర్చి పేర్చి కదలకుండా ప్యాకింగ్ చేశారు. పావుగంటసేపు దాంతో కుస్తీపట్టి, లోపల చూస్తే, ఒక ప్లాస్టిక్ టిఫెన్‌బాక్స్, దానికింద ఒక చిన్నకత్తి, ఇంకా కిందుగా ఒక అడుగు పొడుగున్న ప్లాస్టిక్ స్లయిసర్, అదే కూరకోసర్ 74321 కనపడ్డాయి. ఒక పెద్ద కాగితం మీద "నచ్చకపోతే 15 రోజుల్లో వెనక్కి పంపండి" అనే అక్షరాలున్నాయి. ఆ కాగితాన్ని జాగ్రత్త చేసింది వనజ. మిగతా చెత్తంతా పారేసి, ఫ్రిజ్‌లోంచి గబగబా

టమాటాలు, కీరదోస, ఉల్లిపాయలు, పాలకూర కట్టా బైటకి తీసింది. వాళ్లిచ్చిన చిన్న చిన్న ప్లాస్టిక్ పనిముట్లతో కూరలు ముక్కలు తరిగేసి ఆరోజుకి తనకదే లంచ్ అని ఉద్ఘోషించేసింది.

మహాలక్ష్మమ్మ మాట్లాడకుండా తానొండిన అన్నం, పప్పు, కూర, పులుసుతో భోజనం ముగించింది.

సాయంత్రం వాసుదేవరావు వస్తూనే వనజ సంబరం చూసి 'చచ్చాన్రా బాబూ, ఈ పచ్చి కూరలు నన్నూ తినమంటుందో ఏమిటో' అని భయపడ్డాడు. అటువంటి ప్రమాదం ఏం లేకుండా మీ పాతకాలం ఐడియాలు వేరు, నా పద్ధతి మీలా కాకుండా ఆధునాతనం అనే భావం ముఖంలో ప్రతిబింబిస్తుంటే పచ్చికూర ముక్కలతో రాత్రి భోజనమూ కానిచ్చింది వనజ.

రోజూలాగే కూరలు కోస్తూంటే, ఉల్లిపాయ వెళ్ళి వాళ్లిచ్చిన బంతిలాంటి ప్లాస్టిక్ బాల్ లోపలుండే ఇనుప ముళ్ళలో ఇరుక్కుంది. అది గట్టిగా లాగేసరికి, ఉల్లిపాయ ఊడిపోయి, దాంతోపాటు ఇనుప మేకులూ విరిగి బైటికొచ్చాయి. " అరె ఇది లైఫ్‌టైమ్ గ్యారంటీ అన్నారే, మార్చమంటాను" అని గొణుక్కుంటూ దాచిన కాగితం తీసింది. అందులో ఆర్డర్ ఫోన్ నంబర్ తప్ప అసలు చిరునామాయే లేదు. అయినా పట్టువదలని విక్రమార్కుడిలా వనజ మళ్ళీ ఫోన్ చేసింది.

"నమస్తే! ఆప్ కౌన్సా ఐటమ్ ఆర్డర్ కర్నా చాహ్‌తే హై?" అన్న మగ గొంతు విని కంగుతింది వనజ. తను మాట్లాడింది మగ వ్యక్తితో కాదే. అయినా ధైర్యం కోల్పోకుండా తడబడుతూ, వచ్చీరాని హిందీలో సమస్య వివరించింది.

"మేడమ్! ఏ కాల్ సెంటర్‌హై. ఆప్‌కో క్యా ఆర్డర్‌కర్నాహై బోలియే" బాకీ హమ్ కుచ్ మదద్ నహీ. కర్‌సక్తే". అని కాల్ కట్ చేశాడు.

వనజకి చాలా నిరాశ కలిగింది. ఆ ప్లాస్టిక్ కూరకోసర్ 74321ని ఒక ప్లాస్టిక్ కవర్‌లో వేసి వంటింట్లో పై అలమరలో పడేసింది. ప్లాస్టిక్ డబ్బాలో ఏవో పోసి దాచింది. కత్తి సరే, అసలు గట్టిగా పట్టుకుంటేనే విరిగేట్టుంది.

ఆ రాత్రి భోజనాల దగ్గర మామూలుగా భోజనం కానిస్తున్న వనజను చూసి, "ఏమిటోయ్, నీ డయ్‌టింగ్ అయిపోయిందా"? గొంతులో ఎక్కువ వేళాకోళం, ఎగతాళీ లేకుండా జాగ్రత్త పడ్డాడు వాసుదేవరావు.

అదేదో డిఫెక్టివ్ పీస్ అనుకుంటా" బుంగమూతితో జవాబిచ్చింది వనజ.

"పోనీ వాపసు చెయ్యవచ్చన్నావుగా, పంపేద్దామా?"

" ఆ కాగితం మీద ఎడ్రస్సే లేదండీ" ఓడిపోయినట్టు అంది వనజ.

"ఇంక 'రోద'సి కార్యక్రమం చూడాల్సొస్తుందేమోనని, "పోన్లే, దాని సంగతి వదిలేయ్. ఈ కందిపచ్చడి చూడు ఎంత బావుందో? ఇందులో ప్రొటీన్స్ తప్ప ఫ్యాట్స్ ఎక్కువ లేనేలేవు. ఇది తిను" అంటూ సముదాయించాడు. రెండు మూడు రోజుల నుంచీ కేవలం కూరగాయ ముక్కల్తో సరిపెట్టుకోవడంతో, ఒళ్ళు తగ్గటం మాటేమిటోగానీ, ముఖం పీక్కుపోయి ఉన్న వనజ గబగబా అన్నం వడ్డించుకుని, నెయ్యి వేసుకుని, అహ..కాదు పోసుకుని కంది పచ్చడి అన్నం తింటుంటే ఆమె ముఖం అవ్యక్తానందంతో కళకళలాడిపోయింది.

మహాలక్ష్మమ్మ కోడలిని చూస్తూ ప్రేమగా అంది.

" మరోమాటు కలుపుకోవే, నీకోసం దీంట్లో వెల్లుల్లి పోప్పెట్టాను" అంది. వనజ ఈ షాకునుండి కొద్ది రోజుల్లో తేరుకుని మళ్ళీ హుషారుగా తయారైంది. ఎప్పటిలాగే టీవీ కార్యక్రమాలూ, చిప్స్ ప్యాకెట్లూ తోడుగా కోలాలూ మళ్ళీ వెనుకటి కోలాహలం ప్రారంభమయింది.

ఇది మధ్యలో వచ్చే ప్రకటన కాదు. పూర్తి టీవీ మార్కెటింగే. ఒక సన్నగా, పొడుగ్గా, అందంగా చారెడేసి కళ్ళున్న అమ్మాయి టీవీలోచెబుతోంది.

"సన్నబడాలని ప్రయత్నిస్తున్నారా? మా సీ.కో.చి మెషీన్ వాడండి. మీరేం చెయ్యక్కర్లా, నడుముకి ఇలా బిగించుకుని, కూర్చోండి. దీనిలో ఉన్న బ్యాటరీలతో పనిచేస్తూ, కొవ్వును కరిగించే శక్తి తరంగాలు మీ నడుము, పొట్ట చుట్టూ చేరిన కొవ్వుని కరిగించేస్తాయి. అదీ మీరు హాయిగా టీవీ చూస్తూ కూర్చుండగా....." అంటూ ఏకధాటిగా చెప్పుకుపోతోంది పెద్ద కళ్ళ సన్నమ్మాయి.

తరువాత జరగబోయేది తెలిసిన మహాలక్ష్మమ్మ అంది.

"కాసిని నీళ్లు తాగి పడుకుంటానే అమ్మాయ్" అంటూ తన గదిలోకి నిష్క్రమించినా ఆవిడ చెవులు తరువాత చేయబోయే ఫోన్‌కాల్ కోసమే ఎదురు చూశాయి.

అనుకున్నంతా అయింది.

**"హలో ఐయామ్ కాలింగ్ ఫ్రమ్ హైద్రాబాద్. ఐ వాంట్ ఆర్డర్ సి.కో.చి మెషీన్"** వనజ గొంతు.

అటునుంచి ఏం మాటలు విన్నదో తెలీదు.

"అచ్చా.. టీక్ హై"అంటూ పెట్టేసింది.

"ఏమో వనజా, మా రోజుల్లో బావిలోంచో, పంపునుంచో నాలుగు బిందెల నీళ్ళు మోసుకొచ్చి నాజూగ్గా ఉండేవాళ్ళం. ఎవరి బట్టలు వాళ్లుతుక్కుంటే ఏ కసరత్తూ అక్కర్లేదు." అప్పుడు తనెంత నాజూగ్గా ఉండేదాన్నో గుర్తు చేసుకుంటూ అంది మహాలక్ష్మమ్మ. ఇప్పటికీ ఆవిడ వనజకన్నా సన్నమే.

నెల తిరక్కుండానే మరోసారి ఓ చిన్నపెట్టె తీసుకుని పోస్ట్‌మాన్ విపిపి చార్జీలందుకోవడానికి వచ్చాడు. ఈ మారు వనజ మరింత ఆనందంగా అందుకుంది సామాను.

"కిందటిసారి దాంతో అత్తయ్యా, ఆకలికి మాడిపోయాను. ఈ మెషీన్ అలాకాదు. నేను తినేవి ఏమీ తగ్గించక్కర్లేదు. మామూలుగా తింటూనే దీన్ని వాడితే చక్కటి ఫలితాలుంటాయని టీవీలో చెప్పారు" అత్తగారికి వివరించింది వనజ.

"ఏమో వనజా, మా రోజుల్లో బావిలోంచో, పంపునుంచో నాలుగు బిందెల నీళ్ళు మోసుకొచ్చి నాజూగ్గా ఉండేవాళ్ళం. ఎవరి బట్టలు వాళ్ళుతుక్కుంటే ఏ కసరత్తూ అక్కర్లేదు." అప్పుడు తనెంత నాజూగ్గా ఉండేదాన్నో గుర్తు చేసుకుంటూ అంది మహాలక్ష్మమ్మ. ఇప్పటికీ ఆవిడ వనజకన్నా సన్నమే.

"మీకు తెలీదత్తయ్యా" బుకాయించేసింది. ఆరోజు ఆవిడ వండిన గుత్తొంకాయ కూర, మామిడికాయ పప్పు, చల్ల మిరపకాయలూ, చారూ, పెరుగూ కడుపారా లాగించేసింది. కాసేపు రెస్ట్‌గా నిద్రపోయింది.

సాయంత్రం ఐదున్నర అవుతూండగా వచ్చాడు వాసుదేవరావు. టీవీ ముందర కూర్చుని, గజగజా వణుకుతున్న వనజని చూశాడు. కంగారుగా లోపలికెళ్ళి తల్లిని పిలుచుకొచ్చాడు. పైకి బాగానే ఉంది. కానీ ఆ వణుకేమిటి?

"వనజా, ఏమైంది నీకు? జ్వరమా? ఏమిటీ వణుకు?" అంటూ ప్రశ్నలతో ముంచెత్తాడు. వనజ వేసుకున్న సల్వారు కమీజు కింద పెట్టుకున్న సీకోచిని చూడలేదు.

"ఇది సీకోచి మహిమండీ. హాయిగా టీవీ చూస్తున్నా. పేపరు చదువుతూ పడుకున్నా దీని పని ఇది చేసుకుపోయి, సన్నబడేలా చేస్తుందీ మిషీన్". గలగలా నవ్వేసింది, తనకెంతో మోడర్న్ విజ్ఞానం ఉన్నందుకు గర్విస్తూ.

"నువ్విలా బాగానే ఉన్నావుగానీ, నన్నిలాంటి వణుకులతో హడలగొట్టకు" అంటూ రుసరుసలాడుతూ లోనికెళ్ళాడు.

రెండు, మూడు, నాలుగురోజులు సజావుగా పనిచేసింది. అదే వనజని వణికించింది. ఐదో రోజున అది పనిఎంతబాగా పని చేసిందో చూసుకుందామని వెయిటింగ్ మెషీన్ మీద బరువు చూసుకున్న వనజ తేలుకుట్టిన దొంగలా ఊరుకుంది. సీకోచి చూసుకుంటుంది గదా బరువు సంగతని, ఇష్టం వచ్చినట్లు స్వీట్లూ, బూందీలూ, జంతికలూ అవన్నీ కలిసి ఒంటిమీద మరో రెండు కిలోల భారంగా మారాయి. అమ్మో అనుకుని, వనజ సీకోచి మెషీన్‌ని పదిహేను నిముషాల నుంచి అరగంటసేపు వాడసాగింది.

అంతే, రెండో రోజుకల్లా అది పనిచేయటం మానేసింది. ఈసారి తన తెలివితేటలు వాడాలని చిరునామా కాగితం, ఫోను, ప్యాకింగ్ అట్టపెట్టె తెచ్చి జాగ్రత్తగా ప్యాకింగ్ చేసి, పోస్టాఫీసుకు తీసుకెళ్ళి పార్సెల్ పంపింది. అదో నూటా యాభై రూపాయలు దండగనిపించింది. మూడు వేల నాలుగొందల ముప్ఫైయి రూపాయలు కట్టినపుడు ఈ బాధ కలగలేదు వనజకి ఎందుకో. ఆ పార్సెల్ వాళ్ళకి చేరిందో లేదో తెలీదుగానీ, వనజకి వాళ్ళనించీ మళ్ళీ ఫోన్లూ అవీ ఏం చేసినా ఏమీ ఫలితం దక్కలా.

తన అదృష్టం బాగాలేదని తెగ బాధపడసాగింది వనజ. ఏదో దిగులుగా, అన్నీ పోగొట్టుకున్నట్లు శూన్యంలోకి చూస్తుండటం, నిట్టూర్చటం. ఇవేమీ మహాలక్ష్మమ్మగానీ, వాసుదేవరావుగానీ గమనించలా! ఎప్పటిలాగే జీవితం సాఫీగా సాగిపోతోంది. చిత్రమేమిటంటే, ఇప్పటికీ టీవీలో వచ్చే వాణిజ్య కార్యక్రమాలు మాత్రం చూట్టం మాన్లా. ఆ రోజు సోమవారం. మధ్యాహ్నం భోజనాలయ్యాక, మహాలక్ష్మమ్మ కాసేపు నడుం వాల్చింది.

వనజ ఎప్పటిలాగే టీవీ ముందర తిష్టవేసుక్కూర్చుంది. రాశిరత్న కొనుగోళ్ళు టీవీలో జోరుగా సాగిపోతున్నాయి, భాగ్యరత్నం కార్యక్రమంలో.

"మీరు నిరాశ చెందారా? అన్నిటా అపజయలతేనా? మీ జాతకరత్నం తెలుసుకోండి. కేవలం ఐదువేల రూపాయలకి మీ నక్షత్రానికి తగిన భాగ్యరత్నం ఉంగరం లేదా లాకెట్‌గా పొందండి. భాగ్యరత్నం పేరిట ఐదువేలకు డ్రాఫ్ట్ పంపండి. మీరు పుట్టిన తేదీ, సమయం, ఊరిపేరు, మీ చిరునామా వ్రాసి పంపండి. డిడి అందిన వెంటనే మీకు భాగ్యరత్నం పంపుతాం. మీ అదృష్టమే మారిపోతుంది".

ఈలోగా ఒక నటుడెవరో తెరమీదికి వచ్చాడు. 'ఎక్కడో చూశానే" అనుకుంది వనజ. కానీ పేరు గుర్తురాలా.

"భాగ్యరత్నం ధరిస్తూనే నా నట చరిత్రే మారిపోయింది. నాకిప్పుడు ఎంతమంది అభిమానులంటే,బయట అడుగుపెట్ట లేకపోతున్నా" అంటూ ఏమేమో చెప్పాడు. ఎంత ఆలోచించినా ఇతణ్ణి ఏ సీరియల్‌లో చూశానబ్బా అని తలపట్టుకునే ఉండిపోయింది. ఇంత అనామకుడి చరిత్రే మారితే నాదీ మారుతుంది అనుకుంది. తన జీవితంలో ఏం మార్పు కావాలో కాసింత కూడా అర్థం చేసుకోలేకపోయిన వనజ.

అనుకున్నదే తడవుగా అలమారాలోంచి ఐదువేలు తీసుకుని దృఢమైన అడుగులతో బయలుదేరింది వనజ. ఒకటే ధ్యేయం. భాగ్యరత్నం పొందాలి. అదృష్టం మార్చుకోవాలి.

"హు! ఇదంతా ఈ టెలీ మార్కెటింగ్‌తో గొడవ" వాసుదేవరావు సాయంత్రం అలమారలోంచి మాయమైన డబ్బు చూసుకుని గొణుక్కున్నాడు.

మరి ఎలా ఎదుర్కొందాం ఈ టి.ఎమ్.ను?" మీరే చెప్పండి.

•

# ఆత్మ విశ్వాసమే స్త్రీ ఆయుధం

- డా॥ శిలాలోలిత

మొన్నీ మధ్యన 'లేడీస్ హాస్టల్'లో మీటింగ్‌కి వెళ్ళాను. పి.జి. చదివే వయస్సున్న వాళ్ళు, 'లా' స్టూడెంట్లు, యం.బి.ఎ మొ॥ రకరకాలైన కోర్సులు చదువుకుంటున్న నక్షత్రాలన్నీ, ఆకాశాన్ని ఒదిలి ఆ రోజు నేలమీదికొచ్చాయి....

అంతమంది ఆడపిల్లల్ని చూసి నేనెంతో సంతోషపడ్డాను. ఎప్పటిలాగే ఆలస్యంగా మీటింగ్ మొదలవడంతో నేను వాళ్ళందరితో పర్సనల్‌గా మాట్లాడటానికి ఎక్కువ సమయం దొరికింది.

రకరకాల మానసిక స్టేజుల్లో కన్పించారు. వెన్నెముక ఇంకారానివాళ్ళు, అసలేలేనివాళ్ళు, శరీరాకర్షణే అందమని భ్రమపడుతున్నవాళ్ళు, మానసిక సౌందర్యమే మిన్న అనుకునేవాళ్ళు, పల్లెటూర్ల నుంచి వచ్చి ఇంకా అమాయకత్వం ఆనవాళ్ళు ఒదలలేనివాళ్ళు, నేను ఎవడినైనా పడగొట్టగలను అనుకునే పొగరున్నవాళ్ళు, ప్రేమ తప్ప జీవితంలో నాకేదీ ఒద్దనుకునే కలల లోగిళ్ళు, తరగతుల్లో టీజింగ్‌కి గురై, స్ట్రెస్‌కి లోనై దిక్కుతోచనివాళ్ళు, తామనుకున్న చదువుల నిచ్చేన ఎక్కడానికై ఆహరహమూ శ్రమించేవాళ్లు, ఇళ్ళల్లో దొరకని స్వేచ్ఛను హాయిగా అనుభవిస్తున్నవాళ్ళు, దొరికిన స్వేచ్ఛను సద్వినియోగం, దుర్వినియోగం చేసుకునేవాళ్లు, సెల్లుల ప్రపంచంలో మునిగి తేలుతున్న వాళ్ళు, హీరోయిన్ల అందం, అలంకరణ, వస్త్రధారణే అద్భుతమని ఊహించుకుని బతికేవాళ్లు, ఇతరుల ఇబ్బందుల గురించి, పట్టించుకుంటూ, వారిహక్కులకై పోరాడే ఉద్యమ తత్వమున్నవాళ్లు, గాలొస్తే ఎగిరిపోయేట్టున్నవాళ్లు, అదే అందమని అనుకుంటున్నవాళ్లు, ఇలా కలగాపులగంగా, గందరగోళంగా కనిపించారు. సాహిత్య పరిచయం ఒక రెండు శాతం కూడా ఉన్నవాళ్ళు కన్పించలేదు. నిజానికి ఈ చదువుల తర్వాత, ఉద్యోగజీవితం, కుటుంబ జీవితం ప్రారంభాల్లోకి అడుగుపెట్టాల్సిన వాళ్లు ఇలా ఉండటం నన్ను కలవరపరిచింది. ఆరోగ్యం పట్ల సరైన అవగాహన లోపించి ఎంత తక్కువ తింటే అంత అందం అనుకుంటున్నవాళ్లు కనిపించారు. భవిష్యత్ కాంక్ష లేమిటని ప్రశ్నించకుంటూపోతే అస్పష్టంగానే ఉందనిపించింది. వాళ్ళను మరింత దగ్గరగా పరిశీలిస్తే వాళ్ళల్లో లోపించినదేమిటో స్పష్టంగా తెలిసిపోయింది. అదే ఆత్మవిశ్వాసం, తమమీద తమకు నమ్మకం తమ జీవితం పట్ల లక్ష్యం. ఆత్మవిశ్వాసమే వారి ఆయుధమని, దాని పుట్టుక వారి అంతరంగమేనని చెప్పాన్నేను. సమస్యల పరిష్కారాలకు పరుగులెత్తడంకంటే, మూల స్వభావాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాల్సిన అవసరమెంతయినా ఉంది. సమస్యల్ని ఎదుర్కొంటూ, భయపడకుండా, పారిపోకుండా, పరిగెత్తకుండా, నిలబడి ఆత్మవిశ్వాసపు ధైర్యపు జెండా పట్టుకుని జీవితాల్ని సాధించుకోగలమని చెప్పాను. బాహ్య సౌందర్యం కంటే ఆత్మ సౌందర్యం ఎంత అపురూపమైందో వివరించాను. ఇప్పుడొస్తున్న, ఇప్పుడుంటున్న సవాలక్ష సమస్యలకు మూల బిందువు ఆత్మవిశ్వాసలోపమే. అందుకే ముందుగా మనని మనం దృఢపరుకోవాలి. కూడగట్టుకోవాలి. ఏమనిషీ మరీ బలమైనవారు కారు, ఏమనిషీ బలహీనులూ కారు. మనికి మనమే ఓ దుర్గం, ఓ కట్టడం. ఆ కట్టడానికి పునాది ఆత్మవిశ్వాసమే. సమస్యల్ని ఎదుర్కోవడానికి కూడా ఆయుధమిదే. అందుకే రేపటితరం, ఇప్పటి తరం కోల్పోయిందీ కోల్పోతుందీ ఆత్మవిశ్వాసమే అన్న చిన్న స్పృహ మనకుంటే అదే చైతన్యవంతుల్ని చేస్తుంది. రేపటి భవితకి వెలుగు దీపం ఆత్మవిశ్వాసం.

# చట్టాలు

# జీవించే హక్కు

-పొత్తూరి సురేష్ కుమార్, అడ్వకేట్

భారత రాజ్యాంగం 21వ అధికరణం జీవించే హక్కును కల్పించింది. దేశంలో అత్యవసర పరిస్థితి విధించినప్పటికీ ఈ హక్కు సస్పెండ్ కాదు. జీవించే హక్కు కేవలం భారత పౌరులకు మాత్రమే కాక, పౌరులు కాని వారికి కూడా వర్తిస్తుంది. దీని ప్రకారం వ్యక్తులను పోలీసులైనా, ప్రభుత్వమైనా చట్ట వ్యతిరేకంగా నిర్బంధించరాదు.

**హుందాగా జీవించటం:**

కేవలం జంతువులలాగా జీవించటమే జీవించే హక్కు కాదు. మానవ హుందాతనంతో జీవించకల్గితేనే జీవించే హక్కు ఉన్నట్లు, అనగా కనీస అవసరాలైన తగినంత పోషణ, వస్త్రాలు, ఇల్లు, చదువుకునే సౌకర్యాలు, తనను తాను వివిధ రూపాలతో వ్యక్తీకరించుకునే అవకాశం, స్వేచ్ఛగా చలించే అవకాశం, ఇతర మనుష్యులతో కలిసి సహ జీవనం చేయకలిగే పరిస్థితులు అన్ని ఉన్నప్పుడే అది జీవించే హక్కు అవుతుంది.

**బ్రతుకు తెరువు పొందే హక్కు:**

ఏ వ్యక్తి కూడా జీవించేందుకు మార్గం లేకుండా జీవించలేడు, ప్రత్యామ్నాయం చూపించకుండా బ్రతుకు తెరువును లాగివేయకూడదు.

**ఆహారం పొందే హక్కు:**

ఏ ప్రజలైతే తమ నిస్సహాయత వలన ఆహార ధాన్యాలు కొనుగోలు చేయలేని పరిస్థితిలో ఉంటారో వారు జీవించే హక్కు క్రింద ఆహారాన్ని ఉచితంగా పొందే హక్కు కలిగి ఉంటారు. వృద్ధులకు, రోగులకు, వికలాంగులకు, దిక్కులేని స్త్రీలకు, పురుషులకు, గర్భిణీలకు, అనాధ బాలలకు మరియు పాలిచ్చే తల్లులకు ఆహార ధాన్యాలు అందించాలని సుప్రీంకోర్టు ఒక కేసులో తీర్పు చెప్పింది.

**బహిరంగ ప్రదేశాలలో సిగరెట్ కాల్చుట నిషేధం:**

బహిరంగ ప్రదేశాలైన హాస్పటల్స్, కోర్టు బిల్డింగ్స్, విధాన సంస్థలు, గ్రంథాలయాలు, రైల్వేలు, ఆడిటోరియంలు మొదలైన ప్రదేశాలలో బహిరంగంగా సిగిరెట్ కాల్చకూడదు.

**వేళాపాళా లేకుండా శబ్దాలు చేయకూడదు:**

ప్రశాంత జీవనానికి, నిద్రకు భంగం కలిగేవిధంగా పెద్ద పెద్ద శబ్దాలు చేయటం, టపాసులు కాల్చడం, మైకులు మొదలైనవి ఉపయోగించడం చేయకూడదు.

**త్వరితగతి విచారణ:** త్వరితగతిన విచారణ జరపబడటం ఖైదీకున్న ప్రాథమిక హక్కు అని సుప్రీంకోర్టు భావించింది.

**ఆరోగ్య హక్కు:** ప్రభుత్వ డాక్టర్లు కాని, ప్రైవేటు డాక్టర్లు కాని గాయపడిన వ్యక్తికి వెంటనే వైద్యసహాయం అందించాలి. పోలీసుల దగ్గరకు వెళ్ళి న్యాయపరమైన ఫార్మాలిటీస్ పాటించి వస్తేకాని సహాయం చేయను అని భీష్మించుకోకూడదు.

**మంచాల్లేవని వైద్యం నిరాకరించ కూడదు:**

మంచాలు లభ్యత లేనందున గాయపడిన వ్యక్తికి వైద్యం నిరాకరించకూడదని అలా చేయటం 21వ అధికరణాన్ని ఉల్లంఘించటమేనని సుప్రీంకోర్టు చెప్పింది. ఈ కేసులో వ్యవసాయ కార్మికుడు రైలు నుంచి పడి తలకు పెద్ద గాయం అయిన సందర్భంగా ప్రభుత్వ ఆసుపత్రిలో మంచాలు ఖాళీలేక వైద్యం నిరాకరించగా ప్రైవేట్ ఆసుపత్రిలో అడ్మిట్ అయి 17,000/-రూ॥ ఖర్చు పెట్టగా, సుప్రీంకోర్టు ప్రభుత్వం నుంచి అతనికి 25,000/-రూ॥ నష్టపరిహారం ఇప్పించింది.

**భారత రాజ్యాంగం 21వ అధికరణం జీవించే హక్కును కల్పించింది. దేశంలో అత్యవసర పరిస్థితి విధించినప్పటికీ ఈ హక్కు సస్పెండ్ కాదు. జీవించే హక్కు కేవలం భారత పౌరులకు మాత్రమే కాక, పౌరులు కాని వారికి కూడా వర్తిస్తుంది. దీని ప్రకారం వ్యక్తులను పోలీసులైనా, ప్రభుత్వమైనా చట్ట వ్యతిరేకంగా నిర్బంధించరాదు.**

**వైద్యం పొందటం కార్మికుని హక్కు:** ఆరోగ్యాన్ని పొందటం, వైద్య సహాయాన్ని పొందటం కార్మికుని ప్రాథమిక హక్కులని కోర్టు తీర్పు చెప్పింది. కార్మికుడు ఆరోగ్య హక్కు మరియు శక్తికి రక్షణ కలిగివున్నాడు అని సుప్రీంకోర్టు భావించింది. ప్రభుత్వమేదైనా (కేంద్ర, రాష్ట్ర) పరిశ్రమ ప్రభుత్వ రంగమైనా, ప్రైవేట్ రంగమైనా కార్మికుని ఆరోగ్యానికి కావాల్సిన కనీస రక్షణ తీసుకోవటం అవసరం అని తీర్పు చెప్పింది. ప్రైవేట్ పరిశ్రమలకు కూడా ఈ నిబంధనలు వర్తిస్తాయని నొక్కి చెప్పింది.

**రక్షణ గృహాలలో కనీస వసతులుండాలి:** రక్షణ గృహాలు అనగా వృద్ధ ఆసుపత్రులు, ప్రభుత్వ ఆసుపత్రులు, షెల్టర్ హోములు మొదలైన వాటిలో కనీస వసతులు జీవన ప్రమాణాలు ఉండాలి. కరెంటు, మంచినీరు మొదలైనవి తగినంతగా ఉండాలి. లేని పక్షంలో అది జీవించే హక్కుకు భంగం వాటిల్లినట్లే.

**ఏకాంతంగా జీవించటం, జీవించే హక్కులో భాగమే:** తన వివరాలను బయటకు తెలియకుండా బహిరంగ పరచకుండా జీవించే హక్కు అందరికి ఉంది. ప్రైవేట్ జీవితాన్ని ప్రైవసీని భంగపరచటం అనగా ఒక వ్యక్తి వ్యక్తిగత జీవితాన్ని అతని అనుమతి లేకుండా బహిరంగపరుచుట మొదలైనవి జీవించే హక్కు ఉల్లంఘనగా భావించవచ్చు.

**కన్యత్వ పరీక్ష చేయకూడదు:** మహిళలకు కన్యత్వ పరీక్ష చేయించటం అంటే జీవించే హక్కుకు భంగం కలిగించటమే. కనుక పరీక్షలు చేయించరాదు.

**విద్యా హక్కు- జీవించే హక్కు:** విద్యా హక్కు జీవించే హక్కులో భాగమే. కనుక ఏ పౌరునికి విద్యను తిరస్కరించకూడదు. ఇటీవల విద్యాహక్కు చట్టం చేయబడింది.

ఆరోగ్యం

# అరవై సంవత్సరాలు పైబడిన స్త్రీల ఆరోగ్యం

(నాటిక)

- డా॥ చాగంటి కృష్ణకుమారి

**పాత్రలు:**

**సాంబశివుడు: వయస్సు 65 సంవత్సరాలు**

**మంగ: సాంబశివుని భార్య: 60 సం॥లు**

**కాంతమ్మ: సాంబశివుని తల్లి 85 సం॥**

**మోహన్: సాంబశివుని కొడుకు 35సం॥**

**రాధ: మోహన్ భార్య 30 సం॥**

**లత: మంగ చెల్లెలు 45 సం॥**

**బాబి: రాధా, మోహన్‌ల కొడుకు 10 సం॥**

**స్కూటర్ ఆగిన చప్పుడు, కాలింగ్ బెల్ మోగిన, తలుపు తీసిన చప్పుడు.**

**కాంతమ్మ:** సాంబా! ఒక్కడివే వచ్చావ్! మంగ రాలేదేమి? డాక్టర్ ఏమన్నాడు? రాధ అక్కడే ఉందా?

**సాంబ:** కంగారు ఏమీలేదమ్మా, ఆపరేషన్ చేసి గడ్డ తీసేయాలి అన్నారు. రేపే చేస్తామంటున్నారు. పరీక్షలు చేస్తున్నారు. రాధ మంగ దగ్గర ఉంది. నేను బజారుకెళ్ళి సామానులు కొనితెచ్చా. మళ్ళీ వెళ్ళడానికి వీలుపడుతుందో లేదోనని!

**కాంతమ్మ:** రేపే! ఆపరేషన్!

**సాంబ:** ఎలాగూ ఆపరేషన్ తప్పదంటున్నారు రేపయితే నారాయణరావు గారు ఉంటారట. ఆయన బాగా చేయి తిరిగిన అంకాలజిస్ట్,రేపే చేయంచేద్దాం అంటున్నాడు మోహన్.

**కాంతమ్మ:** లతకి ఫోన్ చేసి రమ్మనరా, చెల్లెలు దగ్గరుంటే మంగకి ధైర్యంగా ఉంటుంది, నాకూ ఆ పిల్ల ఇంట్లో తోడుగా ఉంటుంది.

**సాంబ:** తనకి శెలవు పెట్టడానికి వీలు పడొద్దూ! రాత్రికి ఫోన్ చేసి చెపుతాలే. తన అభిప్రాయం కూడా తీసుకొందాం.

**కాంతమ్మ:** అక్కకి రొమ్ములో గడ్డ ఆపరేషన్ చేయాలంటున్నారంటే ఆ పిల్ల రాకుండా ఎలా ఉంటుందిరా ఎలాగైనా వీలుచేసుకొని వస్తుంది. నాకు తెలుసు ఆ పిల్ల మనసు.

**సాంబ:** అలాగేలే! రాత్రి పది దాటాక ఫోన్ చేస్తాలే. నువ్వు కంగారుపడకు. మరేమీ భయంలేదు, మన ఇంట్లోనే డాక్టర్లు ఉండగా ఎందుకు భయం. మోహనికి నారాయణరావు గారు మంచి స్నేహితులు కూడానట! ప్రత్యేక శ్రద్ధ తీసుకొంటారు.

**కాంతమ్మ:** సున్నితమైన శరీరాన్ని కోస్తారంటే భయం కాదుటరా!!

**సాంబ:** ఇప్పుడన్నీ సులువు అయిపోయాయమ్మా, నువ్వు ఊరికే కంగారుపడకు. అంటుండగానే ఇంటిముందు ఆటో ఆగింది.

**సాంబ:** అదిగో రాధే! మంగని తీసుకొని వచ్చేసింది. రాధా! తొందరగానే వచ్చేసారే! ఇంకా ఆలశ్యం అవుతుందేమోననుకున్నాను.

**రాధ:** అత్తయ్యగారికి చేయించాల్సిన పరీక్షలన్నీ చేయించేశాం. రేపు ఉదయం 7 గంటలకల్లా వెళ్ళాలి. 10 గంటలకు ఆపరేషన్ చేసేస్తారట!

**కాంతమ్మ:** మంగా ఎలాఉంది ఒంట్లో, రక్తం పరీక్షకి ఇచ్చావేమో. నీరసంగా ఉందా? ఏమైనా తాగుతావా?

**మంగ:** బాగానే ఉంది అత్తయ్యా, అక్కడ టీ తాగాము.

**సాంబ:** రాధా! మోహన్ ఇంకా ఆసుపత్రిలోను ఉన్నాడా అమ్మా?

**రాధ:** అవును మామయ్యగారూ ఆయన వచ్చేసరికి 11 దాటవచ్చు. ఎమర్జెన్సీ కేసు చూస్తున్నారు. మనమంతా భోజనం చేసి పడుకొందాం. బాబీ భోజనం చేసాడా బామ్మగారూ?

**కాంతమ్మ:** ఆ! వాడికి పెట్టి, నేనూ సొజ్జ తిన్నాను. కంప్యూటర్ రూమ్‌లో ఉన్నాడు.

**రాధ:** పదండి అత్తయ్యా! మీరు స్నానం చేసిరండి. నేనూ స్నానం చేసొచ్చి మీకు వడ్డిం చేస్తాను. తొందరగా పడుకొందాం. రేపు ఉదయమే లేచి వెళ్ళాలి కదా.

**సాంబ:** హలో లతా!

**కాంతమ్మ:** స్పీకర్ ఫోన్ పెట్టరా.

**లత:** చెప్పు బావా, ఏమిటి సంగతులు? అంతా బాగున్నారా?

**సాంబ:** అందరం బాగున్నాం. భోజనం అయిందా?

**లత:** ఆ, ఇప్పుడే తిని ఇలా చేయి కడుక్కొన్నాను, నీ ఫోన్ వచ్చింది.

**సాంబ:** అసలు ఎందుకు ఫోన్ చేసానంటే మీ అక్కకు కుడి రొమ్ములో గడ్డ ఉందని దాన్ని ఆపరేషన్ చేసి తీసేయాలని అంటున్నారు. మోహన్ రేపే ఆపరేషన్‌కి అన్ని ఏర్పాట్లూ చేసేశాడు.

లత: మంచిపని చేశాడు తెలిసిన వెంటనే తీయించడమే మంచిది. ఎవరు సర్జన్?

సాంబ: నారాయణరావు గారట.

లత: ఇకనే!కాన్సర్ గడ్డ అయినా దిగులు లేదు. మొత్తం రొమ్ముని తొలగిస్తారు అంతే!ఆయన బాగా ఆరితేరిన అంకాలజిస్ట్. మరేమీ భయం లేదు.

కాంతమ్మ: లతని రమ్మని చెప్పరా.

లత: అత్తయ్యగారులా ఉన్నారు?

సాంబ: ఆ, నిన్ను రమ్మని పిలవమంటోంది. నువ్వు వస్తే ఆవిడకీ, మీ అక్కకీ ధైర్యంగా ఉంటుందిట.

లత: ఆపరేషనప్పుడు నేను లేకపోయినా ఫర్వాలేదు. వీలు చూసుకుని వస్తా. మూడొంతులు రేపు సాయంత్రానికి అక్కని ఇంటికి పంపిచేస్తారు మందులు ఇచ్చి. మళ్ళీ 9వ రోజు కుట్లు విప్పడానికి రమ్మంటారు. అది బినైన్‌లంప్ అని నా నమ్మకం.

సాంబ: నువ్వు వస్తానని భరోసా ఇచ్చావు నిజం చెప్పొద్దూ, నా మనసూ తేలికయింది. థాంక్స్ లతా.

రాధ: నువ్వు నాకు థాంక్స్ చెప్పటమేమిటి బావా. గుడ్‌నైట్ ఉంటా.

సాంబ: గుడ్‌నైట్.

కాంతమ్మ: మంగకి పత్యం ఏం పెట్టాలిరా మోహన్.

మోహన్: పత్యం ఏమీలేదు. అన్నీ తినొచ్చు. కాకపోతే నూనె, నెయ్యి తగ్గించాలి. కూరగాయలూ ఆకుకూరలూ, పండ్లూ ఎక్కువగా తినాలి. పప్పు తినొచ్చు. ప్రొటీన్లు, పీచుపదార్థాలు తినాలి. అన్నం బదులు గోధుమరవ్వ తింటే మంచిది.

కాంతమ్మ: ఎనాడనగా అది నెయ్యి తినడం మానేసిందిరా! రాత్రి తినేది రెండు పుల్కాలేనయ్యే. ఆ మాయదారి గడ్డ ఎందుకొచ్చిందోగానీ!

మోహన్: లత పిన్ని వస్తోందిగా బామ్మా నీ సందేహాలన్నీ తీరుస్తుందిలే.

బాబి: అమ్మ, నువ్వూ ఇద్దరూ డాక్టర్లే కదా! అవ్వ సందేహాలు మీరు తీర్చలేరా నాన్నా?

మంగ: మీ నాన్న కార్డియాలజిస్ట్, మీ అమ్మ గైనకాలజిస్ట్, లత బామ్మ జీరియాట్రిసియన్‌రా బాబిగా! పైగా మాలాంటి వయసు పైబడిన ఆడవాళ్ళ ఆరోగ్యం గురించి బాగా చదువుకొని ఆ విషయంలో ఆరితేరిందిరా.

బాబి: జీరియాట్రిసియన్ అంటే?

మోహన్: వృద్ధాప్య వైద్య శాస్త్రంరా బాబిగా! ముసలితనంలో శరీరంలో వచ్చే మార్పులు, రోగాలూ, ముసలివారి ఆరోగ్యం వీటి మీద స్పెషలైజేషన్ చేసింది లత బామ్మ.

బాబి: అవ్వ ముసలిదంటే ఒప్పుకుంటా. పళ్ళూడిపోయి, నుదుము ఒంగిపోయింది. కానీ బామ్మకి తల నెరవలేదే, పళ్ళూడలేదు, తను ముసలిదంటే నేను ఒప్పుకోను.

కాంతమ్మ: అసలు ముసలితనం ఎందుకు వస్తుందిరా మోహనా? వాడి బామ్మ ముసలికాదుట. నేను ముసలి అని వాడు ఒప్పుకుంటాడట. విన్నావా నా మునిమనవడి మాటలు నా మటుక్కి నేను అన్ని పనులూ చేసుకొంటూ బాగానే ఉన్నాను. నా కోడలికంటే నేనే ఆరోగ్యంగా ఉన్నాను. ఇంతకీ మీ డాక్టర్లు ఏ వయస్సు వారిని వృద్ధులంటారురా మోహనా?

మోహన్: అభివృద్ధి చెందిన దేశాలలో 65 ఏళ్ళు వచ్చినా వారిని వృద్ధులని అంటారు. మన దేశంలా అభివృద్ధి చెందుతున్న దేశాలలో 60 ఏళ్ళ వారిని వృద్ధులుగా జమకడతారు.

కాంతమ్మ: అది సరే, అలాగే అనుకొందాం. అసలు వృద్ధాప్యం ఎందుకు వస్తుంది అని కదా నా ప్రశ్న?

మోహన్: నువ్వు అన్నీ చిక్కు ప్రశ్నలు మా మీదకు సంధిస్తూ ఉంటావు బామ్మా. ఇంతవరకూ వృద్ధాప్యపు లక్షణాలు రావడానికి కారణాలు శాస్త్రవేత్తలు ఎవరూ తెలుసుకోలేదు.

రాధ: మనిషి తన జీవితంలో అనుభవించిన కష్టాలూ, కడగండ్లూ గురించిన ఆలోచనలవల్ల ముసలితనం వస్తుందని కొందరు భావిస్తారు.

మోహన్: కాలం గడుస్తున్నకొద్దీ వాడుకలో శరీర అవయవాలన్నీ అరిగి తరిగి, వాటి పనితనం తగ్గి, జీవక్రియలు మందగించడం వల్ల ముసలివారవుతారని ఒక అభిప్రాయం.

రాధ: కొంతమంది ప్రకారం వృద్ధాప్యం జెనెటికల్‌గా నియంత్రించబడి ముందుగానే నిర్ధారించబడిన విషయం.

బాబి: అంటే ఏమిటి నాన్నా?

మోహన్: చూడు మీ బామ్మ నీకు వృద్ధురాలిలా కనిపించటంలేదన్నావుగా, అలాగే 80 ఏళ్ళు పైబడిన మీ అవ్వ తన పనులు తాను చేసుకోవడమేగాక ఉదయం పూట మనందరికీ వంటకూడా మీ అమ్మ ఇచ్చే చిన్నపాటి చేతిసహాయంతో చేసిపెడుతోంది. మన వంశంలో జీన్స్ వల్ల అవ్వకి అంతటి శరీర ధారుఢ్యం ఉంది. అలా అందరి ఆడవాళ్ళకీ ఉండదు.

కొంతమంది స్త్రీలు 50 రాకుండానే తలలు పండి ముసలిగా కనిపిస్తారు. జెనెటికల్ కారణాలు కొంత, అలవాట్ల వల్ల కొంత, కొందరికి వృద్ధాప్య లక్షణాలు తొందరగా వస్తాయి.

రాధ: ఆమాట నిజం. అత్తయ్యగారికి 60 ఏళ్ళంటే ఆస్పత్రిలో ఎవరూ నమ్మలేదు. 45-50 మధ్య ఉండొచ్చు అనుకున్నాం అన్నారు. ఆవిడకి ఒక్క పండు వెంట్రుక లేదు. శరీరం దృఢంగా ఉంది. ఇంకా నాకే పండు వెంట్రుకలు వచ్చాయి'.

బాబి: ముఖ్యమైన ముసలితనపు లక్షణాలు ఏమిటి నాన్నా?

మోహన్: బాబిగా ఆడవాళ్ళ శరీర వ్యవస్థ వేరు, మొగవాళ్ళది వేరు. ఎవరి గురించి చెప్పమంటావు?

బాబి: బామ్మకి ఆపరేషన్ చేసారుగా, అందుకు 60 ఏళ్ళు పైబడిన స్త్రీల ముసలితనం, వారి ఆరోగ్యం గురించి చెప్పు.

మోహన్: వయస్సు 60 ఏళ్ళు వచ్చేసరికి ఆడవాళ్ళ శరీర మధ్య భాగంలో కొవ్వు చేరి లావు అవుతారు.

బాబి: ఓ అందుకా బామ్మకి ఈమధ్య పొట్ట, చట్ట పెరిగిపోయాయి. తాత బరువు తగ్గాలి, తగ్గాలి అని బామ్మకి శతపోరి చెపుతున్నాడు. పాపం మరి అది ముసలి అవుతున్న లక్షణం కదా ఆవిడ ఏమిచేయగలదు?

రాధ: చెపుతారు విను.

మోహన్: కాళ్ళ కండరాలలోని మాంసం తగ్గి ఆకారంలో మార్పు వస్తుంది. పొడవు తగ్గుతారు. అందువల్ల నడుస్తున్నప్పుడు తూకం తప్పి పడిపోయే అవకాశాలు ఎక్కువ 40 ఏళ్ళు దాటిన దగ్గరనుంచీ వారి ఎత్తులో ప్రతి పది సంవత్సరాలకీ సంవత్సరాలకీ ఒక సెంటీమీటరు తగ్గుతారు. మొత్తంగా వారి జీవిత కాలంల్లో మూడు అంగళాల వరకూ పొడవు తగ్గుతారు.

సాంబ: బరువు పెరగటం కూడా సహజమైన మార్పేననుకుంటా.

మోహన్: సహజమే కానీ పోషక విలువలు గల ఆహారం తీసుకుంటూ వ్యాయామం చేస్తూ పనులు చేసుకుంటూ బరువు పెరగడాన్ని వాళ్ళు నియంత్రించుకోగలుగుతారు. బోలు ఎముకలు వ్యాధి లక్షణాల వల్ల బాధ పడకుండా ఉండగలుగుతారు.

మంగ: అంటే ఏమిటి ఆ వ్యాధి?

మోహన్: Osteoporosis అంటే ఎముకలు అరిగిపోవడమన్న మాట.

రాధ: నెలసరి ఆగిపోవడంతో ఆడవాళ్ళ ఎముకలలో ఉండే కాల్షియం తగ్గిపోతుంది. ఇతర ఖనిజాలూ తగ్గిపోతాయి వెన్నెముకలోని జెల్‌లాంటి పదార్థం తగ్గి వెన్నెముక వంగి కుదించుకుపోతుంది. పాదాలు వంపు తగ్గి బల్లపరుపుగా అవుతాయి.

బాబి: అవును అవ్వ నడుము ఒంగి పొట్టిగా కనిపిస్తుంది. అందువల్ల చేతులూ కాళ్ళూ పొడవుగా ఉన్నట్లు కనిపిస్తాయి.

మోహన్: కండరాల బిగువు తగ్గుతుంది కనుక వాళ్ళు తొందరగా అలిసిపోతారు.

మంగ: నా చట్ట, పొట్ట పెరగంవల్లే వాటి బరువు నాకాళ్ళ మీద పడడం వల్ల మోకాళ్ళనెప్పులు వచ్చాయంటున్నారుగా మోహనా.

మోహన్: అదీ ఒక కారణం. ఆస్టియోపొరోసిస్ ఆడవారికి సహజంగా వచ్చేదే అందుకే ముట్లు ఉడిగే వయస్సులో, ఆ తరువాత కూడా రోజుకి 1200 నుండి 1500 మిల్లీ గ్రాముల కాల్షియం, దానితోపాటు 400 నుండి 800 అంతర్జాతీయ యూనిట్ల డి విటమిన్ వారు తీసుకోవాలి.

మంగ: మనది ఎండలు ఎక్కువగా కాసే దేశం కదా మేమూ డి విటమిన్ వేసుకోవాలా?

రాధ: కాల్షియం వంటబట్టాలంటే డి విటమిన్ కావాలత్తయ్యా. అందుకే మిమ్మల్ని ఆ రెండూ మర్చిపోకుండా రోజూ వేసుకోమని చెబుతాము. మీరేమిటీ నేనుకూడా వాటిని వేసుకోవాలి.

సాంబ: నేను గుర్తు చేస్తూనే ఉంటాను. నేను చెప్పకపోతే అసలు వేసుకోదు.

కాంతమ్మ: అలా మర్చిపోతే ఎలాగే పిల్లా!

మోహన్: బామ్మ దగ్గర నేర్చుకోవలసినవి మనకి ఎన్నో ఉన్నాయి. చూడు నేను ఇచ్చిన మాత్రలు క్రమం తప్పకుండా వేసుకుంటుంది.

కాంతమ్మ: అవును, ఎవరినీ బాధపెట్టకుండా పోవాలని ఆ భగవంతుడ్ని ప్రార్థిస్తున్నా.

బాబి: అవ్వ చర్మం ముడుతలు పడినట్టే బామ్మ చర్మం ముడుతలు పడి పోతుందా. చూడండి అవ్వ జబ్బలు ఎలా వ్రేలాడుతున్నాయో!

కాంతమ్మ: నా జబ్బలు ఆడిస్తూ ఆడుకోనిదే వీడికి పొద్దుపోదు.

మోహన్: అవ్వకీ బామ్మకే కాదు. ఎవరికైనా ముసలితనం వచ్చేసరికి చర్మం వ్రేలాడిపోతుంది. చర్మం మీద మచ్చలు వచ్చేస్తాయి. ఒక వర్ణం అంటే పిగ్‌మెంట్ చర్మం మీద చేరడం వల్ల వచ్చే ఈ మచ్చలను లింటిగోస్ అంటారు.

రాధ: ముట్లు ఉడిగాక ఆడవాళ్ళ చర్మంలో నూనె తయారు కావడం తగ్గుతుంది. చర్మం పొడారిపోతుంది. దురద పెడుతుంది. శ్వేద గ్రంథులు చెమటని తక్కువగా తయారు చేస్తాయి. అందుకే వారికి ఎండదెబ్బ తగిలే అవకాశం యువకులకంటే ఎక్కువ.

అంతలో ఫోన్ మ్రోగుతుంది.

– సశేషం

ఆకాశవాణి సౌజన్యంతో...

చైతన్య మానవి పై మీ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు తెలియచేయాల్సిందిగా కోరుతున్నాము.

మా చిరునామా

బ్లాక్ నెం. 24, హెచ్ఐజి, ఫేజ్2,

1-8-1,బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్-44

ఫోన్: 27605845

మీడియా

# మన జాతకం మన చేతుల్లోనే

కె. అరుణ

మీరెప్పుడైనా పొద్దున్న పొద్దున్న టివి పెట్టారా? అయితే సరే! మరి పొద్దున్నే టివి ఆన్‌చేసి రిమోట్‌తో భరతనాట్యం చేసే అలవాటూ ఉండాలే! ఉందా?! మరింకనేం! మనం టాపిక్‌లోకి ఎంటరైపోవచ్చు. రేడియోలో సుప్రభాతం వచ్చినట్లుగానే టివిలో ముందుగా భక్తిగీతాలు వస్తాయి కదా! నిజానికి బయట సమాజంలోకన్నా ఛానళ్లలోనే భక్తి వరదలై పారుతుందనే విషయం మనకు బాగానే తెలుసుగా! సరే! మరి భక్తిముక్తావళి అనంతరం ఏం వస్తాయి? జాతకఫలాలండీ బాబూ! శుభలగ్నం, గ్రహఫలం, వగైరాల పేరిట వచ్చే కార్యక్రమాలను ఎప్పుడైనా చూశారా? నేనైతే ఈమధ్య ఏమీ తోచనపుడు అవే చూస్తున్నా తెల్సా?! నిజానికి అవో పెద్ద కాలక్షేపం. కాదు, కాదు, పెద్ద కామెడీ షో చూసిన అనుభూతి పొందొచ్చు.

ఇది నమ్మకాలను విమర్శించడం కాదు. ఎగతాళిచేయడం అంతకన్నా కాదు. కానీ ఏదో ఒకటి చెప్పాలి కదాని నోటికొచ్చినవి వేదాలు, పురాణాల్లో లిఖించిన లెవెల్లో అత్యంత గంభీర వదనాలతో చెప్పడం... ప్రేక్షకులను తక్కువగా అంచనావేయడమే! కాదంటే, మీరే శ్రద్ధగా ఆలకించండి, ఈ మాట కరెక్టో కాదో తెలిసిపోతుంది. పూర్వం పత్రికల్లో జాతకఫలాలు చదివితే అటుదిటు, ఇటుదటు తిప్పినట్లుగా అనిపించి నవ్వుకునేవాళ్లం(మీరూ అంతే నవ్వుకునేవారా?!) అదేదో సినిమాలో పత్రిక యజమాని ఒక వారం జాతకఫలాలు అందకపోతే ఒక రాశిది మరో రాశికి మార్చి ప్రింట్‌చేయమంటాడు గుర్తుందా! ఇప్పుడు టివిలది అంతకన్నా ఫార్సయిపోయింది.

ఆయా కార్యక్రమాల్లో సదరు పండిత మహాశయుల బోధనలు ఎలా ఉంటాయంటే... ఆయా రాశులవారికి ఎలాంటి కీడు జరుగకుండా అంతా సరి కావాలంటే... తెల్లని పువ్వులు దానంచేయండి. లేదంటే నీలంరంగు దుస్తులు ధరించండి. కాదంటే ఐదు ఒత్తుల దీపపుసెమ్మెలో ఆవునెయ్యివేసి వెలిగించి తూర్పుదిక్కుకు పెట్టండి అని! ఏంటీ, వీటికే నవ్వేసుకుంటున్నారా? ఆగండాగండి! ఇంకా చాలా ఉన్నాయ్! మనం ముందు చెప్పుకున్నవన్నీ ఒక ఎత్తు. ఇప్పుడు చెప్పబోయేవి మరో ఎత్తు! అవేంటంటే వారి కీడు హాం..ఫట్ అన్నంత సులువుగా మాయమైపోవాలంటే... పారే నీటిలో మట్టి ముంత వేయాలట! మరొక రాశివారికి ఇచ్చిన సలహా ఏమిటంటే... బీట్‌రూట్ ఆవులకు తినిపించమని(!)! ఇంకొకరికి అయ్యవారి ఉపదేశం ఏమనగా... నిమ్మకాయ... కాదు, కాదు, నిమ్మరసాన్ని దానమివ్వాలట(!) మన నగరాల్లో పారే నీరంటే డ్రైనేజీ తప్ప మరోటి కనపడదయ్యే! ఇక ప్లాస్టిక్ కవర్లు తినే గోమాతను వెతికి వెతికి తాజా బీట్‌రూట్‌లు తినిపించాలి. (నాకో డౌటు! ఈ శాస్త్రాలన్నీ పూర్వకాలంనాటివి కదా! అప్పట్లో మన దేశంలో బీట్‌రూట్‌లు ఉండేవా? మీకు తెలిస్తే చెప్పరా ప్లీజ్!) ఓకే! మరోటి ఏంటీ...ఆ! నిమ్మరసం దానంచేయడం! ఇరుగుపొరుగు నిమ్మకాయలు ఇస్తే తీసుకుంటారు గానీ... నిమ్మరసం అంటే... అనుమానమే! ఏమొచ్చింది వీళ్లకి అని అనుకోవడమే కాదు, పిచ్చాళ్లని చూసినట్లు చూడరూ!

ఈ 'ఆచారాలన్నీ' కొత్తగా, వింతగా లేవూ?! (ఏదో సినిమాలో కొత్తగా ఉంది కదా అని అడిగితే, ఎమ్మెస్ 'కొత్తగా కాదు, చెత్తగా ఉంది' అంటాడు!) లేకపోతే ఏంటండీ! ఈ తరుణోపాయాలేంటండీ బాబూ! ఎక్కడా వినలేనీ, కనలేనీ ఆచారాలు ఛానళ్ల పుణ్యమాని నేడు నట్టింట్లో మన కళ్లముందు నిలిచి తైతక్కలాడుతున్నాయి. తలకుమాసిన వాళ్లెవరో నోటికొచ్చింది వాగుతుంటే మనం నమ్మి ఫాలో అవ్వాలా? కాస్త పరిశీలిస్తే ఇవన్నీ మోకాలికీ, బట్టతలకూ ముడిపెట్టినట్లు అనిపించవూ?!

ఏమనిపిస్తుందంటే, ఇప్పుడంతా కొత్తదనానికి ప్రాణమిచ్చే మనుషులు కదా! 'కొత్తొక వింత, పాతొక రోత' అనే సామెతలు ఊరికే పుట్టలేదు మరి! అందుకే, ఎప్పుడూ పిల్లి ఎదురైతే కీడు, నిండుకుండతో ఎదురెళ్లాలి... వగైరాలు బహుశా ఓల్డ్ ఫ్యాషనైపోయి ఉంటాయి. 'పాడిందే పాడరా పాసిపళ్ల దాసరోడా' అన్నట్లు పాతవే చెబితే కొత్త తరం మన మాట వినరు సరికదా, నమ్మరు అని ఆయా మేధావులంతా డిసైడైపోయారో ఏమో కానీ, కొత్త రూట్లు పట్టారు. వెనకొక జాతకచక్రం డిజైను, కాషాయ వస్త్రాలు, నుదుట విభూది, మెడలో రుద్రాక్షలు, అన్నిటికన్నా ముఖ్యంగా 'లాప్‌టాప్' ఉంటే చాలు, సెట్టింగ్ రెడీ! (వినడానికి మనం రెడీ!) ఇక మన ఓపిక! విన్నవారికి విన్నంత అంటే మోయగలిగినవారికి మోయగలిగినంత కేలిఫ్లవర్లు! అయితే 'పాత సీసాలో కొత్త సారా' అన్నట్లుగా అవే మూఢాచారాలకు నూతనత్వపు మేకప్‌వేసి మనమీద రుద్దడంలోనే వారి తెలివితేటలు, వారి ఆత్మవిశ్వాసమూ కనిపిస్తున్నాయ్!

వీళ్లెంత చెవికోసిన మేకల్లా అరిస్తే మాత్రం ఈరోజుల్లో కూడా ఇలాంటి చాదస్తాలను నమ్మే వాళ్లు ఉన్నారా, అంటారా? మరదే! భలేవారండీ మీరు! అభివృద్ధి, విజ్ఞానం పెరిగే కొద్దీ మూఢభక్తి, మూఢనమ్మకాలు భూలోకంలో 'అవినీతి కుంభకోణాలు' పెరిగినట్లు ఇబ్బడిముబ్బడిగా పెరిగి పోతున్నాయి. (ఉదా: ఏ గల్లీ భక్తి ఆ గల్లీకే సొంతం అన్నట్లు సందుసందుకీ వెలిసే వినాయకుడే సాక్షి!) పెరిగిన సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించుకుని రెట్టించిన ఉత్సాహంతో ఛాందసత్వం మరింత ముందుకు

మిగతా 45వ పేజీలో

సినిమా

# నీటైన 'ది డర్టీ పిక్చర్'

సినిమా పేరే డర్టీ. ఆపై కంపుకొట్టే వ్యాంపు స్టోరీ. 'ది డర్టీ పిక్చర్' సెక్స్‌సింబల్ సిల్క్‌స్మిత కథేనంటూ వివాదాలు. విద్యాబాలన్ సెక్సీ పోస్టర్లపై తగాదాలు. సెక్సుకు, ద్వంద్వార్థ సంభాషణలకూ లోటుండదంటూ చౌకబారు ప్రచారాలు. వ్యాంపు జీవితంపై ఎలాగూ చిన్నచూపే! వారి గురించి తీసిన సినిమాపట్లా అదే భావం? ఇది శృంగారనాయిక చిత్రమే. కానీ వల్గారిటీకి తావులేని జీవనచిత్రం. నేటి చిత్రాలతో పోల్చితే ఈ సినిమా వంద రెట్లు నయం(శృంగారపరంగానే!). అందుకే లోకరీతి, లోకనీతి వేరు, వాస్తవం వేరు!

ఒక యువతి సినీరంగంలో నిలదొక్కుకోవాలంటే... 'ఒక్క ఛాన్సు' చేతికి చిక్కాలంటే 'దేనికైనా' సిద్ధపడాలనేది జగమెరిగిన సత్యం. పోనీ... బహిరంగ రహస్యం. ఛానళ్ల పుణ్యమాని శక్తికపూర్ వ్యవహారం మనకు తెలిసిందే! గుట్టు రట్టయినా దుమ్ము దులుపుకుని ధర్మాత్ముల్లా ఫోజుకొట్టడం వారికి అలవాటైతే... అభాసుపాలయ్యేది అతివే! అలాంటి పరిస్థితుల్లో ఆశల నిచ్చెన ఎక్కాలని తాపత్రయపడేది ఒక పేదింటి అమ్మాయి అయితే? ఆ దోపిడీకి చిత్రరూపం 'ది డర్టీ పిక్చర్'.

కథ అందరికీ తెలిసిందే! వెండితెరను ఏలాలనే కలతో మద్రాసు చేరుతుంది రేష్మ(విద్యాబాలన్). అనుకోకుండా వచ్చిన అవకాశం ద్వారా తన 'ప్రతిభ' ప్రదర్శిస్తుంది. సినిమాను కళగా భావించే దర్శకుడు ఇబ్రహీం(ఇమ్రాన్‌హష్మీ) ఆ పాటను కత్తిరిస్తాడు. అయితే, ఆ సినిమా ఆడదు. ఆ పాట గురించి తెలుసుకున్న నిర్మాత సెల్వ గణేషన్(రాజేష్‌శర్మ) తిరిగి దాన్ని చిత్రంలో జోడిస్తాడు. అంతే, కాసుల వర్షం కురుస్తుంది. రేష్మకు సెల్వ గణేషన్ సిల్క్ అని నామకరణం చేస్తాడు. సిల్క్ ఇండస్ట్రీలో మంట రాజేస్తుందని డిసైడైపోతాడు. వెంటనే అగ్రనటుడు సూర్యకాంత్(నసీరుద్దీన్‌షా)తో సిల్క్ క్లబ్‌సాంగ్ ప్లాన్‌చేస్తాడు. ఊరూపేరూ లేని సిల్క్‌తో 'నటించడాన్ని' సూర్యకాంత్ నిరాకరిస్తాడు. కానీ సిల్క్ తనదైన 'శైలి'లో అతన్ని 'ట్యూన్'చేస్తుంది. ఇక సూర్యకాంత్ ప్రతి సినిమాలోనూ సిల్క్ తప్పనిసరి. వెల్లువెత్తిన అవకాశాలతోపాటూ సిల్క్ అహమూ పెరుగుతుంది. తానో స్టార్‌ననీ, లోకమంతా తన పాదాక్రాంతమని సిల్క్ నమ్ముతుంది. ఈ మార్పునెవరూ అంగీకరించరు. ఇక అణగదొక్కడమే తరువాయి! మెల్లగా సూర్యకాంత్ నిజస్వరూపం సిల్క్‌కు తెలుస్తుంది. ఆ కసితో సిల్క్ అతని సోదరుడు రమాకాంత్(తుషార్‌కపూర్)తో సంబంధం పెట్టుకుంటుంది. సిల్క్ స్థానం ఇంటిఇల్లాలిగా కాదు, మంచం వరకే అని అన్న తమ్మునికి ఉపదేశిస్తాడు. క్రమంగా సిల్క్ తాగుడుకు బానిసవుతుంది. అలా సిల్క్ పతనం ఆరంభమవుతుంది. సినిమాతీసి ఆర్థికంగానూ పతనమవుతుంది. సర్వం కోల్పోయిన సిల్క్ ఈ లోకాన్ని వీడాలనుకుంటుంది. ఒళ్లు చూపించి కాసులు పండించిన సిల్క్ ఒంటినిండా పట్టుచీర కట్టుకుని తనువు చాలిస్తుంది. అనుక్షణం అసహ్యించుకునే ఇబ్రహీం ప్రేమను పొందడం, సినిమా 'ఎంటర్‌టైన్‌మెంట్... ఎంటర్‌టైన్‌మెంట్... ఎంటర్‌టైన్‌మెంట్' పైనే నడుస్తుందని చివరికి ఇబ్రహీం ఒప్పుకోవడం సిల్క్ సాధించిన విజయాలు!

ఇది టోటల్‌గా వన్ ఉమెన్ షో! విద్యాబాలన్ పాత్రలో లీనమై, మమేకమైపోయింది. నడక, నడత, చూపు, కైపులతో సిల్క్‌లో ఇమిడిపోయింది. వ్యాంప్‌గా, తాగుబోతుగా, అహంతో విర్రవీగుతూ, పతనమై ఓడిపోతూ... ప్రతి క్షణాన్నీ కళ్లెదుట నిలిపి కనికట్టుచేసింది. నసీరుద్దీన్‌షా, ఇమ్రాన్‌హష్మీ, తుషార్ తదితర నటులంతా విద్య తరువాతే! సెంటీ సీరియల్స్‌లో మునిగితేలే ఏక్తాకపూర్ ఈ సబ్జెక్ట్‌ను ఎంచుకోవడం ప్రశంసనీయం. దర్శకుడు మిలన్ లుథ్రియా సిల్క్ జీవితాన్ని దృశ్యమాలికగా మలిచాడు. వాస్తవాలు చిత్రీకరించడంలో ఎక్కడా తడబాటు, తత్తరబాటు లేదు. కొన్ని సన్నివేశాలు మనసుకు హత్తుకుంటాయి. అలాగే ఎనభైలనాటి వాతావరణం చూపడంలో ఆర్ట్ డైరక్టర్ సఫలమయ్యారు. సంగీతంసైతం సరిపోయింది. ఈ సినిమాకి హీరో అంటే సంభాషణల రచయిత రజత్ అరోరానే చెప్పాలి. బాణాల్లాంటి మాటలు సినీరంగానికి ములుకుల్లా గుచ్చుకుంటాయి. కొందరైనా భుజాలు తడుముకోవాల్సిందే! 'నేను నోరు తెరవనంతవరకే మీరంతా బాగుండేది! ఒకసారి చెప్పానా, మీ ముసుగులు క్షణంలో తొలగిపోతాయి', 'నేను బట్టలు విప్పేకొద్దీ మీకు లాభాల పంట', 'అంతా నా స్తన్యంపై చేతులేయాలనుకునే వారే... నా తలపై చేయేసి ఓదార్చేవారే లేరు', 'నా పాదం ఎవరూ చూడరు, అందరి దృష్టీ ఒకచోటే', 'కామంతో కమ్ముకోవడమే తప్ప ప్రేమగా తాకినవాళ్లు లేరు'... ఇలా విద్యాబాలన్ నోటినుండి వెలువడిన ప్రతీ మాటా ఒక తూటానే!

'పాత్ర డిమాండ్ చేసింది'... తమ ఎక్స్‌పోజింగ్‌కు తరచూ తారలు చెప్పుకునే భాష్యం! ఇందులో విద్యాబాలన్ పాత్రపరంగా ఎక్స్‌పోజ్‌చేసింది. అదీ అవసరం మేరకే! నిజానికి సబ్జెక్ట్‌రీత్యా ఈ సినిమాలో స్కిన్‌షోకు బోలెడంత ఛాన్సుంది. కానీ ఇందులో శృంగారం యేరులై పారలేదు. నేటి హీరోయిన్లను చూసి నాటి వ్యాంప్‌లు తల దించుకున్నట్లే... డర్టీ పిక్చర్‌లోని 'శుభ్రత'ను చూసి పదో తరగతి 'కామ ప్రేమ'లు చూపే సినీజనం సిగ్గుపడాలి. సినిమా చూశాక, 'అవకాశాలు ఎరగా చూపి శరీరాలను 'ట్యూన్' చేయించుకునే కామాంధులది తప్పా? పరిస్థితుల ప్రాబల్యంవల్ల వారికి అనువుగా ఒదిగే అతివలది తప్పా? ఈ పాపం యాంగిల్స్ చెప్పి మరీ చిత్రీకరించే గోముఖవ్యాఘ్రాలదా? లేక పైకిరావాలనే ఆరాటంలో ఒంటిని వింటిలా వంచే పడతులదా? విలువల వలువలు విప్పదీసి విజ్ఞులుగా చెల్లుబాటయ్యే వారికన్నా వ్యాంప్ పవిత్రురాలే!' అన్న నిశ్చయానికి రావడం ఖాయం! సినిమాలో ఐటమ్ సాంగ్ తెగ ఆనందించి, తరువాత 'అది' అని వ్యాంప్ గురించి చీప్‌గా మాట్లాడేవారికి ఈ సినిమా పట్టదు. ఇది రాలిన ఒక తార వ్యథాభరిత గాథ! అంగాంగ ప్రదర్శనతో అగ్గిరాజేసి ఆ వేడికి తానే బూడిదైపోయిన అభాగ్యురాలి కథ! ఎందరికో విస్తరిగా మారి ఎంగిలాకుగా పిలిపించుకున్న దీనురాలి వ్యథ! వెలుగులు చిమ్మాలనుకుని వెలిసిన చిత్రంలా మారిన మగువ బాధ! మనసుతో చూస్తే జీవితం! లేకుంటే కేవలం కాలక్షేపం!

ప్రజాశక్తి సౌజన్యంతో

43వ పేజీ తరువాయి

దూసుకుపోతోంది. ఇక్కడ ట్విస్ట్ ఏమిటంటే... విజ్ఞానాన్ని పెంపొందించాల్సిన ఎలక్ట్రానిక్ మీడియా వీటిని పెంచి పోషించే బాధ్యత తన భుజస్కంధాలపై వేసుకుంది. మూఢత్వంవల్ల పెరిగే అజ్ఞానం సంగతి ఛానళ్లకు తెలుసు! వీటిని నమ్మి ఒళ్లూ, ఇల్లూ గుల్ల చేసుకునేవారున్నారనీ వారికి తెలుసు! వీటివల్ల జరుగుతున్న హాని, ఒనగూడే నష్టమూ వీరికి మహత్తంగా తెలుసు! ఏంటీ, నమ్మరా! హన్నన్న! ఎంత మాట, అంటారా? చేతబడి చేశారని ఫలానా ఊళ్లో ఒకర్ని తగలబెట్టారనీ... దెయ్యముందని నమ్మి ఫలానా ఊరంతా ఖాళీ చేశారని మనకు నిత్యదర్శనం చేసేవాళ్లు వీరే కదండీ! ఇంత తెలిసిన ఆ మహానుభావులకు తాము స్వయానా పెంచి పోషిస్తున్న మూఢత్వం తాలూకు ఎఫెక్టులే ఇవన్నీ అని తెలీదంటే నమ్మేదెలా అంట? కాకుంటే ఆయా ఘటనలను నేపథ్యంగా చేసుకుని గంట కార్యక్రమం రూపొందించి... చివరాఖర్లో ఇదంతా మూఢనమ్మకాలేనని 'జనవిజ్ఞానవేదిక' ఖండించిందని ఓ మాటగా చెబుతారు! 'నాలుగు పాటలు, నాలుగు ఫైట్లు, ఒక ఐటమ్ సాంగ్, పందమంది తలకాయలు నరికివేత ఉంటే చాలు ఈ అమాయక ప్రేక్షకులు సినిమాను హిట్ చేసేస్తారు అనుకునే సినీజనంలాగానే వీళ్లు కూడా! అర్థంలేని విషయాలను అందంగా ముస్తాబుచేసి బోలెడంత బిల్డప్పిచ్చి చెప్పిస్తే చాలు నమ్మేస్తారీ జనం అనుకుంటారన్నమాట! అంతేకాదు, మనకింతగా జాతకఫలాలు చెప్పి, మన బతుకుల్ని తీర్చిదిద్దుతున్నట్లుగా చేసి, మసిపూసి మారేడుకాయచేసి మన కళ్లు పత్తికాయల్లా విచ్చుకునేలా చేస్తారా? వాళ్లు ఇవేమీ తమకు తాము భస్తే ఆపాదించుకోరు. రూపొందించడం తప్ప ఆ కార్యక్రమాన్ని చూడనే చూడరు. ఇంకా, ప్రజల 'అజ్ఞానానికి' నవ్వుకుంటారేమో కూడా! అయినా ఛానళ్లు ఎన్ని చెబితే మాత్రమేం! మురిగిపోయే ఛాందసాలను 'షుగర్‌కోట్' చేసి మనపై విసిరితేనేం! ఏవి పాలో, ఏవి నీళ్లో తెలుసుకోగల తెలివితేటలు మనకుంటే చాలు! వీళ్ల చెత్త ప్రయత్నాలు తృటిలో తిప్పికొట్టగలం! అయినా... "మన భవిష్యత్తు మన చేతిలో ఉంటుంది. దాన్ని తీర్చిదిద్దుకోవాల్సింది కూడా మనవే! అంతేకానీ, మంత్రాలకు చింతకాయలు రాలవు. గడ్డి తినే ఆవుకు బీట్‌రూట్ తినిపిస్తే మన జాతకం సెట్టయిపోదు. నచ్చిన దుస్తులు కాకుండా వారు చెప్పిన రంగు దుస్తులు వేసుకున్నంతమాత్రాన జరగాల్సింది జరగకమానదు. మన కృషి, పట్టుదలలే మన విజయానికి మెట్లు. విజ్ఞత, విచక్షణ, అవగాహన ఉండాలే కానీ ఎలాంటి ప్రతికూల పరిస్థితులనైనా అవలీలగా ఎదుర్కోగలం" అన్న విషయాలు ఛానళ్లవారికి తెలీదేమో కానీ మనకు బాగా తెలుసు! ఏమంటారు?!

★

# ఐక్యూను పెంచే తల్లిపాలు!

పిల్లలకు తల్లి పాలు అమృతంతో సమానమన్న సంగతి తెలిసిందే. ఇవి శిశువులకు కావలసిన ఆహారాన్ని సమకూరుస్తూనే రోగనిరోధక శక్తినీ పెంపొందిస్తాయి. ఇన్‌ఫెక్షన్ల బారిన పడకుండా కాపాడుతాయి. అందుకే పుట్టిన తర్వాత ఆర్నెల్ల వరకు తల్లిపాలు తప్ప మరేమీ ఇవ్వకూడదని ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్దేశించింది. అయితే తల్లిపాలు తాగే పిల్లల్లో తెలివితేటలు కూడా పెరుగుతాయంటే నమ్ముతారా? అంతలా ఆశ్చర్యపోకండి. పోతపాలు తాగిన పిల్లలతో పోలిస్తే ఆర్నెల్లకు పైగా తల్లిపాలు తాగిన పిల్లల్లో 3.8 పాయింట్ల ఐక్యూ ఎక్కువగా ఉంటున్నట్లు పోలాండ్‌లో చేసిన అధ్యయనంలో వెల్లడైంది మరి. జాగిలోనియన్ విశ్వవిద్యాలయానికి చెందిన వీస్లాజెడ్రీచోవ్‌స్కీ బృందం తల్లిపాలు, పోతపాలు తాగిన పిల్లలను ఎంచుకుని ఏడేళ్లపాటు పరిశీలించింది. చిన్నప్పట్నుంచి నర్సరీకి (ప్రి స్కూల్) వెళ్ళేవరకు ఐదుసార్లు వారి తెలివితేటలను పరీక్షించింది. ఇందులో తల్లిపాలు తాగిన పిల్లల్లో ఐక్యూ గణనీయంగా ఎక్కువగా ఉన్నట్లు తేలటమే విచిత్రమనుకుంటే...ఇది తల్లిపాలు తాగిన సమయాన్ని బట్టీ ఆధారపడి ఉండటం మరింత విచిత్రం. మూణ్నెళ్ళ వరకు తల్లిపాలు తాగిన వాళ్ళు 2.1 పాయింట్లు, 4-6 నెలల వరకు తాగినవాళ్ళు 2.6 పాయింట్లు, ఆర్నెల్ల కన్నా ఎక్కువ సమయం తాగివాళ్ళు 3.8 పాయింట్ల మేరకు ఐక్యూ అధికంగా కలిగి ఉన్నట్లు వెల్లడైంది.

ఇంతకీ పిల్లల మేధోశక్తిని పెంచటంలో పోతపాలల్లో లేనివి తల్లిపాలల్లో ఉన్న రసాయనాలేంటి? దీనిపై ఆసక్తికరమైన చర్చ, పరిశోధనలు జరుగుతున్నాయి. తల్లిపాలలోని ఆయా రసాయనాల కోసం శాస్త్రవేత్తలు ఇంకా శోధిస్తూనే ఉన్నారుగానీ.... తల్లీబిడ్డల మధ్య ఏర్పడే అనుబంధమే అసలు కారణమని నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ చైల్డ్ హెల్త్ అండ్ హ్యూమన్ డెవలప్‌మెంట్‌కు చెందిన టోన్స్ రాజు అంటున్నారు. 'తల్లి రొమ్ము నుంచి శిశువు పాలు పీల్చటమనేది కేవలం కడుపునింపుకునే పనికాదు. ఇందులో చురుకైన, పరస్పర, శారీరక, మానసిక సంభాషణ దాగుంది " అని ఆయన వివరిస్తున్నారు. పాలు ఇస్తున్నప్పుడు తల్లీ పిల్లల మధ్య పరస్పర శారీరక, మానసిక బంధం ఏర్పడుతుందని.....ఇది శిశువు తెలివితేటల అభివృద్ధికి దోహదం చేస్తుందని చెబుతున్నారు.

పుట్టిన తరువాత ఏడాదిలోపే పిల్లల మెదడు రెండింతల బరువు పెరుగుతుంది. ఇందులో చాలా వరకు మెదడులోని తెల్ల పదార్థానికి (వైట్ మ్యాటర్) సంబంధించిందే. ఈ భాగంలోని నాడులపై విద్యుత్ బంధనం (మైఎలినేషన్) ఏర్పడితే అవి 50 రెట్లు అధిక వేగంతో విద్యుత్ ప్రకంపనాలను ప్రసారం చేస్తాయి. ఈ ప్రక్రియ పుట్టిన

( మిగతా 48వ పేజీలో)

# ఉద్యమ బాటలో

### పావలా వడ్డీ మరియు లింకేజి లోన్ల కోసం

డ్వాక్రా గ్రూపు సభ్యులకు పావలా వడ్డీ రుణాలు, లింకేజీలోన్లు, గ్యాస్ కనెక్షన్లు, అభయహస్తం పింఛన్లు ఇవ్వాలని,




సిఆర్‌పిలకు వేతనాలు ప్రభుత్వమే ఇవ్వాలనే డిమాండ్లతో వరంగల్లులో సదస్సు మరియు వేలాదిమందితో కమిషనర్ ఆఫీసుముట్టడి జరిగింది. నగరంలో ఐదు రోజులపాటు ఐద్వా కార్యకర్తలు ఇంటింటికి తిరిగి డ్వాక్రా గ్రూపు మహిళలు ఎదుర్కొంటున్న సమస్యలను తెలుసుకున్నారు. అనంతరం సదస్సు తర్వాత కమిషనర్ ఆఫీసు ముట్టడితో స్పందించిన మున్సిపల్ కమిషనర్ డ్వాక్రా గ్రూపు సభ్యులు ఎదుర్కొంటున్న పావలా వడ్డీ రుణాలు లింకేజీలోన్లు, గ్యాస్ కనెక్షన్లు, తదితర అనేక సమస్యలు పరిష్కరిస్తామని హామీ ఇచ్చారు. డ్వాక్రా గ్రూపు మహిళలకు పాల సేకరణ కేంద్రాలు ఏర్పాటు చేసుకోవడానికి ప్రతి గ్రూపుకు ఐదు లక్షల రూపాయల లోన్లు ఇచ్చేలా చూస్తామన్నారు. "సమస్యలపై ఐక్యంగా పోరాడితే విజయం తథ్యం' అనే సత్యం పై డ్వాక్రా మహిళల పోరాటం తెలియజేస్తూఉంది.

### సెక్షన్ 498ఎకు మార్పులు అవసరం లేదు

సెక్షన్ 498ఎను నీరుగార్చవద్దు అనే అంశంపై హైదరాబాద్‌లోరౌండ్ టేబుల్ సమావేశం జరిగింది. ముఖ్య అతిథిగా విచ్చేసిన హైకోర్టు న్యాయమూర్తి చంద్రకుమార్ మాట్లాడుతూ నేటి సమాజంలో స్త్రీని వ్యాపార వస్తువుగా చూస్తున్నారని, అందులో భాగంగానే సినిమాల్లో అసభ్యంగా చూపిస్తున్నారని అన్నారు. వరకట్నాన్ని చట్టపరంగా నిషేధించినా సమాజం నుండి దాన్ని రూపుమాపలేకపోయామని, సెక్షన్ 498ఎకు మార్పులు చేయాల్సిన అవసరం లేనేలేదని ఎక్కడైనా ఆ చట్టాన్ని దుర్వినియోగం చేస్తే తగిన చర్యలు తీసుకోవాలని అన్నారు. సమ సమాజం వచ్చేంత వరకూ సమస్యలు ఎదురవుతూనే ఉంటాయని హైకోర్టు న్యాయమూర్తి బి. చంద్రకుమార్ అన్నారు. రాష్ట్ర సెంటరుతోపాటు జిల్లాలలో రౌండ్‌టేబుల్ సమావేశాలు జరిగాయి. ప్రధానమంత్రికి, న్యాయశాఖా మంత్రికి 498ఎను యధాతథంగా అమలుచేయాలని టెలిగ్రాములు, ఇ-మెయిల్స్ పంపారు.

### గ్రీటింగ్స్

అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) ఆధ్వర్యంలో రాష్ట్ర వ్యాప్తంగా మహిళలకు నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తూ 1,70,000 గ్రీటింగ్స్ పంచారు. ఆరు




సంవత్సరాల లోపు బాలబాలికల నిష్పత్తి పడిపోవటంలోని తీవ్రతను తెలియజేస్తూ "ఆడపిల్లలను కాపాడుకుందాం" అనే సందేశంతో గ్రీటింగ్స్, సమాజంలో ఆడపిల్లల భ్రూణహత్యల నిరోధక చట్టాన్ని పకడ్బందీగా అమలు చేయడంతోపాటు చట్టాన్ని ఉల్లంఘిస్తే కఠిన చర్యలు తీసుకోవాలి. ఆడపిల్లని పుడమిపైకి ఆహ్వానించే విధంగా ప్రభుత్వం సంక్షేమ పథకాలు చేపట్టాలని కోరారు.




హైదరాబాద్

**సృజనాత్మకత:** రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాల్లో ఐద్వా ఆధ్వర్యంలో సంక్రాంతి సందర్భంగా మహిళల్లో దాగివున్న కళలను, ఆకాంక్షలను వెలికి తీసేందుకు మహిళలందరినీ ఒక వేదిక పైకి తెచ్చి ఆటల పోటీలు నిర్వహించింది. రంగోలి, మ్యూజికల్‌ఛైర్స్, మెహిందీ, వ్యాస రచన, తదితర పోటీల్లో మహిళలు, సామూహికంగా పాల్గొని ఆనందాన్ని చాటారు. ముగ్గుల్లో తమ సృజనాత్మకతను చాటడంతోపాటు, వ్యాసరచన పోటీలలో పాల్గొని, వివిధ అంశాలపై తమ మనోభావాలను చాటారు. వీధిలోని మహిళలంతా ఒకచోట కలవడానికి, ఒకరితో ఒకరు మనస్సు విప్పి మాట్లాడుకోవడానికి సామాజిక స్పృహ పెరగటానికి ఐద్వా నిర్వహిస్తున్న ఆటలపోటీలు ఉపయోగపడుతున్నాయని మహిళలు అభిప్రాయపడ్డారు.

**స్నేహ ఇంటి పనివారల చలో అసెంబ్లీ:**

రాష్ట్ర వ్యాప్తంగా లక్షల సంఖ్యలో ఇంటిపనివారలు ఉన్నారు (పాచిపనులు చేసేవారు). ప్రభుత్వమే ఇంటిపనివారికి గుర్తింపు కార్డులు ఇవ్వాలని, ఇ.ఎస్.ఐ, పిఎఫ్ సౌకర్యం కల్పించాలని, వారి పిల్లలకు స్కాలర్‌షిప్పులు ఇవ్వాలని, అవమానాలు, వేధింపులు అరికట్టాలని స్నేహ ఇంటిపనివారల సంక్షేమ సంఘం మరియు ఐద్వా రాష్ట్ర కమిటీలు ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నాయి.

5-12-2011 తేదీన స్నేహ ఇంటిపనివారల సంఘం ఆధ్వర్యంలో ఇందిరాపార్క్‌వద్ద జరిగిన ధర్నాలో ముఖ్య అతిథిగా పాల్గొన్న అడిషనల్ కమిషనర్ ఆఫ్ లేబర్ హెచ్.కె. నాగు, మాట్లాడుతూ ఇంటిపనివారికి కనీస వేతనం చట్టం వచ్చిందని చెప్తూ ఎక్కడ అమలు చేయకపోయినా తమ దృష్టికి తీసుకురావాలని కోరారు. ఇంటిపనివారికి గుర్తింపు కార్డులు, పిల్లలకు స్కాలర్‌షిప్‌ల కోసం రాబోయే కాలంలో ప్రయత్నిస్తామన్నారు. అసంఘటిత రంగ కార్మికులకు వర్తించే హెల్త్ ఇన్సూరెన్స్ పాలసీ ఇంటిపనివారికి కూడా వర్తింపచేస్తూ కేంద్ర ప్రభుత్వం జీవో తీసుకువచ్చిందని చెప్తూ దానిని అమలు చేస్తామన్నారు. రాబోయే కాలంలో ఇంటిపనివారల సంక్షేమానికి తమవైపు నుండి అన్ని రకాల చర్యలు తీసుకుంటామని ఇంటిపనివారిని ఉద్దేశించి హామీ ఇచ్చారు. విజయనగరం, ఖమ్మం, వరంగల్, హైద్రాబాద్, రంగారెడ్డి జిల్లాల నుంచి ఇంటిపనివారు ధర్నాలో పాల్గొన్నారు.


హైదరాబాద్

**హింసా వ్యతిరేక ప్రచారం**

నవంబరు 25 హింసా వ్యతిరేకదినం నుండి డిశంబరు 10 మానవ హక్కుల దినం సందర్భంగా ఐద్వా రాష్ట్ర కమిటీ హింసా వ్యతిరేక ప్రచారం పక్షం రోజులపాటు నిర్వహించేందుకు పిలుపునిచ్చింది. రాష్ట్రంలో విద్యార్థినులు, మహిళలపై నేరాలు పెరుగుతున్నాయి. ఆడపిల్లలపై ప్రేమోన్మాదుల దాడులు, ర్యాగింగ్, ఈవ్‌టీజింగ్, యాసిడ్ దాడులు, ఆడపిల్లల అక్రమ అమ్మకాలు, అత్యాచారాలు పెరుగుతున్నాయి. చట్టాలను అమలు చేయటంలో ప్రభుత్వం ఘోరంగా విఫలమైంది. టి.వి. సినిమా, ఇంటర్‌నెట్‌లలో వస్తున్న పాశ్చాత్య విషసంస్కృతి యువతీయువకులపై తీవ్ర ప్రభావం పడుతున్నది. ఈపెడ ధోరణులకువ్యతిరేకంగా అమ్మాయిలను



నెల్లూరు


ఆదిలాబాద్



గుంటూరు

చైతన్యపరచాలని ఐద్వా రాష్ట్ర వ్యాప్తంగా కాలేజీలలో సెమినార్లు, ర్యాలీలు, మానవహారాలు నిర్వహించింది. అనంతపురం, కర్నూలు, తిరుపతి, నెల్లూరు, ప్రకాశం, నిజామాబాద్, కృష్ణా, ప॥గోదావరి, గుంటూరు విశాఖ, విజయనగరం, ఖమ్మం, బెల్లంపల్లిలలో జరిగిన సదస్సులకు వందల సంఖ్యలో విద్యార్థిని, విద్యార్థులు పాల్గొన్నారు.

### ప్రభుత్వ హత్యలే

జనవరి1 దేశమంతా నూతన సంవత్సర వేడుకలలో మునిగి తేలుతుండగా మైలవరం మండలం 3 గ్రామాలలో కల్తీసారా తాగి


కృష్ణా

19మంది మృత్యువాతపడ్డారు. ఐద్వా జిల్లాకమిటీ వెంటనే స్పందించి బాధిత కుటుంబాలను పరామర్శించింది. మృతి చెందినవారి పిల్లల చదువు బాధ్యత ప్రభుత్వమే తీసుకోవాలని, మృతులకు ఎక్స్‌గ్రేషియా ప్రకటించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది. మహిళాసంఘాలు, ప్రతిపక్షాల ఆందోళనతో ఎక్సైజ్ శాఖ నుంచి మృతుల కుటుంబాలకు 2లక్షల ఎక్స్‌గ్రేషియా, పిల్లల చదువులు, పక్కా ఇల్లు నిర్మాణానికి వాగ్దానం చేశారు.

### మరుగుదొడ్ల సమస్యపై

ప్రతి ఇంటికి మరుగుదొడ్డి నిర్మించాలి, అవసరమైన ప్రతి చోట కమ్యూనిటీ టాయ్‌లెట్స్ నిర్మించాలి, కమ్యూనిటీ టాయ్‌లెట్స్‌లో నీళ్ళు, వాచ్‌మెన్‌ను ఏర్పాటు చేయాలి, దరఖాస్తు చేసుకొని పెండింగ్‌లో వున్న వారందరికి మరుగుదొడ్లు మంజూరు చేయాలి. నిర్మాణ ఖర్చును పెరిగిన ధరలకు అనుగుణంగా పెంచాలి. అనే డిమాండ్లతో గుంటూరు జిల్లాలో ధర్నా జరిగింది.

**(45వ పేజీ తరువాయి)**

తర్వాత బాల్యం నుంచి కౌమారదశలోనే ఎందుకు ఏర్పడుతుందనే దానిపై అధ్యయనంలో దృష్టి సారించారు. చిన్నతనంలో ఎదురైన అనుభవాలు మైఎలినేషన్‌ను ప్రభావితం చేస్తాయని, పరిసరాలకు తగ్గట్టుగా మెదడు ఎదగటానికి ఇది తోడ్పడుతున్నట్లు తేలింది. తల్లితండ్రులు మాటల రూపంలో చూపించే ఆప్యాయత చిన్నతనంలో ఐక్యూపై కీలకమైన ప్రభావితం చూపిస్తుందని హార్వర్డ్ మెడికల్ స్కూలుకు చెందిన మార్టిన్ టెయిచర్ అంటున్నారు. ఏడాదిలోపు పిల్లల్లో కేవలం మెదడు పరిమాణం పెరగటమే కాదు చూపు, కదలికలు, శబ్దాల ప్రక్రియలకు సంబంధించిన భాగాల్లోనూ ఈ సమయంలోనే ప్రధానమైన మార్పులు జరుగుతాయి. భాషను అర్థం చేసుకోవటం, నేర్చుకోవటం వంటి వాటికి ఇదే పునాది వేస్తుంది. ఇవన్నీ కూడా శిశువుకు ఎదురైన అనుభవాల మీద ఆధారపడి ఉంటాయి. రొమ్ము నుంచి పాలు పీలుస్తున్నపుడు తల్లీ పిల్లల మధ్య జరిగే సానుకూల భావాల ప్రసారం... తల్లితండ్రులు, చుట్టూ ఉండేవారి ప్రేమపూర్వక సంభాషణలు అన్నీ కూడా శిశువు మెదడు అభివృద్ధి చెందటంలో కీలక పాత్ర పోషిస్తాయి. పాలు ఇస్తున్నపుడు తల్లి మెదడుకు రక్తప్రసారం జరుగుతుంది. ఆక్సిటోసిన్ విడుదలవుతుంది. ఈ హార్మోన్ తల్లీ పిల్లల మధ్య అనుబంధం పెరగటానికి దోహదం చేస్తుంది. పిల్లల మెదళ్ళలోనూ ఇలాంటిదే జరుగుతుండొచ్చు అని రాజు చెబుతున్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే పిల్లల మెదడు అభివృద్ధి చెందటంలో తల్లిపాలు గణనీయమైన పాత్రను పోషిస్తాయన్నమాట. అదీ శిశువు అభివృద్ధిలో చాలా కీలకమైన సమయంలో కావటం విశేషం.

– సేకరణ: మానవి డెస్క్



# రాష్ట్ర మహిళలకు దిక్సూచి

**రాష్ట్రాన్ని ప్రభుత్వం మద్యం ప్రవాహంలో ముంచెత్తుతున్నది. ప్రభుత్వం అనుమతిచ్చిన షాపులతోపాటు, లక్షలాది బెల్టుషాపులకు తోడుగా కాపుసారా అమ్మకాలు ప్రజల బతుకులతో చెలగాటమాడుతున్నాయి. ప్రజా సంక్షేమాన్ని కాలరాసి, కాసులే లక్ష్యంగా కదులుతున్న ప్రభుత్వానికి చెక్ పెట్టడంతోపాటు, మన బతుకులు ఎలా దిద్దుకోవచ్చో కృష్ణాజిల్లా జగ్గయ్యపేట మహిళలు ఐక్య పోరుతో తెలియజెప్పారు.**

అది కృష్ణాజిల్లా జగ్గయ్యపేట మండలంలోని షేర్‌మహ్మద్‌పేట గ్రామం. 2011 సెప్టెంబర్‌కు ముందు ఆ గ్రామంలోకి తొంగిచూస్తే.... పెరిగిన బెల్టుషాపులకు తోడు కాపుసారా అమ్మకాలతో ఊర్లో అనేక కుటుంబాలు విచ్ఛిన్నమయ్యాయి. మద్యానికి బానిసలై అతి చిన్న వయస్సులోనే భర్తలు చనిపోతే 220 మంది మహిళలు వితంతువులైనారు. కుటుంబ భారమంతా మహిళలే తలకెత్తుకున్నారు. ఆలుమగలు రోజంతా పడ్డ కష్టంలో మగడి సంపాదనంతా పొద్దుగ్రుంకే వేళకు తాగుడుకు ధారపొయ్యడంతోపాటు భార్యను కొట్టి, ఆమె దాచుకున్న డబ్బును కూడా తాగుడుకు తగలేసేవాడు. వారి వ్యసనం ఇంట్లో చెంబు, తపేలాలు కూడా మిగలనియ్యలేదు. బిడ్డలను బడి మాన్పించి కూలికి పంపుతున్నారు.

పొద్దంతా కష్టపడ్డా నోటికాడి కూడును మద్యం లాక్కుంటు ఉంటే మహిళల కడుపు మండింది. కళ్లెర్ర జేసారు. ఇంకానా! ఇక చాలు. అంటూ కొంగు నడుముకు చుట్టారు. బెల్టు షాపులు, నాటుసారాను తుదముట్టించేందుకు ఐక్యంగా కదిలారు. గ్రామ సమాఖ్య, అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘాల ఆధ్వర్యంలో మహిళలను కూడగట్టారు. పోరాట కమిటీలు వేశారు. గ్రామంలోకి మద్యం రాకుండా వంతులవారీగా పహారా కాసి అడ్డుకున్నారు. ప్రజల్లో, ముఖ్యంగా యువతలో మద్యం తాగడం వలన వచ్చే ప్రమాదాలను వివరిస్తూ ప్రచారం చేశారు. చేతుల్లో కర్రలను చేపట్టి, ఎక్కడికక్కడ బెల్టుషాపులను, కాపుసారా బట్టీలను ధ్వంసం చేస్తూ, అపర కాళీల్లా అందరొక్కటై కదిలారు. 2,000 మందితో భారీ ర్యాలీ నిర్వహించి, తమ పోరాటానికి ఎవరైనా అడ్డువస్తే వారి అంతుచూస్తామన్నారు.

పోరాటానికి నాయకత్వం వహించే మహిళలపై భౌతిక దాడులు జరిగినా, అదరలేదు, బెదరలేదు. ఐద్వా రాష్ట్ర, జిల్లా నాయకత్వం అడుగడుగునా వారి పోరులో మమేకమయ్యింది. అండదండలనిచ్చింది. షేర్ మహ్మద్‌పేట మహిళలు ఆగ్రామంలో మద్యం రక్కసిపై విజయం సాధించారు. సెప్టెంబరు నుండి ఆ గ్రామంలో మద్యం అమ్మకాలు లేవు. ఈ ఏడాది వచ్చిన సంక్రాంతి తమ బతుకులలో నిజమైన క్రాంతి నింపిందని మహిళలు కేరింతలు కొడుతున్నారు.

షేర్ మహ్మద్‌పేటలో రాజుకున్న నిప్పురవ్వ గండ్రాయి, మంగొల్లు, మల్కాపురం, రామచంద్రునిపేట, అనుమంచిపల్లి గ్రామాలకు అంటుకున్నది. జగ్గయ్యపేట మండలమంతా ఉద్యమం విస్తరింపచెయ్యాలని మహిళలు కంకణం కట్టుకున్నారు. సంఘటితంగా కదులుతున్నారు. మద్యం షాపులను మట్టుపెడుతున్నారు.

జగ్గయ్యపేట మహిళలు సాగిస్తున్న ఈ పోరు రాష్ట్ర మహిళలకు దిక్సూచి కావాలి. రాష్ట్ర వ్యాప్తంగా ఉప్పెనలా కదిలి ప్రజల నెత్తుటి కూడు తింటున్న ప్రభుత్వ రాక్షసత్వానికి చెక్ పెట్టాలి. మద్యం మహమ్మారిని తరిమి కొట్టాలి.

  R.No. APTEL/2006-20000



# మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

**మార్చి8** అంతర్జాతీయ మహిళా దినోత్సవం ప్రపంచవ్యాప్తంగా హక్కుల కోసం గళమెత్తే మహిళలందరికి స్ఫూర్తినిచ్చే రోజు. దోపిడి, అణచివేత, హింసల నుండి విముక్తి కోసం శ్రామిక మహిళలు చేసిన చారిత్రాత్మక పోరాటమది. 1857 మార్చి8న అమెరికాలోని న్యూయార్క్ నగరంలో పని ప్రదేశాలలో మెరుగైన సౌకర్యాల కోసం, వేతనాలు పెంచాలని, పని గంటలు తగ్గించాలని, అసమానతలు, వేధింపులకు వ్యతిరేకంగా బట్టల మిల్లులో పనిచేసే వేలాది కార్మికులు కదిలారు "ఆకలితో చావడంకన్నా పోరాడుతూ చావడం మేలు". అన్న పిలుపు శ్రామిక మహిళలందరినీ కదిలించింది, ఏకం చేసింది.

యజమానుల తీవ్ర నిర్బంధంతోపాటు వారు జరిపిన కాల్పుల్లో 13-25 సంవత్సరాల వయస్సున్న 146 మంది యువతులు నేలకొరిగారు. చివరకు మహిళల పట్టుదల ముందు కిరాతక యజమానులు తలొగ్గి ఒప్పందం చేసుకున్నారు. బలమైన ఉద్యమం ద్వారా మాత్రమే కార్మికవర్గం తమను తాము కాపాడుకోగలదు" అని నిరూపించారు.

అమెరికా మహిళల పోరాట స్ఫూర్తితో క్లారాజెట్కిన్ 1910లో కోపెన్ హగెన్‌లో జరుగుతున్న సామ్యవాద మహిళల రెండో అంతర్జాతీయ సదస్సులో మార్చి 8 అంతర్జాతీయ మహిళాదినోత్సవంగా జరపాలని ప్రతిపాదించారు. ప్రపంచ వ్యాప్తంగా జరుగుతున్న శ్రామిక మహిళల పోరాటాలకు ప్రతీకగా ఓటు హక్కుతోసహా, మహిళల ఇతర కోర్కెల సాధన కోసం జరిగిన ఉద్యమాల స్మృతి చిహ్నంగా మార్చి8ని స్వీకరించారు.

1975వ సంవత్సరాన్ని ఐక్య రాజ్యసమితి అంతర్జాతీయ మహిళా సంవత్సరంగా ప్రకటించింది. ఆ తరువాత మహిళా దశాబ్దాన్ని జరపాలని నిర్ణయించడంతో మహిళా ఉద్యమాలకు మరింత ఊపునిచ్చింది.

అయితే శ్రామిక మహిళలు తమ స్వేదంతో, రక్తంతోనూ రచించిన పోరాటాల చరిత్రను మరుగు పరిచి మన దే శంలో ప్రభుత్వం మరియు కొన్ని సంఘాలు మార్చి8ని ఉత్సవ దినంగా మార్చివేసాయి.

పోరాటాల వారసత్వాన్ని తిరిగి జాగృతం చేయాలి.

ప్రపంచీకరణ సుడిగుండం మహిళల స్థితిగతులను కొత్త మలుపు తిప్పుతున్నవి. ఉదారవాద ఆర్థిక విధానాలు, స్వేచ్ఛా మార్కెట్లు, స్త్రీ, పురుష వైషమ్యాలు పెరిగాయి. రాజకీయాల్లో, ప్రభుత్వాల్లో స్త్రీల ప్రవేశం ప్రశ్నార్థకమైంది. మహిళలకు అందాల్సిన అధికారాలు అందకుండా యుగ యుగాలుగా పాతుకున్న పితృస్వామిక వ్యవస్థ, దాని తాలూకు కట్టుబాట్లు అవరోధంగా ఉన్నాయి. వర్గ భేదాలతోపాటు మౌళిక విధానాల్లో వివక్షతవల్ల మహిళలపై నేడు నిరంతరాయంగా దాడులు పెరుగుతున్నాయి.

ధనికదేశాల ఆర్థిక, సాంస్కృతిక దాడి ముమ్మరమైంది. బహుళ జాతి కంపెనీలు తమ ఖరీదైన, విలాసవస్తువులతో మన బజారుల్ని కబ్జా చేస్తున్నాయి. సంక్షేమ పథకాలన్నింటిని నిలిపివేసే కుట్రలో ప్రభుత్వం కూడా వారితో చేతులు కలుపుతోంది. స్త్రీలకు ప్రతికూలమైన ఒక క్షీణ సంస్కృతిని మీడియా జనంపై రుద్దుతోంది.

దేశాన్ని ముంచేస్తున్న పై సునామిని ఎదుర్కోవడానికి అవనిలో సగమైన మహిళలు ఐక్యంగా కదిలి, తమహక్కులను సాధించుకోవాలి.



| | |
|---|---|
| | **మనసు ఫౌండేషన్** |
| | **పుస్తకాల పరిశీలనాపట్టిక** |

| | |
|---|---|
| **పుస్తకం సంఖ్య** | CMV01A134 |
| **పుస్తకం పేరు** | చైతన్య [illegible] |
| **తారీఖు** | 21/6/23 |
| **ముందు అట్ట** | yes |
| **వెనుక అట్ట** | yes |
| **మొత్తం పేజీలు** | 53 |
| **పెద్ద సైజు పేజీలు** | NO |
| **ఖాళీ పేజీలు** | NO |
| **లేని పేజీలు** | NO |
| **తయారు చేసినది** | Sandhya |
| **పేజీలు విడదీసినది** | Sandhya |
| **స్కాన్ చేసినది** | SANDHYA |
| **పరీక్ష చేసినది** | AMRUTHA |
| **పేజీలు సరిచూసినది** | |
| **బైండింగు చేసినది** | |
| **ప్యాకింగు చేసినది** | |
| **స్కాన్ చెయ్యనిది** | |
| **తప్పులు** | NO |
| **పరిస్థితి** | good |